# మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు

రచన, పబ్లిషర్ : బంగోరె

సహాయకుడు : జి. ఆంజనేయులునాయుడు

పీఠికా రచయితలు :
దిగవల్లి వెంకటశివరావు,
కె. వి. రమణారెడ్డి, నగ్నముని.

ముఖపత్ర రచన :
పి. సి. యస్.

a research on the novel, malapalli,
that was twice banned by the government

1979 april

researcher & publisher : bangorey

price : 16-00.

for copies :
visalandhra publishers, vijayawada-4
navodaya publishers, vijayawada-2

printers : freedom press, madras-21

నేను చదవని

సీరియల్, బోనస్ బాపతు నవలలను

తెగ చదివే

నా 'బెటర్ హాఫ్'

సుమిత్రకు

తాను చదవని యీ గ్రంథాన్ని

ప్రేమతో

అంకితం

—బంగోరె

" 'జర్నలిజం పరిధిలోనుంచి
ఈ అకెడమిక్ పరిశోధనారంగంలోకి
ప్రాకిపడ్డ' బంగోరె ఇంకా
రెండుపడవల్లో చెరో కాలు
పెట్టివున్నాడు. అదే వాంఛనీయం.
లేకుంటే అకెడమిక్ పరిశోధన వట్టి
శిరోవేదన అవుతుంది. అట్లని
వట్టి జర్నలిజం పరిశోధన కావల్సినదాన్ని
కుప్పిగంతుల బాపతు స్కూప్స్
స్థాయికి దించుతుంది. వీటిని రెంటినీ
సమ్మిశ్రణ చేయడం రెంటికీ లబ్ధి.
ఆసక్తిని ఆరిపోనివ్వకుండానే విజ్ఞానాన్ని
అందజేయడం గొప్ప విద్య. బంగోరె
చేస్తున్నదే ఇది. టెక్నిక్
అనన్యం..."

—1977లో వచ్చిన "బ్రౌన్ లేఖలు..." గ్రంథంపై
వొక పత్రికలో వొచ్చిన సమీక్షలోంచి
వొక శకలం.

# విషయసూచిక

## అధ్యాయాలు



## అనుబంధాలు

---

దిగవల్లి వెంకటశివరావు

# నిషేధానికి నేపథ్యంలో పనిచేసిన శక్తులు

బ్రిటిష్ పరిపాలన కాలంనాటి ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన రికార్డు ఫైళ్లు అనేకం చెన్నపట్నంలో తమిళనాడు ప్రభుత్వం వారి వశంలో నున్నవి. వీటిలో కొన్ని హైద్రాబాదుకు తరలించబడాయి. వీటిని గురించి మన ఆంధ్రప్రభుత్వంవారు గాని, విశ్వవిద్యాలయాల వారు గాని, అకాడమీలవారుగాని, పిహెచ్. డి. విద్యార్థికులు గాని పట్టించుకోవడంలేదు. ఇటీవల కొంతకాలంనుండి అదేపనిగా పరిశోధన చేస్తూ వున్న నా మిత్రులు బంగోరెగారు అనాథప్రేత సంస్కారం చేస్తూ ఈ రంగంలో మొండిగా అమోఘమైన కృషి చేస్తున్నారు. అజ్ఞాత చరిత్రను వెలికి తెస్తున్నారు.

ఈ సంవత్సరం మొదట్లోనే బంగోరెగారు తన సొంత సొమ్ము ఖర్చుపెట్టి మాలపల్లి నవల నిషేధానికి సంబంధించిన ఫైళ్లను ఫోటో కాపీలు తీయించి నా వద్దకు పట్టుకొచ్చి చర్చించి వెళ్లారు. వెళ్లిన కొద్దిరోజులకే తాను రచించి ముద్రించిన గ్రంథ భాగాన్ని పంపి పీఠిక వ్రాయమన్నారు. ఇంత కొద్దికాలంలో ఇంత గొప్ప కృషి ఇంత శీఘ్రంగా చేయడం నా కాశ్చర్యం కలిగించింది. ఈ రికార్డులు పరిశీలించి, పాత పత్రికలు పరిశోధించి, ఊళ్ళంట తిరిగి చాలా విశేషాలు పోగుచేసి, పొందికగా సమన్వయ పరుస్తూ తెరవెనుక భాగవతాన్ని బయటకు తీసి ఈ అపూర్వ గ్రంథాన్ని రచించారు. ఇది ఆధునిక ఆంధ్రదేశ చరిత్రకు వాఙ్మయ చరిత్రకు అమూల్యమైనది.

ముఖ్యమైన ప్రభుత్వాధికారాలన్నీ గవర్నరు జనరలు – గవర్నరు– వారి తాబేదారులైన బ్రిటిషు పరిపాలకవర్గమువారి చేతులలోనే యుంచి, బిచ్చగాండ్రకు నాలుగు మెతుకులు విదిలించినట్లు కొన్ని చిల్లర అధికారాలను మాత్రం రాష్ట్రమంత్రులు నిర్వహించే "ద్వంద్వ" ప్రభుత్వ విధానాన్ని 1920 సంవత్సరంలో స్థాపించి, కొన్నాళ్ళకు అది ఎలా సాగుతున్నదో చూసి చెప్పవలసినదని నియమించబడిన సైమను కమిషనువారు 1930లో ప్రకటించిన రిపోర్టులో మద్రాసు రాష్ట్రంలో ఆస్తిని బట్టి వోటు హక్కు లివ్వబడినందువల్ల అక్కడ భూస్వామ్య ధనికవర్గాల వారికే అత్యధిక ప్రాతినిధ్యం కలిగినదని, స్త్రీలకు బీదవారికి వోటు హక్కు లేదని, రాష్ట్ర జనాభాలో నూటికి 15.5 వంతులున్న నిమ్నతరగతులవారికి నూటికి 4.1 వంతు ప్రాతినిధ్యం మాత్రమే లభించినదని, ఇది గొప్ప లోపమని వ్రాసినారు(చూడు : వారి రిపోర్టు, పుట191).

మద్రాసు రాష్ట్రంలో జస్టిస్‌పార్టీ మంత్రులు మొదటినుండీ గవర్నరుగారి కార్యాలోచన సంఘ సభ్యులతో కలిసి కూర్చుని ప్రభుత్వ విధానాలు నిర్ణయించే 'మంచి' సంప్రదాయ మేర్పడి, రాజ్యాంగ చట్టం ప్రకారం మంత్రులు–బ్రిటిషు పరిపాలకవర్గమువారు–వేరువేరుగా తమ అధికారాలను నిర్వహించే 'ద్వంద్వ' ప్రభుత్వంగా గాక వుభయులూ కలిసి పాలించే 'యూనిటరీ' ప్రభుత్వంగానే పరిపాలన జరిగినదని తమ సంతృప్తిని సూచించారు. ఇంతే కాదు. ఈ జస్టిస్ పార్టీవారు సహాయ నిరాకరణ ఉద్యమాన్ని అణచివేయడానికి కఠిన శాసనములు చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయపడ్డారని సంతోషాన్ని వెల్లడించారు (చూడు : పుటలు 203–4).

బ్రిటిషు పాలకవర్గంవారు, వారి తాబేదారులైన జస్టిస్ పార్టీ మంత్రులు ఏకమై జరిగిస్తూ వున్న యీ దుర్మార్గ ప్రభుత్వ స్వరూప స్వభావాలను వర్ణిస్తూ దేశభక్తులైన గరిమెళ్ల సత్యనారాయణగారు రచించిన "మా కొద్దీ తెల్లదొరతనము" అనే పాట సహాయనిరాక

రణ ఉద్యమకాలంనుండి ప్రజల హృదయాలను చూరగొన్నది. దానిని వ్రాసినందు కాయనకు మొదట ఒక సంవత్సరము శిక్ష వేసి, మళ్లీ కేసు పెట్టి రెండు సంవత్సరాలకు పెంచారు. దానిని పాడిన వారికి కఠిన శిక్షలు విధించారు. ఆ పాటను నిషేధించారు.

జస్టిస్‌పార్టీ మంత్రి పానగల్లురాజా రామారాయణింగారు చీరాల ప్రజలు మాకు మునిసిపాలిటీ వద్దని మొరపెట్టినా వినక, ఒక జీతగాణ్ణి మునిసిపలు చెయిర్మనుగా నియమించి శిక్షార్థపు పోలీసు దళమును పెట్టించి ప్రజలను హింసించారు. చీరాల ప్రజానాయకు డైన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని పట్టుకొని శిక్ష విధింపజేశారు. పల్నాడులో పేద సాదల బాధలను, పాలక వర్గంవారి అన్యాయాలను వెల్లడించినందుకు ఉన్నవ లక్ష్మీనారాయణగారికీ మాడభూషి నరసింహాచార్యులుగారికి శిక్షలు విధించారు.

సహాయ నిరాకరణోద్యమాన్ని అణచివేయడానికి బ్రిటిషు పాలకవర్గమువారూ, జస్టిస్‌పార్టీ మంత్రులూ ఏకమై జరిగించిన ఘోరకృత్యాలు, నిర్బంధ చర్యలు, దుర్మార్గాలు వర్ణనాతీతము. అంతటితో కసి తీరక దేశభక్తులైన రాజకీయ ఖైదీలకు దొంగ తనము మొదలైన నేరములు చేసిన సామాన్య నేరగాండ్రతోపాటు రాగి సంగటి పురుగుల పులుసు పోసి వారిచేత నూనెగానుగలు లాగించి, కంకరరాళ్ళు కొట్టించి జైలు నిబంధనల నుల్లంఘించినా రనే నెపంతో క్రూర శిక్షలు వేసి అనేక విధాల బాధించారు. ఇది అన్యాయమని స్వతంత్ర శాసనసభ్యులు విమర్శించగా జస్టిస్‌పార్టీ శాసనసభ్యుడైన రావుబహద్దరు కోవెలమూడి గోపాలకృష్ణయ్య చౌదరిగారు ప్రభుత్వ చట్టాల నుల్లంఘించిన వారుకూడా సామాన్య నేరగాండ్రేయని సమర్థించారు.

జైళ్లలోని లంచగొండితనము, అవినీతి వర్ణనాతీతము. ఆలన పాలన లేదు. ప్రభుత్వములోని వివిధశాఖలలో పోలీసువారిలో జరిగే దుర్మార్గాలకు హద్దుపద్దులు లేవు. క్రిమినలు నేరాలు చేసే జాతుల

కని స్థాపించిన సెటిల్మెంట్లు భూలోక నరకాలు. దిక్కులేని సామాన్య నేరగాంధ్రను కూడా అక్కడకు పంపేవారు. పేదసాదల బాధలు వినేవారు లేరు. 1937-39 మధ్య కాంగ్రెసు పరిపాలనలో తప్ప దేశానికి స్వరాజ్యం వచ్చేవరకు ఇలాగే సాగేది. స్వరాజ్యం వచ్చిన తరువాతను, అంతకుపూర్వమున్ను జరిగిన కాంగ్రెసు పాలనలో కూడా భూస్వామ్య ధనికవర్గాల వారి పలుకుబడి తగ్గలేదు. పేద సాదల-అట్టడుగు కులాలవారి బాధలు నివారణ కాలేదు. పశుత్వము, ధనాంధత, నిరంకుశత్వము, అజ్ఞానము రాజ్యంచేస్తూనేవున్నవి. వాటిని ప్రతిఘటించడానికి ప్రయత్నించిన దేశభక్తులు అహూతి యగుచునే యున్నారు.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు గొప్ప దూరదృష్టి గల వారు. ఆంధ్ర కాంగ్రెసు నాయకులలో మేటి సాహిత్యవేత్త. స్వరాజ్యంతో పాటు సమతారాజ్యం స్థాపించాలనే భావాలు కలవారు. అజ్ఞానము, పశుత్వము, ధనాంధత, నిరంకుశత్వము నిరోధించినవాడే వీరుడనీ, ఈ యుద్ధము ప్రపంచంలో నిరంతరంగా జరుగుతూ వుంటుం దనీ, పల్నాటిరంగంలో దానిని ప్రదర్శిస్తానని లక్ష్మీనారాయణగారు రచించిన 'నాయకురాలు' అనే గ్రంథంలో ప్రతాపుడనే పాత్ర నోట పలికిస్తారు. మాలపల్లిలో కూడా ఈ సాత్విక నిరోధ ధర్మయుద్ధము లనే మరింత విపులంగా చిత్రించారు.

అయితే ఉన్నవవారు అనాలోచితంగా ఒక పొరపాటు చేశారు. మద్రాసులోను, ఆంధ్రదేశంలోను, బ్రాహ్మణేతరోద్యమము ప్రబలముగా సాగుతుండగా, భూస్వామ్య ధనికవర్గాలవారిలో ప్రముఖులైనవారు జస్టిస్‌పార్టీ రూపంలో బ్రిటిష్ పాలకులతో ఏకమై ప్రభుత్వం వహించియుండగా, అందులో ముఖ్యపాత్ర వహించిన గుంటూరు కృష్ణాజిల్లాలలోని కమ్మవారి కులాభిమాన మహోద్యమము విజృంభించియుండగా—ఆ ప్రభుత్వ నిర్బంధ విధానంలో శిక్ష పొందిన సహాయ నిరాకరణవాదియైన ఒక బ్రాహ్మణ గ్రంథకర్త ధనిక భూస్వామ్యవర్గాల ధనాంధతను నిరంకుశత్వాన్ని ప్రద

ర్శించడానికి కల్పించిన కథాసంవిధానములో చౌదరయ్యను పాత్రగా చేయడము ఎంత పొరపాటు పని! ఏ బ్రాహ్మణ జమీందారునిగానో చేసివుంటే ఏ చిక్కూ లేకపోయేది. చౌదరయ్యను కమ్మ జమీందారుగా రంగంలోకి దింపేటప్పటికి కొంపలంటుకున్నాయి.

గుంటూరు కృష్ణాజిల్లాలలోని జనాభాలో కమ్మవారే ప్రబలురైన అధిక సంఖ్యాకులు. గొప్ప భూస్వాములూ గ్రామపెత్తనదారులూ వారే. ఆంధ్రదేశ రాజకీయాలలో—బ్రాహ్మణేతరోద్యమంలో—జస్టిస్ పార్టీలో ప్రముఖులు వారే. ఆంధ్రోద్యమముతో పాటు కమ్మ మహాజనసంఘమువారి స్వకులాభిమాన మహోద్యమము కూడా చిలవలు పలవలు దాల్చి విజృంభించినది. దాని ఫలితంగా కమ్మవారిలో విద్యాభివృద్ధి, రాజకీయ పరిజ్ఞానము, స్వకులాభిమానము వృద్ధియైనవి. అన్ని విషయాలలోనూ బ్రాహ్మణులను అనుకరించడమే గాక వారిని తలదన్నాలనీ ప్రయత్నించేవారు. కవిత్వంలో, గ్రంథరచనలో, సంగీత సాహిత్య వాద్య విద్యలలో, తుదకు పౌరోహిత్యంలో కూడా బ్రాహ్మణులకన్న మిన్నలనిపించుకోడానికి ప్రయత్నించేవారు.

కమ్మ మహాజనసంఘమువారి కేంద్ర స్థానము బెజవాడ. కమ్మ మహాసభలు చాలా చోట్ల జరిపేవారు. వీరి నాయకులలో అగ్రగణ్యులు బెజవాడ ప్లీడరు, తాలూకా బోర్డు ప్రెసిడెంటు రావుబహాద్దరు కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు. వీరు శాసన సభ్యులై జస్టిస్ పార్టీలో ప్రముఖస్థానం వహించారు. కాంగ్రెసును బ్రాహ్మణ నాయకత్వమును నిరసిస్తూ సహాయ నిరాకరణ మొకవిధమైన పిచ్చియని అభివర్ణిస్తూ ఇంగ్లీషులో The Indian Political Craze అనే గ్రంథాన్ని రచించారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు బారిస్టరై కొన్నాళ్లు బెజవాడలో ప్రాక్టీసు చేశారు. వీరు బ్రాహ్మణుల పురాణేతిహాసాలను శాస్త్రాలను పరిహసిస్తూ చాలా గ్రంథాలు రచించారు.

శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారు సచ్ఛాస్త్రి బిరుదమును వహించి బ్రాహ్మణుల దుర్మార్గాలను వివరిస్తూ అష్టాదశ మహాపాపి యైన బ్రాహ్మణునితో సహాయ నిరాకరణ మొనర్పుడని హెచ్చరిస్తూ తెలుగులోనూ ఇంగ్లీషులోను వందలాది పుటల గ్రంథాలను వ్రాశారు. శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు కమ్మవారి పుట్టు పూర్వోత్తరాలను దేశచరిత్రలో వారు వహించిన పాత్రను గూర్చి ఉగ్గడిస్తూ కమ్మవారి చరిత్రను రచించారు. దానిని క్రమంగా మూడు సంపుటాలుగా పెంచారు. ఆ కాలంలో కమ్మవారి ఆధిక్యతను బ్రాహ్మణుల నీచత్వమును గూర్చి ఉపన్యసింపని, వ్రాయని కమ్మ వారు చాలా అరుదుగా నుండేవారు.

ఈ పరిస్థితులలో మాలపల్లి ప్రకటింపబడినది. ప్రకటింప బడిన కొన్ని నెలలలోనే దానిని ప్రభుత్వంవారు నిషేధించారు. ఈ నవలలోని కథాసంవిధానం, పాత్రపోషణ కేవలము గుంటూరు కృష్ణాజిల్లాలలోని కమ్మభూస్వాములను అవమానించి, వారి క్రింది కూలిజనాన్ని రెచ్చగొట్టే దురుద్దేశంతోనే లక్ష్మీనారాయణగారు రచించారని కమ్మమహాజన సంఘములోని ప్రముఖులు అపోహ పడ్డారని, ప్రభుత్వమువారి చేత నిషేధింపచేశారని ఆ సంఘములోనివారే కొందరు వెల్లడి చేసినందువల్ల ఈ సంగతి ఆ కాలంలో బెజవాడ పట్నంలో బాహాటంగానే చెప్పుకోవడం ప్రారంభించారు.

మా మిత్రులలో డాక్టరు ఘంటసాల సీతారామశర్మగారు, జయంతిపురం రాజా అని ప్రసిద్ధి చెందిన శ్రీ వాసిరెడ్డి దుర్గాసదా శివేశ్వర ప్రసాదుగారు (వీరికిప్పుడు వయస్సు 80 సం॥లు), కాంగ్రెసు నాయకులైన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు మొదలైనవారు కూడా ఈ విధంగానే అభిప్రాయపడ్డారు. ఇటీవల రాజాగారు దీనిని గురించి మళ్ళీ మాట్లాడడంలో కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు తెర వెనుక పనిచేశారనేదానికి సందేహం లేదన్నారు.

బెజవాడ.

—దిగవల్లి వెంకటశివరావు

కె. వి. రమణారెడ్డి

# నా యాంగిల్ నుంచి

హీనోథీయిజం అనే మతభావ విశేషం ఒకటి వుంది. ఏకేశ్వరభావం వుండికూడా అనేకేశ్వర భావం సైతం అందులో వుంటుంది. ఏ దేవుణ్ణి ఆరాధించేప్పుడు అతడే సర్వేశ్వరుడు. మన బంగోరె మనస్తత్వం హీనోథీయిజానికి చక్కగా అమరిపోతుందేమోననిపిస్తుంది. ఇది ఎత్తిపొడుపని ఎవరైనా అనుకుంటే నా పూచీ లేదు.

బ్రౌనాయణంలో వున్నవ వేటకు పూనుకున్నాడు బంగోరె. ఆయన పూనికకూ పూనకానికీ అట్టే తేడా వుండదు. అందువల్లనే బంగోరె పట్టిందల్లా బంగారమౌతూ వుంటుంది. ఈ ముడి బంగారాన్ని అపరంజి చేసే వీలుండీ కూడా బంగోరె ఆ పనికి బెత్తెడు మొదంగానే ఆగిపోతుంటాడు. కారం అంగారం, మిరియం మసాలా దట్టించందే బంగోరె బంగోరె కాలేడు. ఎంత పరిశోధనాపరుడో అంత వివాదప్రియుడనిపిస్తాడు. అక్షర 'అర్బన్ గెరిల్లా' ననుకుంటాడేమో, తన తీవ్ర కృషిఫలితాన్ని ప్రతిదాన్నీ తప్పనిసరిగా బాంబుతో పోలుస్తాడు. హేండ్ గ్రెనేడ్లూ మోలటాఫ్ కాక్ టెయిల్సూ బాంబులూ వగైరా రెగ్యులర్ వార్ఫేర్‌కు అంతగా నప్పవు. గెరిల్లా యుద్ధక్రమంలోనే వాటికి ప్రాముఖ్యం. అందుచేత పండితులూ పండితమ్మన్యులూ నోళ్లు నొక్కుకుంటూ రొమ్ములు బాదుకుంటూ పొడుం ముక్కుల మీద సిరా వేళ్లేసుకునేలా, హిట్ అండ్ రన్ ఎత్తుగడలతో మన అకాడమిక్ అరణ్యవీథుల్లో లైట్నింగ్ రెయిడ్స్ చేస్తానంటాడేగాని, స్థిమితంగా వస్తుపరమైన దృష్టితో హుందాగా పెద్దమనిషితనంతో

తన పోరాటాలను ససేమిరా సాగించనంటాడు యింకా పూర్తిగా మచ్చికగాని యీ పరిశోధక సాహసికుడు. ముళ్ళదారికే మళ్లుతా నంటాయి గాని, యిసుక డొంకలను ఒల్లనంటాయి బంగోరె పాదాలు. తెలిసింది, తెలిసిపోయింది, అని అనుకునే అల్పప్రజ్ఞుల కూటాల నట్టనడుమ పేలి, ప్రగల్భంగా మోగుతూ, మీకు తెలిసిన దానికంటె తెలియనిదే ఎక్కువ అని మొట్టి కొట్టి చెబుతూంది బంగోరె 'బాంబు' ఏదైనా. చాలామంది నొచ్చుకుంటారు, కొందరు ఏడ్చుకుంటారు, కొద్దిమంది ఎదురుతిట్ల దండకం విప్పుతారు, ఒక రిద్దరు యింకా ముందుకు వచ్చి బంగోరెని నీచాతినీచంగా కూడా ఖండించ బూనుకుంటారు. ఇలాంటి ప్రతిఘటనా బంగోరెని మరింత రెచ్చగొట్టుతుందేగాని లొంగదీయదు. ఆయనది యిక్కడ కూడా ఆరణ్యప్రకృతే.

మరి, నాలాంటి వాళ్ళుగాని నేనేగాని బంగోరెని అభిమానించడం కులాన్ని బట్టో స్నేహాన్నిబట్టో మొగమోటాన్నిబట్టో అను కుంటే చెప్పగలిగిందేమీ వుండదు. బంగోరె కష్టించి సమకూర్చి పెట్టే ఫలసాయం పనికివచ్చేది కావడంచేతనే ఆయనంటే నాకు యిష్టం. పైగా, బంగోరె దృక్పథం హేతుబద్ధం, ఆధునికం, ప్రగతి శీలం కావడం మరీ మరీ నాకు యిష్టం. తాను పొగరుబోతు అని పిస్తానే "విద్యాలవ దుర్విదగ్ధుల", పండితబ్రువుల, అజ్ఞానైక విలసితా హంభావుల, గతైకదృక్కుల, సాంప్రదాయికుల, గతానుగతికుల, అనర్థకారుల, నిరర్థక బిరుద విభ్రాజమాన బభ్రాజమానుల, పొగరు బోత్తనంమీద చిచ్చర పిడుగులు కురిపించేవాణ్ణి ప్రతిఒక్కణ్ణీ నేనభి మానించి తీరుతాను. ఈ విషయంలో ఎవ్వరి చేతనైనాసరే శాసింప బడను.

బంగోరెకి యోగ్యతా పత్రం యిద్దామనికాదు ఇదంతా ఇక్కడ రాయడం. ఆ యోగ్యత నాకుండాలి గద! నిజానికి బంగో రెతో నేను విభేదించే అంశాలు ఒకటీ రెండూకాదు. అయినా,

మాలికంగా మాత్రంకాదు. ఇది మా దృక్పథాలలో గల తేడా. అది తీవ్రమైందే.

ఈ పుస్తకాన్నే తీసుకుందాం.

''సాహిత్య వుగ్రవాదుల''ని ఒక పాద పీఠికలో బంగోరె ముద్రగొట్టిన వాళ్లలో నే నొకణ్ణవునో కాదో తెలియదుగాని, ఈ ముద్రగొట్టే దుందుడుకు తనానికి మాత్రం నేను వ్యతిరేకిని. ఇది మంచిపద్ధతీకాదు, మంచిపనీకాదు. సాహిత్య వుగ్రవాది తానే అయి నప్పుడుగాని తదితరుల నిలా తుస్కా–యించి వెయ్యరు. 'వృద్ధనారీ పతివ్రతా' చందంగానో కాగి చల్లారిన పాల చందంగానో నేనీ మాట లంటున్నానని ఆ ఒకరుగాని మరొకరెవరైనాగాని నన్ను యెదురన వచ్చు. అననీ! ఒకమాట మాత్రం ఒప్పుకుంటాను: 'నెగటివిజం' అని ''సాహిత్య వుగ్రవాదుల'' గుండె లోలోతుల నుంచి వెలికిలాగి బంగోరె చూపుతున్న వైఖరి, సదరు వ్యక్తుల మానసికారోగ్యానికి చిహ్నం కాదు. అయితేమాత్రం, 'నెగటివ్' వైఖరిలో సైతం 'పాజిటివ్' అంశ వుండదా? ఒక వస్తువు వున్నంతకంటె బాగుండా లని కోరుకుంటేనేగదా తెగనాడేది? అందుచేత, బంగోరె పట్టిన కుందేటికాళ్ళు కూడా నాలుగేగాని ముమ్మాటికీ మూడుకావు.

*    *    *

ఉన్నవ లక్ష్మీనారాయణ ''పంతులు'' గారిని మినీ వీరేశలింగం ''పంతులు'' గారని ఎవ్వరన్నా ఎందుకన్నా నాకు అభ్యంతరమే.

రాజమండ్రిలోని శరణాలయాన్ని నిర్వహించి వుండవచ్చు. గుంటూరులో వితంతు పునర్వివాహాలు జరిపించి వుండవచ్చు. శారదానికేతనం స్థాపించి నడిపే వుండవచ్చు. శ్రీ కృష్ణాశ్రమానికి సారథి అయీ వుండవచ్చు. చివరికి, వీరేశలింగంను గురులింగంగా యెంచివుండవచ్చు కూడా, అయినా ఉన్నవ మనసూ దినుసూ వేరే. కఠోరమైన ఏకాగ్రత, క్రూరమైన దయ, నిష్ఠాగరిష్ఠమైన సంస్క–

రణం, రణ సన్నిభమైన వుద్యమం—యివి వీరేశలింగానికున్నంతగా ఉన్నవకు లేవు. తరాల అంతరం మాత్రమే కాదిది. లోక తత్వం విషయంలోనే యీ యిద్దరికీ ఎంతో వార. మతం, సంప్రదాయం, వంటి విషయాలలో వీరేశలింగం కంటె ఒకడుగు వెనక్కే ననిపిస్తాడు ఉన్నవ. హైందవ మత సంస్కృతి పట్టు ఉన్నవ మీదే ఎక్కువేమో! "స్వదేశీ", "స్వరాజ్యం"—యీ మాటలకు గల అర్థం ఉన్నవలో తీవ్రతరమై, మొదట తిలక్‌కూ పిదప గాంధీకీ తనని అత్యంతాలా అంకితం చేశాయి. రనడే, గోఖలేల శకాన్ని దాటి లాల్-బాల్-పాల్‌ల శకాన పడిన దేశకాల పరిస్థితులలో ఉన్నవకు రాజకీయంగా వుగ్ర వచ్చింది. గాంధీ - చిత్తరంజన్‌దాస్‌ల శకానికి వచ్చి చేరిన దేశకాల పరిస్థితుల్లో ఉన్నవ వ్యక్తిత్వం విస్ఫారించింది.

శరణాలయ నిర్వాహకుడుగా కొద్దికాలం పనిజేసిన ఉన్నవ ఏ విషయంలో వీరేశలింగంతోటి విభేదించి రాజమండ్రినుంచి నిష్క్రమించి వుంటాడు? సంస్కరణ విషయంలోనా? అయివుండదు. రాజకీయంలోనా? అదీ అయివుండదు. అప్పటికి (1906–07) మాత్రమే గాక, 1910–11 వరకటిదాకా కూడా అప్పటి రాజకీయ "వుగ్రవాదుల"యిన టెర్రరిస్టుల విషయంలో ఉన్నవ వైఖరి సుముఖంగా లేదు. 'మాలపల్లి' "సంగవిజయము" అయిందే గాని 'వేంకట విజయము' కాలేదు కదా! ఐర్లాండు స్వదేశీ వుద్యమం మలుపు తిరిగి డీవేలరా నాయకత్వాన సాయుధ పోరాటంగా మారిన తరుణంలో ఐర్లాండులో బారిస్టరీ చదివి వచ్చాక కూడా, ఉన్నవ వైఖరిలో నిజమైన, బలమైన మార్పేమీ రాలేదు. శాన్‌ఫాన్ వుద్యమ క్రమంలో జరిగిన 'ఈస్టర్ రిబెలియన్' లాంటి దాన్ని ఉన్నవ వూహించికూడా వుండడు, బలపరచడందాకా యెందుకు? 'చిట్టగాంగ్ ఆర్మరీ రెయిడ్'గా ప్రసిద్ధి పొందిన జాతీయ విప్లవకారుల సైనిక చర్య, ఈస్టర్ రిబెలియన్‌కు నకలు. అందుచేత 'హింసా' ప్రయోగం గురించి ఉన్నవకూ వీరేశలింగానికీ చెప్పుకోతగినంత భేదాభిప్రాయం వుండివుండదు. పోనీ, మార్క్ హాంటర్ ప్రిన్సిపాలు

గిరీలో రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజిలో గాడిచర్ల హరిసర్వోత్తమ రావు నాయకత్వాన సాగిన విద్యార్థుల ధిక్కార ప్రదర్శన గురించి పేచీ పడ్డారా ఆ యిద్దరూ? దాఖలా లేదు. వీరేశలింగం ముక్కోపి అయినందుచేత ఆయనతో గానీ ఆయన కిందగానీ పని చెయ్యడం అందరికీ సాధ్యపడేది కాదు. ఇదే కారణమై వుండాలి.

కొండ వెంకటప్పయ్య "పంతులు" గారికీ ఉన్నవ లక్ష్మీనారాయణ "పంతులు" గారికీ సరిపడేదేనా? విద్యలో, త్యాగంలో, వెంకటప్పయ్య కేమీ తీసిపోని ఉన్నవకు వెంకటప్పయ్యకు వచ్చినంత ప్రసిద్ధీ, ప్రశస్తీ ఎందుకని రాలేదు? ఇద్దరూ గొప్ప జాతీయవాదులే నైరి. పల్నాడు పుల్లరి సత్యాగ్రహం మూడేళ్ల ముచ్చటైనా కాలేదు, ఆ కొద్దికాలంలో యింకా కొద్ది భాగంలో మాత్రమే ఉన్నవ ఒక వెలుగు వెలిగాడు. ప్రతి సత్యాగ్రహంలోనూ పాల్గొన్నాడు. జైలు ముఖం పలుమార్లు చూసి వచ్చాడు. చివరికి 1934 లో పూనాజైల్లో తన "హరిజనుల" గురించి 'కమ్యూనల్ అవార్డు' కు నిరసనగా ఆమరణ నిరసన వ్రతానికి గాంధీ సిద్ధమైనప్పుడు, ఇక్కడ గుంటూర్లో అదే పని చేశాడు ఉన్నవ. అయినా రాజకీయంలో 'రాణించాడు' కాడు. సంస్థలో యిమడకనా? పదవులు ఆశించకనా? జవాబు దొరకదు. మొత్తానికి, ఐస్ బెర్గ్ లాగా ఉన్నవ రాజకీయంలో అజ్ఞాత భాగమే ఎక్కువ.

రాజకీయంగా ఉన్నవ ఎదుగుతూ వచ్చాడు, లేదా మారుతూ వచ్చాడనడమే సరైనమాటైతే మారుతూ వచ్చాడు. "అసహాయ యోగం" తన మది కెక్కకముందు తిలక్ తన తలకు బలంగా పట్టిన దాఖలా లున్నాయి. తిలక్ గీతా రహస్య కృష్ణుడూ ఉన్నవ పల్నాటి బ్రహ్మనాయుడూ ఒకలాంటి వారే కాకపోవచ్చుగాని వారి మొక్కట్లు మాత్రం ఒకలాంటివే. గాంధీ 'మహాత్ముడ'య్యాక పూర్తిగా గాంధేయుడైపోయాడా అంటే, ఉన్నవ తాత్కాలికంగానైనా 'ప్రో చేంజరు'గా మారి, సి. ఆర్. దాస్—మోతీలాల్

నెహ్రూల 'స్వరాజ్ పార్టీ' అభిమాని అయ్యాడు. అన్నా ప్రగ్గడ కామేశ్వరరావు అనే యువకుడి 'హింసా' వాదానికి నైతిక అభ్యంతరమూ చెప్పలేదు. అలాగే, తాను 'కమ్యూనిజం' అనుకున్న, బంగోరె 'కమ్యూనిజం' అనుకుంటున్నదాన్ని తన నవలలో ప్రముఖంగానూ ఆకర్షణీయంగా కూడాను చిత్రించడానికి వెనుకాడలేదు. సరికదా, కమ్యూనిజాన్ని ప్రచారం చెయ్యడం నేరమేమీ కాదని ధైర్యంచేసి చెప్పడానికి గూడా వెనుదీయలేదు. కాబట్టి, ఉన్నవ రాజకీయం నిశ్చితంగా యిదీ అని తేల్చి చెప్పడం కష్టం.

వెంకటదాసు, పోనీ, తక్కెళ్ళ జగ్గడు కమ్యూనిస్టేనా అని? "కృతయుగ ధర్మం" కమ్యూనిజమేనా అని? బంగోరె కోపపడవచ్చునేమోగాని, యిది మార్క్సియన్ సోషలిజం కాదు. వర్గపోరాటాన్ని గుర్తించినంత మాత్రాన ఎవ్వడూ కమ్యూనిస్టుకాలేడని, సదరు పోరాటం తాలూకు అంతిమ ఫలితమైన శ్రామికవర్గ నియంతృత్వాన్ని గుర్తించి అందుకోసం విప్లవోద్యమంలో క్రియాశీలంగా పాల్గొనేవాడే కమ్యూనిస్టు కాగలడని లెనిన్ చెప్పిన మాటలు గుర్తుంచుకుంటే, ఉన్నవ ఒకలాంటి 'యుటోపియన్' సోషలిజం అనవలసివస్తుంది. "ధర్మకన్నాలు" రాబిన్‌హుడ్‌ని జ్ఞాపకం చేస్తాయిగాని కమ్యూనిస్టునికాదు. "ఆదికాలం"నాటి సౌభ్రాత్ర, సమానత్వాలు అచ్చుకి మచ్చుగా ముందునాళ్ల కమ్యూనిజానికి నప్పవు.

ఇతరులకు "జాతీయ" చారిత్రకావగాహన లేదని బంగోరె అనడం బహుతేలిక. నవంబరు విప్లవానికి ఎంతో ముందుగానే మన దేశానికి సోషలిస్టుభావాలు దిగి వచ్చాయి. రాజా రామ్మోహన్ రాయ్‌కీ రాబర్ట్ ఓవెన్‌కీగల పరిచయాన్ని అటుంచుదాం. దాదాభాయి నౌరోజీకీ కీర్‌హార్డీకీగల భావబాంధవ్యాన్నీ అటుంచుదాం. మదాం కామాకూ అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమానికీ గల సంబంధాన్ని కూడా పక్కన పెడదాం. బ్రాహ్మసామాజికులలో ఎవరో నేరుగా కార్ల్ మార్క్సును సంబోధించి, ఇంటర్నేషనల్ వర్కింగ్

మెన్స్ యూనియన్ (ఫస్ట్ ఇంటర్నేషనల్) శాఖను ఒకదాన్ని కలకత్తాలో స్థాపించడం గురించి రాసిన ఉత్తరం ఎంతో ప్రాముఖ్యం గల ఘటన. అందుచేత, జవాహర్ లాల్ నెహ్రూగారి ఫేబియన్ సోషలిస్టుభావాలు గాంధీయిజంతో మరీ పలచబడడానికి యాభై యేళ్ళ ముందుగానే మార్క్సియన్ సోషలిస్టుభావాలు మన గడ్డ మీదికి అతి మందకాంతితోనైనాసరే దిగివచ్చాయి. ఇలా అంటేనే, ఉన్నవ తరహా 'కమ్యూనిజం' మనకు కూడా సరికొత్త దినుసేమీ కాదని అర్థం. తిలక్ సోషలిస్టుగాకున్నా, స్వరాజ్యసాధన కోసం జార్ చక్రవర్తి హయాంలోనే బొంబాయిలో రష్యన్ దౌత్య వ్యవహర్తలతో కలిసి మాట్లాడాడు. యం. యన్. రాయిగా మారిన ఒక జాతీయ విప్లవకారుడు మెక్సికోలో సోషలిజం ప్రభావం పడి రష్యాకు వెళ్ళి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (కోమింటర్న్)లో ప్రాచ్యదేశాల జాతీయ విమోచనోద్యమాల గురించి లెనిన్‌కు ఒక సలహాదార య్యాడు. నవంబరు విప్లవానికి ముందే, జారిస్టు రష్యాబూచిని చూపి బ్రిటిష్ ప్రభుత్వం మాటి మాటికీ మన జాతి సంపదను కొల్లగొట్టి దుర్వినియోగం చేస్తూ వచ్చిందని రవీంద్రనాథ్ ఠాగూర్ వాచ్యంగా ఆక్షేపించి వున్నాడు. కాంగ్రెసుసంస్థ శైశవదశలోనే, రష్యన్ సామ్రాజ్య విస్తరణ వ్యతిరేకంగా బ్రిటిషు వలసాధిపతుల యుద్ధ ప్రయత్నాలకు ధనమాన ప్రాణాలను అర్పించగలమంటూ మన జాతీయనాయకులు తీర్మానాలెన్నో చేసివున్నారు. ఆంధ్రదేశంలో కూడా ఆనందగజపతిలాంటి జమీందార్లేగాక వారి ఆశ్రితులైన గురజాడ అప్పారావులాంటి వాళ్ళుసైతం రష్యన్ వ్యతిరేక యుద్ధం వస్తే చావనైనా చస్తామంటూ కవాతుచేశారు. ఈ 'వలంటీర్' సమస్య బ్రిటిషు వలసాధిపతులకు ఆరోజుల్లో కొరకరాని కొయ్యగా మారింది. ఇప్పుడు, నవంబరు విప్లవం తర్వాత, పాత రష్యన్ వ్యతిరేకతకు తోడుగా కమ్యూనిజం వ్యతిరేకత కొత్తగా వచ్చి చేరింది. కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికలలో పట్టాభి సీతారామయ్యలాంటివాళ్లు కమ్యూనిజాన్ని సమర్థించకున్నా, విప్లవానంతర పరిణామాల గురించి

ఆసక్తి చూపుతూ వ్యాసాలు రాస్తూ వచ్చారు. అసలు యీ కొత్త బూచి విషయంలో బ్రిటిషు పాలకుల నిజాయితీని శంకించే వ్యాసాలూ వచ్చాయి. కాబట్టి ఉన్నవతోనే కమ్యూనిజం ప్రచారం మొదలైందని చెప్పడం చారిత్రకంగా వాస్తవం కాదు. అయినా, యింత నిర్భయమైన పని చేసినందుకు ఉన్నవను ఎంత గొప్పగానైనా అభినందించవచ్చు, అభినందించాలి కూడా. సాహిత్యంలో దీన్ని తనకు తోచినవిధంగా చిత్రించి, 1934 తర్వాత ఆంధ్రప్రాంతంలో తలెత్త సాగిన రైతు రక్షణ సంఘాల, కూలి రక్షణ సంఘాల ప్రచారానికి తాను అనుకోకుండానే ఒక గొప్ప ఆయుధాన్ని అందించాడు ఉన్నవ. దీన్ని నిరూపించినందుకు బంగోరెని మనసారా మెచ్చుకుంటున్నాను.

పోతే, 'మాలపల్లి' నవల.

*                    *                    *

తెలుగులో నాటకానికి 'కన్యాశుల్కం', నవలకు 'మాలపల్లి' ఈ నాటికీ సాటిలేనివి. వాటిలో 'జీవితం' వుంది, దాని తాలూకు 'వాస్తవం' స్పందిస్తూంది కాబట్టే అవి అనన్యం, అసమానం కాగలుగుతున్నాయి. 'ఈస్ట్‌లిన్'కూ 'మాలపల్లి'కీ బాదరాయణ సంబంధం కూడా లేదు.

'మాలపల్లి' సృష్టి. సృష్టి అంటే కల్పనా కథ అని కాదు. లోకవృత్తాన్ని అనుకరించడం కంటె కళాత్మకంగా అనువదించడమే వాస్తవవాద రీతికి నప్పుతుంది. రచయిత తాను పుట్టి పెరిగి జీవించే తన సమాజంతో ముఖపరిచయం మాత్రమే కలిగివుంటే చాలదు. సమాజ జీవితం చిక్కటి పొదరిల్లు, బీరకాయపీచు, గిజిగాని గూడు. రచయిత అనుభవపరంగానూ అనుభూతిపరంగానూ దానిలో మమేకమై, లోతులు తరిచి సూత్రాలు లాగి పట్టుకునే ప్రజ్ఞను సంపాదించుకుని కళాత్మకంగా అక్షరరూపంలో తన దర్శనాన్ని ఆవిష్కరించినప్పుడే, జీవితంలోని వ్యక్తావ్యక్తమైన, లేతా ముదురువైన, అనే

కానేక వైరుధ్యాలను ప్రదర్శించినప్పుడే, గొప్ప రచయిత కాగలడు. విరివీ, లోతూ రెండూ వున్నదే మేలి రచన. అది అద్దంలా జడ పదార్థం కాదు, కాగూడదు కూడా. Holding up the mirror to Nature అనడం సరైందికాదు. అదే చాలదు. గొప్ప రచయిత బుద్ధి సినీ కేమరా కంటె ఎంతో జటిలమైన ఆశ్చర్యకరమైన పదార్థం. ఏ చిత్రకారుని కుంచెకూడా దీనికి గల శక్తి వుండదు. ఇవి మనుషుల బాహ్యాభ్యంతరాలను కూడా తరచి చూడగల ఎక్స్‌రే పరికరం కంటె గొప్పది. ఇంకో విషయ మేమిటంటే, గొప్ప రచన తాలూకు సారం దేశకాలాతీతమైతే కావచ్చునేమో గాని, దాని విషయం, విధానం, తప్పనిసరిగా దేశకాలాలకు లోబడినవే. మహా ప్రవాహ గతిలోని ఒకానొక తరంగాన్నో ఊర్మికనో నిలిపి సాకల్యంగా దర్శించి విశ్లేషించగల నిర్దిష్టతా లక్షణమే, గొప్ప రచనకు సారంలో గల విశ్వజనీనతకు విషయ, విధానాలలోగల విలక్షణతను తెచ్చి కలుపుతుంది. ఇలా చూస్తే, 'మాలపల్లి' గొప్ప రచన.

చౌదరయ్య లాంటి ఒకానొక మెట్టప్రాంతపు పాతపెత్తందారీ పద్ధతుల భూస్వామిని తృటికాలం ముందుకు తెచ్చి, అతని చేతిబడితె కర్రలో భూస్వామ్య వ్యవస్థ తాలూకు దర్ప దుర్మార్గాలను చూపడం, రచయితగా ఉన్నవకు గల సూక్ష్మశక్తికి నిదర్శనం. అయితే భూస్వామ్య వ్యవస్థ సమస్తం యిందులో యిమిడేంతటి చిన్న వస్తువు కాదు. రామానాయుడు కొత్తతరం మనిషైతే కావచ్చు. సంస్కరణాభిమాని అయినా కావచ్చు, గాని చౌదరయ్యలాగా అతడొక 'టిపికల్' పాత్ర కాదు. 'టిపికల్‌నెస్' అంటే, ఒక ఘటన గానీ ఒక పాత్రగానీ, అలాంటి అనేక యితర ఘటనలకూ పాత్రలకూ మచ్చుతునక వంటిదై వుండాలన్నమాట. ఒకానొక మాలదాసరి కుటుంబాన్నే ఎందు కింత ముందుకి తెచ్చారు ఉన్నవ? రామదాసూ, అతని కుమారుళ్ళూ కుమార్తే, వీళ్ళైనా ఆ కులానికి మచ్చులు కాదగినవాళ్లు? శ్రీనాథుడు 'చతుర్థ మహాన్వయంబ''ని అన్నాడు గాని అంతకంటె విస్తారమైన మహాన్వయం 'పంచముల'ది. అదీ ఇదీ

కూడా అఖండమైన ఏకైకమైన కులం కాదు, అనేక కులాల కూడిక. "వర్ణాశ్రమ సోపానక్రమ సమ్యగ్విభక్తంబు" అని ఒక ఆధునిక సనాతనాచార ప్రియుడు క్రమాలంకార మనిపించేట్టు హైందవ సమాజాన్ని వర్ణించడం ఇటీవలే జరిగింది. అయితే హైందవ సమాజ మంతటి అక్రమ వ్యవస్థ మరొకటి భూప్రపంచకంలోనే కనిపించదు. గురజాడ అన్నట్టు "వర్ణధర్మ మధర్మ ధర్మంబే". నిజానికి వర్ణాలు పుస్తకాల్లో తప్ప బతుకుల్లో ఎక్కడున్నాయి, ఎప్పుడున్నాయి? వర్ణ విభజన భావ పరమైనంతగా వాస్తవపరమైంది కాదు. బ్రహ్మ, క్షత్ర, వైశ్యులే తొలి వర్ణాలు. ఇవీ స్థిరమైనవి కావు. చివరికి మిగిలింది బ్రాహ్మణ వర్ణం మాత్రమే. క్షత్రియులూ వైశ్యులూ పేర్లలోనే నిలిచిపోయారు. అనంతర వేదయుగంనాటికి చతుర్థవర్ణం వచ్చింది. అగ్రవర్ణాలకు వూడిగ మొక్కటే దాని జీవిక. కొండ జాతులవాళ్లు ఇప్పటికీ వర్ణ వ్యవస్థ చట్రంలోకి రాలేదు. 'ధర్మ శాస్త్ర' యుగంనాటికి, యీ అసమ సమాజం దరిదాపులకు వచ్చి దూరంగా నిలిచిపోయినవాళ్లు శ్వపచులు, చండాలురు, అస్పృశ్యులూ నైన పంచములు. వేట బతుకుదెరువుగా వుండిపోయిన జాతులో తెగలో ఆర్యులకూ, ద్రావిడులకూ పూర్వమే వచ్చి ఈ దేశంలో కాలు నిలదొక్కుకుని వున్నవాళ్ళు కావచ్చు. ఆర్య హైందవ సమాజంలోకి ప్రవేశం దొరక్క, అధమాధమమైన వర్ణానికీ యోగ్యత లేదనిపించుకుని, శిథిల జీవనులైనవాళ్ళూ కావచ్చు. ఏమైతేనేమి గాని, జాత్యహంకారానికి తరతరాలుగా బందీలై కాయకష్టమే ఆస్తిగా మిగిలిపోయి దిక్కుమొక్కు లేని 'అలగా' జనమయ్యారు. మనుష్య మర్యాదకు గూడా 'నోచుకో' లేదు. దాసులైన శూద్రులకు గూడా దాసులై, దాసానుదాసులైన ఈ 'దస్యుల' సంతతి మధ్యయుగాలలో రాజుల, రాజన్యుల యుద్ధాలకు సైనికులుగా, భూములకు 'లెంకలు'గా మాత్రం పనికివచ్చారు. శ్రీ 'వైష్ణవం' కొందరిని గురువులను చేసి తమవారిలోనే గౌరవస్థానాలకు పైకెత్తింది. భక్తి వుద్యమం చేకూర్చిన కొద్దిపాటి సత్ఫలితాలలో

అధమ వర్ణాల పూర్వోన్ముఖ సంచలనం ఒకటి. ఈ రామదాసు ఆ విధంగా లాభించిన చాలులోని మొక్క. 'శాంతమ్ పాపమ్' బాపతు తత్వం అతని నరనరానికీ ఎక్కి, సౌజన్యం అనేదీ సాధుత్వం అనేదీ వికటించి, 'సెల్ఫ్-డిఫీటింగ్'గా మారింది. సంగదాసు హత్యకు చౌదరయ్య దౌర్జన్యమే కారణం కాదు, రామదాసు సౌజన్యంకూడా కారణమే. అందుచేతే సంగదాసుకు 'కౌంటర్ ఫాయిల్' అవసరమయ్యాడు. అతడే వెంకటదాసు వరఫ్ తక్కెళ్ల జగ్గడు.

పెద్దిభట్ల వీరయ్య స్వీయచరిత్రలో ఒక గజదొంగ ప్రస్తావన వస్తుంది. 'చీకటి జమీందారు' సనిపించుకునే యీ దారి దోపిడి తండా నాయకుడు సాధుసన్యాసులంటే మాత్రం భయభక్తులు చూపుతూ సత్కారాలు సమ్మానాలు చేస్తూవచ్చాడు. గాంధేయుడైన సంగదాసూ 'కమ్యూనిస్టు' అని బంగోరె అనుకుంటున్న వెంకటదాసు వరఫ్ జగ్గడూ నాయక, వుపనాయకులేగాని సమవుజ్జీలు మాత్రం కారు. విజయం మాత్రం సంగదాసుదే- అంటే- గాంధీదే. చిత్త సంస్కారం, అనునయం, ఆత్మోన్నతి వగైరా 'సు' గుణాలదే. 'హింస' అనబడే బలప్రయోగం అంతకంటె ఎంతో ఎక్కువగా ప్రభుత్వరూపంలో సుసంఘటితమై, సుశిక్షితమై, అధిక మారణకరమైన బలప్రయోగం ముందు ఓడిపోక తప్పదు. అందుచేతనే ఉన్నవ పక్షపాతి. ఇది నిందకాదు, విమర్శకాదు, ఉన్నదాన్ని ఉన్నట్టు చెప్పడమే. టెర్రరిజం, జాతీయ విప్లవపోరాట పరంపర, శాన్ ఫాన్ వుద్యమం-యివన్నీ ఆయన దృష్టిలో వున్నాయి. 'కమ్యూనిజం' కూడా వుంది. అసహాయ 'యోగం' వచ్చి ఏడాదిలో స్వరాజ్యం తెచ్చిపెడతానని జైళ్ళను నింపి, శాంతియుత ప్రతిఘటనకు గల 'పొటెన్షియాలిటీస్'ని ప్రభుత్వానికీ ప్రజాకోటికి కూడా తొలిసారిగా రుచిజూపింది. హైందవ మత సంస్కృతి పరిధిని అతిక్రమించి మెరగని ఉన్నవ చిత్తవృత్తికి గాంధీమతం చక్కగా అతికినట్లు అమిరింది. గాంధీలా తానూ 'పంచములను' హైందవ సమాజపరిధిని, సాంప్రదాయిక ప్రవర్తనా సరళిని దాటిపోనీయాలనుకోలేదు.

అంబేద్కర్ యింకా రంగంలోకి రాలేదనేగాని, బెజవాడలో జరిగిన మొదటి పంచమ సమావేశంలోనూ ఆ తర్వాతనూ వాళ్లు కోరిన కోరికలూ చేసిన నిర్ణయాలూ, గాంధిమతాన్ని మీరి అంబేద్కర్ వాదాన్ని వరించే లాగున్నాయి. నవలలో ఉన్నవ ఈ సమావేశాన్ని పేర్కొన్నాడు కూడా. ఆ కోరికలనూ నిర్ణయాలనూ గమనించే వుంటాడు. గాంధిమతాన్ని నిలబెట్టాలనుకుని వుంటాడు గనకే సంగ దాసును పైకెత్తడం సంకల్పపూర్వకంగానే జరిగి వుంటుంది.

నేటి చరిత్రలో ఈ విషయంలో అంబేద్కరు దే నేటికి పై చేయి. గాంధీది కపటనాటకమనుకునేవాళ్ళూ లేకపోలేదు. గాంధీ చేసిన మేలంతా, ఈ అనాది సమస్యను ప్రజల ముందుకు తెచ్చి నిలపడ మొక్కటే. దేవాలయ ప్రవేశాలుగానీ సహపంక్తి భోజనాలుగానీ అరాకొరా అంతర్వర్ణ వివాహాలుగానీ భంగీకాలనీ పారిశుద్ధ్య కార్యక్రమాలుగానీ యీ సమస్యను దాని మూలంలో ముట్టుకోలేదు. తాను స్వయంగా వర్ణ వ్యవస్థను వ్యతిరేకించని గాంధీ 'పంచమ' వర్ణానికి 'హరిజనుల'ని పేరు బెట్టినంత మాత్రాన ఎలా నిజమైన విముక్తి మార్గం చూపగలడు? అదేవిధంగా, అంబేద్కర్ స్థాపించిన 'నవ బౌద్ధం' మాత్రం నిజానికి యీ దళితజాతులకు వొరిగించింది యేమిటి, యేపాటి? ఇది మత-నైతిక సమస్య మాత్రమే కాదు, వర్గ సమస్య. ఇలాగని వెంకటదాసైనా బోధపరచుకున్నాడా దీన్ని? ''మంచి చెడ్డలు రెండె కులములు'' అని అన్నప్పుడు, గురజాడ కూడా దీన్ని 'హేవ్స్ అండ్ హేవ్‌నాట్స్'- ధనికులు, పేదలు- విషయంగా బోధపరచుకోలేదు. అంబేద్కరుకైనా ఈ అవగాహన వుండివుంటే, మన రాజ్యాంగంలో వ్యక్తి ఆస్తి హక్కుని వ్యతిరేకించి వుండేవాడు. 'లిబరల్ డెమోక్రసీ' అనిపించుకుంటున్న బూర్జువావర్గ నిరంకుశత్వాన్ని గ్రహించీ వుండేవాడు. కాబట్టి అంబేద్కరుకు సైతం లేనిదాన్ని ఉన్నవకు వుందనుకోవడం పొరబాటుని మించిపోయే తప్పు. వెంకటదాసు చెప్పిందీ చేసిందీ కమ్యూనిజం కాదంటున్నది యీ 'జాతీయ' చారిత్రక దృష్టితోనే. పైగా, ఇది-యీ వర్గ సమాజ

వికృత యథార్థత-అంతర్జాతీయ చారిత్రక విశేషం కూడా. బూర్జువా వర్గంలాగే శ్రామికవర్గం కూడా తన విజయంకోసం అంతర్జాతీయతా వైఖరిని అవలంబించడం విధాయకం.

అందుచేత, బంగోరెనీ తదభిమానులనూ సవినయంగా నేను కోరేదేమిటంటే, సవిమర్శావైఖరి నవలంబించండని మాత్రమేగాని, యతి అంటే ప్రతి అనమనే 'నెగటివ్' వైఖరిని అవలంబించమని కానేకాదు.

చివరి అంశం. నిషేధం ఎత్తివేత విషయంలో మెత్తబడి గొప్పవిగానీ తక్కువవేగానీ కొన్ని వాక్యకదంబాలను తీసివెయ్యడానికి ఎందువల్ల ఉన్నవ వంటి ధైర్యస్థుడు సైతం అంగీకరించాడు? తొలి బింకం ఏమైంది? ఎందువల్ల పట్టు సడలింది? నవలా శరీరానికి యిందువల్ల లోపమేమీ కలగదనుకున్నాడా, లేక తీసివేసినవి బరువైనవేమీ కావులెమ్మనుకున్నాడా? ఈ రాజీ లొంగుబాటేనా లేక లౌక్యమా? ఏమైనా, అదే సమయంలో తనపాటలకోసం గట్టిగా నిలబడి చెరకైనాసరే వెళుతున్నాడే గరిమెళ్ళ సత్యనారాయణ? రచన అనేది వట్టి అక్షరాల కూర్పుమాత్రమే గాక, ఒక కార్యమైనప్పుడు, తాను చేసిన ఒక పనికి ఇతర వ్యక్తుల్లాగే రచయిత పూర్తి బాధ్యత వహించాలి, దాని తాలూకు ఫలాఫలాలను, కష్టనష్టాలను, సమంగా అనుభవించేందుకు సంసిద్ధుడు కావాలి. నిబద్ధతైనా నిమగ్నతైనా ఒకటే. గాడిచర్ల హరిసర్వోత్తమరావులా గవర్నరుగారి ముందు కళ్ల నీళ్ళ పర్యంతం కాలేదు, దరిశి చెంచయ్యలా గృహావిషయాల గురించి బెంబేలుపడి విజ్ఞాపన పంపుకోలేదు గాని, గరిమెళ్ళ సత్యనారాయణలా మొండికిపడి నిలవనూ లేదు ఉన్నవ. దీనికి అయ్యదేవర కాళేశ్వరరావు వంటి లౌక్యుల ప్రోద్బలం ఎంతవరకు కారణమో తెలియదు.

ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి'ని సమగ్రంగా పరిశీలించడానికి బంగోరె పూనుకోలేదు. దాని 'నిషేధం' వరకే పరిమితి పెట్టుకున్నాడు. వట్టి 'జర్నలిస్టిక్ స్కూప్' అనే యింప్రెషన్ తానే కల్పిస్తున్నాడు గాని, ఈ పుస్తకం గ్రంథకర్త లక్ష్యాన్ని మించి పోతున్నది. అందుకే యింత రాయవలసివచ్చింది. దీనికి బంగోరె తోబాటు పాఠకులూ నన్ను క్షమించాలి.

కావలి. —కె. వి. రమణారెడ్డి

నగ్నముని

## సంఘ విజయం

తెలుగువారు గర్వించదగిన విజయాలెన్నో లేవు. ఉన్న కొద్దిలో ఉన్నవవారి 'మాలపల్లి' ఒకటి.

ఇరవైయ్యో శతాబ్దం మొదట్లో, భారతదేశంలో, మరీ ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఊపిరి పీల్చిన మత, రాజకీయ, సాంఘిక, ఆర్థిక ఉద్యమాలన్నీ 'మాలపల్లి'లో కనబడతాయి.

అది ద్వైతాద్వైత, అచలతత్వ మీమాంస కావచ్చు, హిందువుల్ని క్రైస్తవులుగా మార్చే మిషనరీల ప్రయత్నం కావచ్చు, కరంచంద్ గాంధీగారి రాజకీయోద్యమం కావచ్చు, అహింసాతత్వ ప్రచారం కావచ్చు; తిలక్, గోఖలేల మేధో సంబంధ ఆలోచనలు కావచ్చు; రష్యన్ బోల్షివిజం యిక్కడ వ్యాపిస్తే సమ సమాజావిష్కరణ సాధ్యమవుతుందా అనే యోచన కావచ్చు; కార్మిక సంఘాలు ఏర్పడి శ్రమకు తగ్గ ప్రతిఫలం సాధించే యత్నం కావొచ్చు; అడవుల్లోకి పోయి సంతానుల్ని కూడగట్టి విదేశీపాలకులపై, స్వదేశీ ధనవంతులపై యుద్ధం ప్రకటించడం కావొచ్చు, సెటిల్మెంటుల్లో మత మార్పిడిపై హిందువుల ప్రతిఘటన కావొచ్చు, ఆదర్శ అలౌకిక ప్రేమ కావచ్చు, కళ్లుమూసే కామప్రకోపం కావచ్చు; వీర బ్రహ్మం, వేమనల అచలతత్వ చింతన కావొచ్చు; అగ్రకులాల పిదప బుద్ధులకు బలైన మాలమాదిగల దీనహీన జీవిత చిత్రణ కావొచ్చు, సమగ్రంగా దర్శన మిచ్చే గ్రామీణ వాతావరణం కావొచ్చు-యివీ యింకా అనేకానేక కొత్తకోణాల్తో వాడుకభాషలో, ఆధునిక దృక్ప

థంతో, నవలా ప్రక్రియలో మొట్టమొదట జరిగిన అద్భుత కృషి ఫలం ఉన్నవారి 'మాలపల్లి'.

అందుకనే– రాజకీయమైనా, సాంఘిక సంస్కరణమయినా, ఆర్థిక పోరాటాలయినా–అది ఏ రంగమయినా–అందులోని అతివాదులకీ, మితవాదులకీ, విప్లవవాదులకీ అందరికీ తమ ముఖాలు కనబడతాయి యీ అద్దంలో.

'మాలపల్లి'పై మిసెస్ హెన్రీవుడ్ 'ఈస్టలిన్' ఆంగ్ల నవలా ప్రభావం వుందని తెలుగు దేశంలో కొందరు పరిశోధకులు, మేధావులుగా చలామణీ అయ్యేవాళ్ళు 'మాలపల్లి'పై మసిపూయడానికి చేసిన ప్రయత్నం వాళ్ళ తక్కువబుద్ధికీ, మత్సరానికీ, కుత్సితానికీ నిదర్శనం.

'మాలపల్లి'లో ఈ దేశపు ఆకాశం, యిక్కడి నేలా, యిక్కడి గాలీ, యిక్కడి నీరు, యిక్కడి జీవితం, యిక్కడి మనుషులూ, వాళ్ళు నిత్యం పూపిరిపీల్చే సమస్యలూ వున్నాయి. 'మాలపల్లి'లో వున్నది యిక్కడి జీవితం; 'మాలపల్లి'పై వున్న ప్రభావం యిక్కడి జీవితమే.

గ్రామిక సమస్యలు, మాలమాదిగల సాంఘిక సమస్యలు మొదటిసారి నవలారూపంగా చర్చించి, భూస్వామ్య వ్యవస్థ ధనస్వామ్య వ్యవస్థగా మారుతున్న సంధియుగావిష్కరణ చేసింది 'మాలపల్లి'.

**'Workers of the world unite'** అన్న కార్ల్ మార్క్స్ పిలుపును మొదటిసారి భారతదేశంలో, ఆంధ్రదేశంలో 'పనివాండ్లందరు ఏకమైతిరా–ప్రపంచమే మీది' అని వినిపించినవాడు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ.

దేశ స్వాతంత్ర్యోద్యమంలో మేధావులు, వున్నత మధ్యతరగతులు మాత్రమే పాల్గొనడంతో సరిపెట్టుకున్నారు కరంచంద్

గాంధీ. దేశమంటే మట్టికాదు, మట్టినుండి సంపదను సృష్టించే శ్రామికవర్గం; సాంఘికంగా అధములుగా, అంటరానివారుగా చూడబడే యీ వర్గం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనవలసిన అవశ్యకత గమనించినవాడు శ్రీ ఉన్నవ.

కార్మిక కర్షకవర్గం పాల్గొనని స్వాతంత్ర్యోద్యమం సాధించిన ఫలితాలు, వేసిన కుక్కమూతి పిందెలూ యిప్పుడు మనం కళ్ళారా చూస్తున్నాం.

విదేశపాలకుల కన్నెర్రకు యింతగా గురైన రచన మరోటి లేదు. ఆనాడు ఆంధ్రదేశంలో వచ్చిన అన్ని ఉద్యమాల్లోనూ లక్ష్మీనారాయణగారు పాల్గొన్నారు. అన్ని ఉద్యమాల ఛాయలూ 'మాలపల్లి'లో వున్నాయి. లక్ష్మీనారాయణగారు ఎన్ని శిక్షలూ, బాధలూ అనుభవించారో, యీ పుస్తకం కూడా ప్రజల్లోకి రావడానికి అన్ని కష్టాలు పడింది.

1974లో ఎ. ఆర్. కృష్ణ జీవనాటకంగా 'మాలపల్లి'ని ఆంధ్రదేశం ముందుంచారు.

ఈనాడు బంగోరెవంటి నిజాయితీగల పరిశోధకులు 'మాలపల్లి' నిషేధఘట్టాలు తెలుగుదేశానికి తెలియజేయడానికి పూనుకున్నారు.

నాకెంతో ఆనందంగా వుంది. జీవితంలోనూ, రచనలోనూ ఉన్నత ప్రమాణాలు నెలకొల్పిన ఉన్నవ వారిని ఆంధ్రదేశం తిరిగి తిరిగి తల్చుకోవాలని కోరే నాకు యీ ఆనందం మాటల్లో చెప్పలేనిది.

హైద్రాబాద్. —వగ్గుముని

బంగోరె

## ముందుమాటలు

యీ పుస్తకం పుట్టుక గూర్చి ముందుగా నాలుగు మాటలు. సి. పి. బ్రౌన్ రిసర్చి ప్రాజెక్ట్‌లో మూడేళ్లుగా శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో వుంటూ బ్రౌనేతరాలను గూర్చిన ఆలోచన్లే లేకుండా అదే ధ్యాసగా బ్రౌన్ జ్వరంలో వుండిపోయిన నేను యీ గ్రంథాన్ని యెందుకు రాయవలసివచ్చిందో చెప్పాలి. 1978 అక్టోబర్ ప్రవేశంతో ప్రాజెక్ట్ గడువు పూర్తయింది. గడువు పొడిగించాల్సిన పాత వైస్‌చాన్సలర్ ఆచార్య సచ్చిదానందమూర్తిగారు తమ పదవీకాలం పూర్తయి వెళ్ళిపోయారు. కొత్త వైస్‌చాన్సలర్ డాక్టర్ శాంతప్పగారు మూడునెల్ల తర్వాత గానీ పదవీస్వీకారం చేయలేదు. బ్రౌన్ ప్రాజెక్ట్ అసందిగ్ధ పరిస్థితిలో పడిపోయింది. పొడిగిస్తారా మానేస్తారా– యీ వూగిసలాటకాలంలో యేమీ తోచలేదు. గోళ్ళు గిల్లుకొంటూ కూర్చోవడం చేతకానివాణ్ణి గనక–కొన్ని బ్రౌనానంతర బ్రౌనేతర విషయాలు తీసుకొని applied Brownism లో పడ్దామనుకొంటున్నప్పుడు సహజంగా వున్నవ మాలపల్లిపై మనసు పోయింది.

నవంబర్ ఆఖర్లో బయలుదేరి బెజవాడ వెళ్లాను శ్రీ దిగవల్లినీ శ్రీమతి టి. కృష్ణాబాయినీ తదితర మిత్రుల్ని కల్సొద్దామని. 30–11–78 'ఈనాడు' పత్రిక సిటీ యెడిషన్‌లో వచ్చిన వొక వార్త నా దృష్టిని ఆకర్షించింది. (యిది మరే యెడిషన్‌లోనూ వచ్చినట్లు లేదు). అక్కడి 'విరసం' శాఖ యేర్పాటు చేసిన సభలో శ్రీ

తుమ్మల వెంకటరామయ్య చేసిన ప్రసంగం వున్న వార్త అది: "1922లో ఉన్నవగారి మాలపల్లిలోని వెంకటదాసు ఉపన్యాస భాగాలను కరపత్రంగా వేసి అజ్ఞాత కమ్యూనిస్టుల సంఘం 'కూలి రక్షణ సమితి' రైతుకూలీలకు పంచిపెట్టిందట. ఇది అభ్యంతర కరంగా వుందని ప్రభుత్వం కేసు పెట్టిందట. మాలపల్లి నవలలో వున్న భాగాలనే మేం కరపత్రాలుగా వేసి పంచామని ఆ సమితి కోర్టులో వాదించిందట. అప్పుడు నాలిక్కరుచుకొని మాలపల్లి నవలను నిషేధించింది ప్రభుత్వం..." ఆ వార్తలో మొదటి వాక్యాలివి.

'టా'లతో తాను ప్రసంగించలేదన్నారు గానీ, యీ మొదటి వాక్యాల దగ్గరే నాకు ప్రశ్నార్థకాలు యెదురయ్యాయి. 1922లో మాలపల్లి తొలిభాగం విడుదలైన మాట వాస్తవమే గానీ అప్పటికి ఆంధ్రలో 'కమ్యూనిస్టు' లెక్కడున్నారు కరపత్రాలు వేయడానికి? ఆ నాటికి తెలుగు గడ్డపై కమ్యూనిస్టుపార్టీ యేర్పడిందా? 'అజ్ఞాత' కమ్యూనిస్టు లేమిటి?...యీ ప్రశ్నలతో సభలోని విరసులు తుమ్మలగారిని వేధించినట్లు లేదు. యెందువల్ల? తమ గత చరిత్రను గూర్చి వారికి తెలియకనా? తెల్సినా వేధించదల్చుకోకనా?

మన కమ్యూనిస్టుల్లో చాలామందికి రష్యాలో చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వా లెప్పుడు యెట్లా యేర్పడ్డాయి, యెట్లా పన్జేస్తున్నాయి, వాటి మధ్య చీలిక లెప్పుడు వచ్చాయన్న 'అంతర్జాతీయ' వైదేశిక చారిత్రక విషయాలు ముఖస్థమైనట్లుగా; మన గడ్డ మీద కమ్యూనిజం యెట్లా అవతరించిందో యెట్లా అవస్థలు పడ్డదో అనే 'జాతీయ', దేశీయ చరిత్ర విషయాలు అస్థిగతం కావడం లేదా అనిపించింది. లేకుంటే విరసం సభలో శ్రీ తుమ్మల ఆ తప్పు చెప్పి నప్పుడు, అంతా వూకొట్టినారు గానీ యెవరూ యెందుకు ప్రశ్నించ లేదు అనిపించింది. మన చరిత్ర అవగాహన యేర్పడనప్పుడు నేల విడిచిన సాములే యెక్కువవుతాయా, మార్క్స బోధించిన 'చారిత్రక' దృష్టి మనలో త్వరగా పిల్లెత్తుకు పోతున్నదా అన్పించింది.

మర్నాడు తుమ్మలగారిని కలిశాను. యీ విషయమే అడిగాను. 1922-23నాటికి ఆంధ్రలో 'కమ్యూనిస్టులు' లేరన్న దానితో యేకీభవించారుగానీ, ఆ తర్వాత కరపత్రాల భాగం మాత్రం అక్షరాలా సత్యమన్నారు. ఆ కరపత్రాల కేసుల్లో యిరుక్కొని శిక్షలుపడ్డ 'అజ్ఞాత ఆదిమ ఆంధ్ర కమ్యూనిస్టు'లను తాను స్వయంగా యెరుగుదునని కూడా చెప్పారు. అప్పుడనిపించింది మాలపల్లి నవలను ప్రభుత్వం మొదట 1923లోనే గాకుండా ఆ తర్వాత మరోసారి కూడా నిషేధించిందా అని. కమ్యూనిస్టులకూ మాలపల్లికీ గల అనుబంధమేమిటో ఆరా తీద్దామని అప్పుడే నిర్ణయించుకొన్నాను.

నా ఆలోచనల పరిధి పరిపరి విధాల పోయింది. రాయలసీమ ఆంధ్రనాయకుడు గాడిచర్ల హరిసర్వోత్తమరావు వొక యెడిటోరియల్ రాసినందుకు బ్రిటిష్ ప్రభుత్వం ఆయనపై రాజద్రోహ నేరం మోపి శిక్షించిన వుదంతం గూర్చి యేడెనిమిదేళ్ళ క్రితం నేను అప్పటి మద్రాసు రికార్డ్సు ఆఫీస్ (యిప్పటి తమిళనాడు ఆర్కైవ్స్)లో దండిగానే విషయసామగ్రి పోగుజేసి మధ్యలోనే పరిశోధన ఆపేసిన సన్నివేశం స్మృతిపథంలో మెదిలింది. అప్పుడే మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధానికి సంబంధించిన వొక ఫైల్ నా కను తగిలింది. గాడిచర్ల జ్వరంలో అప్పట్లో దాన్నిగూర్చి సీరియస్‌గా తీసుకోలేదు. యిటీవలి కాలంలో బ్రౌన్ గూర్చిన పరిశోధన సామగ్రి కోసం ఆర్కైవ్స్‌కు అడపాదడపా యాత్రలు సాగిస్తున్నప్పుడు 'మద్రాసు ప్రభుత్వం నిషేధించిన దక్షిణాది పుస్తకాల'పై పరిశోధనలో వున్న వొక తమిళ విద్యార్థి తనకు తెలుగు అంతబాగా రాదు గాబట్టి మాలపల్లి బ్యాన్‌కు సంబంధించిన వొక ఫైల్‌ను చూపి, యేవో మామూలు సందేహాలడిగిన సన్నివేశం జ్ఞాపకం వచ్చింది.

యిక, గత సంవత్సరం మార్చి-యేప్రిల్‌లో మా విశ్వవిద్యాలయంలో యఫ్. అయ్. పి. పథకం కింద యమ్. ఫిల్. పట్టా కోసం రీసర్చి చేసేందుకు మదనపల్లి కాలేజీ లెక్చరర్ శ్రీ జి. ఆంజనేయులు

నాయుడు వచ్చినప్పుడు మాలపల్లిపై పరిశోధన చేసే ప్రతిపాదన రాగా, ఆయన గైడూ, నా ఆప్తమిత్రుడూ అయిన డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డి నన్ను పిల్చాడు. ఆ నవలపై పరిశోధన చేయడం యెట్లుంటుంది చెప్పా అన్నాడు. నా ధోరణిలో నేను చెప్పాను: దీనిపై కొందరు యీ వరకే పిహెచ్. డి., యమ్. ఫిల్లాకి డిగ్రీల కోసం పరిశోధనలు సాగించినట్లూ సాగిస్తున్నట్లూ వింటున్నాం గదా; అయితే ఆ నవలను యెందుకు నిషేధించాల్సి వచ్చిందో, ఆ పూర్వాపరాలు, ఆ సాంఘిక నేపథ్యం గూర్చి యింతవరకూ యెవరూ ఆరా తీసినట్లు లేదు. దీనికి సంబంధించిన ఫైళ్లు ఫలానా చోట వున్నాయి. వాట్ని చూచి నిర్ణయాలు రాబట్టడం బాగుంటుందన్నాను. చెప్పి యింతకాలమైనా (నేను తుమ్మలగారితో వివాదపడ్డ దాకా) ఆంజనేయులునాయుడు కాని ప్రశంస పెట్టుకోకుండానే, మద్రాసు వెళ్ళి ఫైళ్లు చూడాలనుకోకుండానే తన పరిశోధనేదో తాను కొనసాగించు కొంటూ పోయాడు. సాహిత్య పరామర్శలో యీరకం చరిత్ర పరిశీలన అంతముఖ్యం కాదనుకొన్నాడేమో. ఆయన సరిపెట్టుకున్నంతగా నేను మాత్రం సరిపెట్టుకోలేక పోయాను.

యీ సందర్భంలోనే నాకు మరో తీమ్ స్ఫురించింది. వ్యావహారిక భాషా విషయంలో బ్రౌన్ కన్న కలలు 'మాలపల్లి' రూపంలో నా ముందు నిలిచాయి.

1855లో బ్రౌన్ శాశ్వతంగా యిండియా వదిలి వెళ్ళిపోతూ మద్రాసు నుంచి ఆఖరుగా వెలువరించిన గ్రంథం 'తాతాచార్ల కథలు' (ఆయన 'తెలుగు గ్రామర్' రెండో యెడిషన్ విషయం అటుంచి చూస్తే). కథలుగా అవి యెంత క్రూడ్‌గా వున్నా, సమకాలిక విషయాల్ని యితివృత్తంగా స్వీకరించడం, శైలి విషయంలో మృతప్రాయమైన ప్రజాతంత్ర విరుద్ధమైన దగుల్బాజీ గ్రాంథిక తెలుగును విడనాడి స్వచ్ఛమైన వ్యావహారిక భాషలో సాగడం– యీ రెండు అంశాలూ ఆ కథల్లో పుష్కలంగా వున్నాయి. (లేకుంటే

వ్యావహారిక భాషా ప్రేమికుడైన గురజాడ ఆ కథల్ని మళ్ళీ ప్రియపడి యెందుకు ముద్రించినట్లు?). వొక అచంచలమైన విశ్వాసంతో మున్ముందు రాబోయే కాలగతిని prophetic గా వూహించి, బ్రౌన్ ఆ కథలకు రాసిన పీఠికలో యిట్లంటాడు:

"Tatachari uses a style free from pedantry: his tales...furnish good models of colloquial Telugu. These tales may SUPERSEDE the prose abridgements which are still read under the names of *Pancha Tantra*, and *Tales of Vicramarca* written in a pedantic style different from the Telugu in daily use..."

కొరకరాని కొయ్యల్లాంటి గ్రాంథిక భాషామూసల్లో పండిత వర్గ సంప్రదాయానుసారిగా రచించబడిన ఆ కథలనే మన బడిపిల్లల చేత చదివిస్తున్నాం. యీ బాపతువాటి స్థానే తాతాచార్ల కథలు వంటివి ప్రచారంలోకి రావాలనీ, ఆ వచ్చేరోజు మున్ముందు రాగలదనే బ్రౌన్ వ్యక్తం చేసిన విశ్వాసం. నోరూ వాయీ లేని తెలుగు విద్యార్థులపైన యేనాడో కాలం చెల్లిపోయిన పుస్తకాలను పాఠ్యగ్రంథాలుగా రుద్ది ఆ మూసలో తెలుగు నేర్చుకోమనడం, నేర్పించడం అవివేకమనీ, ఆధునిక అవసరాలను దృష్టిలో వుంచుకొని తెలుగు పాఠ్య ప్రణాళికను ప్రయోజనా ధోరణిలో సమూలంగా మార్చవలసి వుందనీ తెలుగు విద్యాధికారిగా ఆదిలోనే 'మద్రాసు యూనివర్శిటీ' రిపోర్టుల్లో పదేపదే తీవ్రంగా వాదించినవాడు బ్రౌన్.

అయినాకూడా, మద్రాసు యూనివర్శిటీ 1911లో నియమించిన తెలుగు కాంపోజిషన్ కమిటీవారి కాంట్రవర్సీలు సద్దుమణిగి దురదృష్టవశాత్తు గ్రాంథిక భాషావాదులదే పై చేయి అయిన తర్వాత, పదేళ్ళలోనే గొప్ప ప్రజాతంత్ర భావనతో ఆధునిక స్పృహతో వాడుకభాషలో వచ్చిన మేలి గ్రంథం మాలపల్లి. అటువంటిదాన్ని కరుడుగట్టిన ఆంధ్రా యూనివర్శిటీ తెలుగు భాషానుశాసకులు పాఠ్యగ్రంథంగా నిర్ణయించాల్సి రావడం నిజంగా ఆశ్చర్యకరమైన పరిణామమే. అది నిజంగానే పాఠ్యగ్రంథంగా కొనసాగే

వుంటే బ్రౌన్ కలలుగన్న వాడుక భాషా వాదానికి పట్టు దొరికి వుండేది. విద్యాప్రణాళికలో దానికి వొక రహదారి యేర్పడి వుండే దన్న ఆలోచనకూడా నన్నీవైపుకు ప్రేరేపించింది. (అయితే దుర దృష్టవశాత్తు అట్లా జరక్కుండా మధ్యంతరంగానే దాన్ని పాఠ్య ప్రణాళికలో నుంచి తొలగించవలసి వచ్చింది– చూడు: ఆఖర్లో వెనక అట్టపైన ముద్రింపబడిన ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి నిస్సహాయపు జాబు!)

యిట్లా మాలపల్లి నిషేధాలను గూర్చి నిగ్గుదేర్చాలని నేను నిర్ణయించుకోడానికి యిన్ని కారణాలు జతకలిశాయి. రంగంలోకి దిగి చూస్తే అందుకు సంబంధించిన ఫైళ్ళన్నీ వొక్క మద్రాసులోనే లేవని అర్థమైంది. కొన్ని హైదరాబాదు ఆర్కివ్స్‌కు తరలించ బడ్డాయి. అక్కడికీ వెళ్ళి వాటిని వెలికి పట్టవలసివచ్చింది. యిట్లా పెక్కుచోట్ల యీ సాహిత్య పురావస్తు త్రవ్వకాలు జరపవలసి వచ్చింది. మాలపల్లి నిషేధపు ఆయువుపట్లకోసం జరిపిన అన్వేషణలో ఆంజనేయులునాయుడు తోడు దొరికింది. విషయ సేకరణలో తానూ వొక చెయ్యివేసి తోడ్పడ్డాడు. అందుకు గుర్తుగానే ఆయన యీ గ్రంథానికి 'సహాయకు' డయ్యాడు. పని త్వరగా జరిగింది. రచన చకచకా జరిగిపోయింది. అచ్చు ఖర్చులకు యల్. అయ్. సి. పాలసీ మీద అప్పు దొరికింది. రాతప్రతి ప్రెస్ కివ్వడం జరిగింది. అట్లా తయారైన గ్రంథ మిది.

* * *

యిట్లాంటి నవలా నిషేధం గూర్చి సాకల్యంగా సమగ్రంగా చర్చించ వలసిన విషయాలు యింకా చాలా మిగిలిపోయివున్నాయి. అయినా యీ నిషేధాల నేపథ్యాన్ని మనసులో వుంచుకొని నవలను చదివి నప్పుడుగానీ కొన్ని కొత్త కోణాలు స్ఫురించవు. ఆ గుర్తింపుతోనే నా పరిశీలనను దాని వరకే పరిమితం చేసుకొన్నాను. నవలను కొత్త దృక్కోణాలనుంచి అర్థం చేసుకోడానికి యిది తోడ్పడుతుంది.

నవలలోని నిజమైన లోపాలోపాలను, నవలాకర్త భావనలోని అంత ర్గత వైరుధ్యాలను అవగాహన చేసుకోవడానికి యిది దారి తీస్తుంది. సాహిత్యాన్ని కేవల సాహిత్యంగా గాక, సాంకేతిక జడపదార్థంగా గాక, అదొక రాజకీయ సామాజిక జీవపదార్థంగా కూడా పరిశీలించే కొత్త చూపునూ వొక విధమైన inter-disciplinary approach నూ అలవర్చుకోడానికి యిది దోహదం చేస్తుంది. కాల వ్యవధి లేక, గ్రంథ విస్తరణ భీతిచేత యెక్కడికక్కడ నా చర్చారంగాన్ని పరిమితం చేసుకొంటూ కొన్ని విషయాలను సూచనప్రాయంగా చెప్ప వలసి వచ్చింది. మరి కొన్నిట్ని పూర్తిగా వదిలివేయవలసీ వచ్చింది. పీఠికలు, అనుబంధాలు అంతా కలిసి నూరు పేజీలు మించదనుకొన్న నా అంచనా అరపకుండా తయారై నూటయాభై పేజీలు దాటి పోతున్నది. మరో యెడిషన్ వస్తే గిస్తే- వీటిని అప్పటిదాకా వాయిదా వేసుకొంటున్నాను.

యీ పరిశోధనలో 'బైప్రాడక్ట్స్'గా నా ముందుకొచ్చిన అంశాలు కొన్నున్నాయి. మాలపల్లి నవల పూర్తిగా విడుదల గాక ముందే 1923లో ప్రభుత్వం దాన్ని నిషేధించింది. మరి దానికి ముందూ, ఆ తర్వాతా యేయే గ్రంథాలను యేయే దశల్లో మన ప్రభుత్వాలు నిషేధించాయో ఆ పూర్వాపరాల చరిత్ర నన్ను వెంటాడి త్రవ్వకాలు జరుపుతుంటే యెన్నో విషయాలు యెదు రయ్యాయి. మన తెలుగు పరిశోధకులు యింతవరకూ కలలోకూడా వాసన చూచి యెరుగని 'అనాఘ్రాత పుష్పాల్లా'గా యెన్నో ఫైళ్ళు గుప్పుమన్నాయి. 'మన' ప్రభుత్వ నిషేధాలకు గురైన తెలుగు గ్రంథాలు కొన్ని కొన్నిట్ని యెంపిక చేసుకొని విడివిడిగా పరిశో ధించవలసిన అవసరం యెంతగానో కనపడ్తున్నది. 'సోషల్ రెలవెన్స్' వుండేట్లుగా మన అకెడమిక్ పరిశోధనలు యీ మార్గాల్లో యెందుకు సాగడంలేదో ఆశ్చర్యం వేస్తున్నది. పరిశోధనారంగంలో మన దివాళాకోరుతనానికి సోమరితనానికీ స్తబ్ధతకూ దిక్సూచుల్లా యివి ద్యోతకమవుతున్నందుకు బాధ కలుగుతున్నది. పైపెచ్చు యిటీవల

యఫ్. అయ్. పి. పథకం కింద యు. జి. సి. స్కాలర్‌షిప్పులతో పరిశోధకులు పుట్టగొడుగుల్లా తయారై వేలు లక్షలు ఖర్చుపెట్టి యూనివర్సిటీలు పరిశోధనా యజ్ఞగుండాలను నడపవలసిరావడంతో ప్రయారిటీస్‌తో నిమిత్తం లేకుండా పరిశోధనాంశాలు కరువైపోతున్నట్లుగానూ యిక కొత్తగా రీసర్చి చేయవలసిన రంగాలు ఆట్టే మిగిలిలేనట్లుగానూ మనవాళ్ళనేకులు భావిస్తున్నారంటే ఆగ్రహం కూడా కల్గుతున్నది.

1923లో మాలపల్లిని నిషేధించడానికి రెండేళ్ళముందు యెన్ని తెలుగు పుస్తకాలపై మన ప్రభుత్వాలు యెన్ని సమాధులు కట్టారో యిప్పుడిప్పుడే లెక్కలు తీయడం సాధ్యంకాదని తోస్తున్నది. వుదాహరణప్రాయంగా కొన్నిట్ని పరిశీలిద్దాం.

1921లో గుంటూరు తిలక్ నాటకసమాజంవారు గ్రామీణ జనంలో కొత్త కలకలాన్ని కలవరాన్ని రేపిన 'స్వరాజ్యసోపానం' అనే అముద్రిత నాటకం కృష్ణాజిల్లాకు కూడా వ్యాపించి అక్కడా దీని ప్రదర్శనలను సాగిస్తుంటే మధ్యలో ప్రభుత్వం కలగజేసుకొని 'నాటక ప్రదర్శనల చట్టం' కింద నిషేధించింది. అట్లాగే 'అవతార పరివర్తనం లేక తిలక్ మహారాజు నాటకం' (కొడాలి ఆంజనేయులు అముద్రిత రచన), 'తిలక్ మహారాజ నాటకం' అనేపేరుతోనే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మరో నాటకం – వీటినీ నిషేధించింది. యీ నాటక ప్రదర్శనల్లో మధ్య మధ్య విరామ సందర్భాల్లో బలిజేపల్లి లక్ష్మీకాంతం లాంటి పిల్లకవులు స్వరాజ్య పద్యాలు కవికట్టి కంగున చదివేవారు. పోలిశెట్టి ఆదినారాయణ గుప్తవంటి యువ నటులు రాజకీయ చోచో ప్రదర్శనలు, చిన్నచిన్న సెటైర్లువేసి తద్వారా ప్రేక్షకుల్లో రాజకీయ సామాజిక చైతన్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించేవారు. అంటే ఆరోజుల్లో కలం పట్ట నేర్చిన ప్రతి రచయితా, గళం విప్పగల్గిన ప్రతి కళాకారుడూ యేదో చారిత్రక కర్తవ్యంగా వుద్యమ ఆవేశంతో రాజకీయ స్పృహను ప్రదర్శించిన

తీరు ఆశ్చర్యం గొల్పుతుంది. (యీ వివరాలు ఆనాటి ప్రభుత్వ సి. అయ్. డి. రిపోర్టుల్లో నుంచి లభించాయి). మన చరిత్ర తీరు యిట్లుంటే–రాజకీయాలకు అతీతంగా రచయితలు మెలగాలనీ, రచనలు చేయాలనీ యిప్పుడు కొందరు పనిగట్టుకొని నినాదంగా వినిపించడం ఆశ్చర్యంగా తోస్తున్నది. వీళ్ళది లోకం పట్టని వొకరకం రాజకీయమై వుండాలి. 'లోకంతో మనకు పనేమిటి పద లోలాక్షీ' అనే బాపతు కేవల రసానుభూతి కవిగణం లేదా కవిసేన–లేదా వ్యాపార దృష్టులైన విస్మరణవాద రచకగణం లేదా వట్టి స్వక్షేమవాదుల బలగమైనా కావాలి లేక యథాస్థితివాదులైనా కావాలి. అంటే పరోక్షంగా ప్రజాదృష్టిలేని పాలకవర్గాలు నడిపే రాజకీయంలో పావికలుగా వుపయోగపడుతున్నటే గదా.

యింతకూ యీ నిషిద్ధ నాటకాల లిస్టు పరిసమాప్త మనుకొంటారేమో. కాదు. 'గాంధీమహోదయం' వగైరా రాజకీయ నాటకాలను ప్రభుత్వం 1921లో నిషేధించిందంటే వాటి ప్రచార శక్తిని అది యెంత సరిగా అంచనా వేసుకొన్నదా అనికూడా తోస్తుంది. వొక్కో నాటక ప్రదర్శనను ప్రభుత్వం రద్దు పరుస్తుంటే, అవే సీన్లు కొంచం అటుయిటు మార్చి కొత్తకొత్త పేర్లు పెట్టి ప్రభుత్వం కళ్ళల్లో దుమ్ముకొట్టడానికి ప్రయత్నించేవారంటే అది వాళ్ళ రాజకీయ కమిట్‌మెంట్‌కు నిదర్శనం. ప్రభుత్వం మళ్ళీ వాటిని ఆపు చేయించి దమననీతి ప్రయోగించేది.

1921లోనే ప్రభుత్వం నిషేధించిన యితర తెలుగు గ్రంథాలను పరికిస్తారా? 'భారతగీతములు' (గుంటూరు 'జాతీయ కళాశాల' టీచర్ సుబ్రహ్మణ్య భాగవతులు రాసింది), 'హిందూదేశము: పూర్వప్రస్తుత స్థితులు', 'పాంచాల పరాభవం', 'స్వరాజ్య గీతామృతం' (బాలకవి వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి కలిసి రాసిన 'దండాలు దండాలు భరతమాత' వగైరా గీతాలు, పద్యాలున్న గ్రంథం), 'స్వరాజ్య కోలాటం'

(గుంటూరుజిల్లా సిద్ధపల్లి బాలకవి దంటు వీరరాఘవయ్య రాసింది), రామభజన ఫక్కీలో వచ్చిన 'రామదండు' పాట మొదలైనవున్నాయి.

యిక్కడ 'స్వరాజ్య గీతామృతం' గూర్చి వొక మాట. ప్రభుత్వం యీ గ్రంథాన్ని నిషేధించడంతో తృప్తిపడకుండా ఆ గ్రంథకర్తలపై కేసు పెట్టే ముందు గోదావరిజిల్లా కలెక్టర్ చేత క్షమాపణలు అడిగించాలని చూస్తే గ్రంథకర్త లిద్దరూ మొదట వొప్పుకోలేదు. కలెక్టర్ను యెదిరించారు కూడా. పూడిపెద్ది పిల్ల నిచ్చిన మామ తర్వాత యేదో మాయమంత్రం చేసి అల్లుణ్ణి మాత్రం కలెక్టర్ వద్దకు తీసుకెళ్ళి చేసింది తప్పు అని క్షమాపణ చెప్పించాడు. యిక ముందు యిట్లాటి 'పాడు' పాటలు రాయననీ, బుద్ధిగా వుంటానని హామీ యిప్పించాడు. యిట్లా పూడిపెద్ది తప్పు కున్నాడు. క్షమాపణ ససేమిరా చెప్పనని మొరాయించడమే గాక, కలెక్టర్కు యెదురు సవాల్ విసిరి, పోలీసులకు దొరక్కుండా కొన్ని నెల్లపాటు రహస్యంగా వుండి తప్పించుకోగల్గిన వడ్డాది కవి వొక్క డిపై కేసు పెట్టి యేడాది కఠినశిక్ష విధింపజేసింది ప్రభుత్వం. అప్పటికి వడ్డాది వయసు 21. (యీ రహస్యకాలంలో వడ్డాది అల్లూరి సీతా రామరాజుతో సంబంధాలు పెట్టుకొన్నట్లు అస్పష్ట దాఖలాలు). యింత పుణ్యాల చరిత్రగల 'దండాలు దండాలు భరతమాత' గీతానికి "కర్త యెవరో తెలియదు" అని అఘోరించారు– ఆం.ప్ర. ప్రభుత్వం ముద్రించిన 'దేశం పిలుపు' (1971) అనే జాతీయోద్యమ గీతాల సంపుటి సంకలన కర్తలు – డాక్టర్ సరోజిని రేగాని, దేవులపల్లి రామానుజరావుగారలు. ఆ గీతాన్ని సరిగా పూర్తిగానైనా యివ్వ లేకపోయారు.

1922లో 'స్వరాజ్య గీతాలు' (గరిమెళ్ళ సత్యనారాయణ విరచితం), 'భారతీయ విలాపం', 'చీరాల పేరాల గాంధీ దాస నాట కం', 'స్వరాజ్య రథం నాటకం', 'సహాయ నిరాకరణం', వగైరా

గ్రంథాలపై నిషేధాలు విధించింది ప్రభుత్వం. గరిమెళ్ళపై కేసు పెట్టి జైలు శిక్ష కూడా విధించింది. గరిమెళ్ళ 'మా కొద్దీ తెల్లదొరతనం' అనే వాక్య గీతాన్నే అరటావు కాగితంమీద రెండుపక్కలా అచ్చొత్తించి అణా వెలబెట్టి అమ్మే యేర్పాటు చేశారంటే దానికెంత ప్రచారం కల్గిందో వూహించుకోవచ్చు. ప్రభుత్వం ఆ అరటావు కాగితంపై కూడా ఆఘాయిత్యం చేసింది. నెల్లూరు నుంచి రాళ్ళపల్లి రామసుబ్బయ్య సంకలన పరిచి ప్రకటించిన 'సింహపురి స్వరాజ్య కోకిలము' 'జమీన్ రైతు' పత్రికా స్థాపకుడుగా తర్వాత ప్రసిద్ధి కెక్కిన నెల్లూరు వెంకట్రామానాయుడు ప్రకటించిన 'స్వప్న ప్రయాణం'-యీ రెండిటి కాపీలనీ ప్రభుత్వం స్వాధీనపర్చుకోమని కలెక్టర్ రిపోర్ట్ పంపితే, మొదటి పుస్తకాన్ని మాత్రం వదిలేసి రెండో దాన్ని నిషేధించింది. యిట్లా 'లిస్టు' యెన్నని యిచ్చుకుంటూ పోవడం? (యీ రాజకీయ కోలాహలం మధ్య రామాయణంలో పిడకల వేటలాగా కడపజిల్లా పర్లపాడు చెనికల చెన్నారెడ్డి రాసిన 'శాంత సారంగధర నాటకం'లో మితిమీరిన పచ్చిశృంగారాన్ని దట్టించాడని ఆ నాటకాన్ని ప్రభుత్వం నిషేధించడమే గాక జమ్మలమడుగు కోర్టులో నాటక కర్త, పబ్లిషర్లు ప్రొద్దుటూరు శ్రేష్ఠి సోదరులపై కేసు పెట్టడం వేరే కోవకు చెందుతుందనుకోండి).

యిక మాలపల్లిని మొదటిదఫా నిషేధించిన 1923లోనే 'ఆత్మశిక్ష', 'గాంధీమహాత్ముడు లేక కలియుగ ప్రహ్లాద' (గుంటూరీయుడైన దామరాజు పుండరీకాక్షుడు రాసిన హరికథ; యితను రాసిందే 'నవోదయం: గాంధీ విజయం' అనే మరో రచనను 1932 లోను), 'గాంధీమహాత్ముని నిర్బంధము', 'గాంధీ విజయ ధ్వజ నాటకం' వగైరాలను కూడా నిషేధించడం ఫైళ్ళలో చూడవచ్చు. వీటన్నిటిపై సి. అయ్. డి. పోలీసుల రిపోర్టులు, తెలుగు ట్రాన్స్లేటర్ యింగ్లీష్ అనువాదాలు, నివేదికలు, అడ్వకేట్ జనరల్ లీగల్ (లేదా యిల్లీగల్) అభిప్రాయాలు, ప్రభుత్వాధికారుల నోట్స్ –

యిట్లా యీ తతంగమంతా వున్న ఫైళ్లు అనేకం వుండగా (వీటిల్లో కొన్ని శిథిలమై పోతున్నాయి కూడాను), మన తెలుగు జాతీయ గీతాల సంగ్రాహకులు, పరిశోధకులు యింతదాకా పట్టించుకోలేదంటే యేమనాలి? ఆం. ప్ర. సా. అకాడమీ ముద్రించిన 'జాతీయ గీతాలు' (1973) సంకలనకర్త శ్రీ గురజాడ రాఘవశర్మ అకాడమీ బొక్కసం నుంచి మూడువేలైతే తీసుకొన్నాడుగానీ (కవిగాళ్ళ సంతర్పణలకు డబ్బు తేరగా వున్నదనుకొన్నాడేమో, ముప్పయి వేలైనా యివ్వాలని కీ. శే. విశ్వనాథ సత్యనారాయణ 'సిఫార్సు') యిదే సందనుకొన్నాడేమో 700పేజీల యీ చిరు దిండు గ్రంథంలో తన సొంత గేయాలను యిరికించుకోవడంలో చూపిన శ్రద్ధాసక్తులను, చరిత్ర పూడికల్లో చేరిపోయిన పై గీతాలలో చాలా వాటి జోలికే పోకుండా- వున్న వాటినైనా సంకలన పరచడంలో గానీ యీ గీతాల వెనుక గల చారిత్రక గతి విశేషాలను సంతరించడంలో గానీ యే కోశానా చూప యత్నించక పోవడం దారుణం.

యీ రచనల లిస్టును యిక్కడ ముక్తసరిగానైనా యేకరువు పెట్టడంలో మరో వుద్దేశంకూడా లేకపోలేదు. కమ్యూనిస్టులకంటే ముందు యీ జాతీయోద్యమ కవులు జానపద సాహిత్య కళారూపాలను, ప్రక్రియలను- రాజకీయ సందేశ ప్రసారానికీ, ప్రచారానికీ, ప్రజలను వుత్తేజపరచడానికీ, యెట్లా వినియోగించుకొన్నారో, యెంతగా విజయాలు సాధించారో, చూచాయగానైనా చూపాలనే వుద్దేశం కూడా వుంది. మార్గధోరణులను విడనాడి, దిక్కుమాలిన శుష్కప్రబంధ ఫక్కీలను త్రోసిరాజని దేశి ధోరణులను జానపదరీతులను చేపట్టడంలో యే చారిత్రక శక్తులు పనిచేశాయో, యెటువంటి స్పృహ వీరిని నడిపించిందో 'దండాలు దండాలు భరతమాత' పీఠికలోని నాలుగు మాటలు చెప్పక చెప్తాయి: ''మాటలకిది కాలము కాదు. చేతలను చూపవలసినదియే. దేశసౌభాగ్యము కష్టజీవులపై నాధారపడియున్నది. . .మన దేశమున జనసామాన్యము నిరక్షరాస్యులు. దేశదైన్యము వారికి సుబోధము గావలెనన్న నిర్భాగ్య

మైన గ్రామ్య భాషయే నేడు శరణ్యము... మన సోదర కష్టజీవులు వినికి మాత్రముననే సులభముగా గ్రహించి...''

యిక 1936లో మాలపల్లిని రెండోసారి నిషేధించడం తర్వాతి దశ. అంతకు రెండేళ్ళు ముందు (అంటే 1934)నుంచీ ప్రభుత్వం నిషేధించిన, నిషేధించ తలపెట్టిన తెలుగు గ్రంథాల జాబితాను బట్టే తెలుగుజాతి పడ్తున్న పురిటినెప్పులనూ, తెలుగు ప్రజ తాలూకు రాజకీయ చైతన్యస్థాయి పెరుగుదలనూ కొంతకు కొంతైనా అర్థం చేసుకోవచ్చు. (లోగడ తమ బూతు-శృంగార గ్రంథాలపై పెట్టిన విధి నిషేధాలను తొలగించమని మచిలీపట్నం శృంగారకావ్య గ్రంథ మండలివారు పెట్టుకొన్న దరఖాస్తును హోమ్‌శాఖ 1936జూన్ 1న త్రోసివేసి పునర్ముద్రణకు నిరాకరించిన సంగతటుంచుదాం).

'రాజనీతి శాస్త్రము' (ముదిగంటి జగ్గన్నశాస్త్రిది, యీయనదే 'వినాయక సావర్కార్ జీవితము' కూడా) 'మజినీ జీవితము', 'మానవ ధర్మాలు', 'నేటి రష్యా' (నార్లగారి రచన), కృష్ణాపత్రిక 1934 జూలై 14 తేది సంచిక, 'గారిబాల్డీ జీవితము', 'సామ్యవాద సిద్ధాంతాలు', 'అమ్మ' (గోర్కీ నవలకు క్రొవ్విడి లింగరాజు అనువాదం), 'సామ్రాజ్య వాదము' (లెనిన్ వ్యాసానికి తర్జుమా), 'కమ్యూనిస్టు ప్రణాళిక' (మేనిఫెస్టోకి తర్జుమా-గద్దె లింగయ్య ఆదర్శ గ్రంథమండలి ప్రచురణలు), 'ధన ప్రభావము' (గుంటూరు కూలి సంరక్షణ సంఘంవారి 7వ కరపత్రం నాటక కథాత్మకమైంది), 'సర్దార్ భగత్‌సింగ్ చరిత్ర' (సి. కృష్ణస్వామి శర్మ), 'ట్రాట్‌స్కీ జీవితము' (దింటకుర్తి భాస్కరరాజు అముద్రిత రచన, గద్దె లింగయ్య యింట్లో పోలీసులు 1935 డిసెంబర్ 19న జరిపిన సోదాలో దొరికింది), 'కార్మిక భజనావళి' (నంద్యాలలో అచ్చయింది)- యీ లిస్టంతా యిచ్చుకొంటూ పోవాలంటే చాలా వుంది.

అంటే, 1930ల నాటికి తెలుగు గడ్డపై మిగతా వుద్యమాలతో బాటు కమ్యూనిస్టుద్యమ సాహిత్యమూ వేరూనడం ప్రారంభమైన

దన్నమాట. వొక్క 1934 సంవత్సరంలోనే 'కమ్యూనిస్టు ప్రణాలిక'కు రెండు ముద్రణలు వచ్చాయి. వొక్కో యెడిషన్‌కు 2వేల కాపీలు చొప్పున అచ్చయ్యాయంటే, లండన్ లైబ్రరీలకు పంపడానికి రెండు కాపీలు కావాలని కృష్ణాగోదావరి జిల్లాల కలెక్టర్లకు వ్రాస్తే వాళ్లు వొక్క కాపీ కూడా సేకరించలేక పోయారంటే యెంత త్వరగా పంపకమై అమ్మకమై లేదా అండర్ గ్రౌండ్‌లోకి పోయాయో వూహించుకోవచ్చు. కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలకు, ఆ పార్టీలోని వ్యక్తులకూ సంబంధించిన ఫైళ్ళు యెన్నో కనబడుతున్నాయి.

తెలుగులో నిషేధ గ్రంథాలను గూర్చి విపుల పరిశోధనల అవసరం కనబడ్డట్లే, "ఆంధ్రలో కమ్యూనిస్టుల అవతరణ, వికాసం, వైరుధ్యాలు, చీలికలు, అందుకు సంబంధించిన సాహిత్యసృష్టి"–వీటిని గూర్చి విడిగా విపులంగా పరిశోధించవలసిన ముడిసరుకు యెంతగానో కనపడ్డది. యింతవరకూ యిటువంటి వాటిని గూర్చి పట్టించుకోక పోవడం, సిద్ధాంతస్థాయిలో పరిశోధనలు సరిగా చేపట్టక పోవడం మన మేధోరంగంలో అకెడమిక్ రీసర్చిలో కానవస్తున్న దౌర్భాగ్యం! 1936లో వొక ఫైల్లో పుచ్చలపల్లి సుందరయ్యగారి గూర్చి, ఆయన కార్యకలాపాలు గూర్చి సి. అయ్. డి. స్వాములు 'this dangerous agitator' అనీ 'rapidly becoming a menace to this Presidency' అనీ రాసున్నారు. యిప్పు డెవరైనా యీ మాట అనగలరా? అనవలసివస్తే, దేశానికీ రాష్ట్రానికీ మెనేస్‌గా తయారైన వారు అధికార వేదికల మీదే కనపడ్డం లేదా?

యీ గ్రంథంలో కాశీనాధుని నాగేశ్వరరావు ప్రస్తావన కొన్నిచోట్ల వచ్చింది. పల్నాటి పుల్లరి సత్యాగ్రహోద్యమంలో వున్నవ జైలుకు పోయిన సన్నివేశం (యీ పుస్తకంలో చూడు 25–27 పేజీలు) గూర్చి – కలెక్టర్ షీల్డ్ తప్పుడు కేసు పెట్టాడనే అర్థం వచ్చేట్లుగా మాచర్లనుంచి పెరుమాళ్ళ శాయన్న శెట్టి అనే విలేఖరి పంపిన వృత్తాంతాన్ని 28-7-1921 ఆంధ్ర పత్రికలో ప్రచు

రించినందుకు– అప్పటి అడ్వొకేట్ జనరల్ సి. పి. రామస్వామయ్యర్ సలహాపై ఆంధ్రపత్రిక ప్రొప్రయిటర్ కాశీనాధుని నాగేశ్వరరావు మీద కలెక్టర్ పీల్డ్ 15 వేలకు పరువు నష్టం దావా వేసేందుకు నోటీసిస్తే కాశీనాధుడు బెంబేలు పడిపోయి 1922 జనవరి 4న క్షమాపణలు చెప్పి సర్దుకొన్నాడు. యీ కేసే గనక కొనసాగి వుంటే మిగతా సంగతులటుంచి వున్నవ- పుల్లరి సత్యాగ్రహం- ప్రభుత్వ వైఖరికి సంబంధించి కొన్ని 'సైడ్ లైట్స్' వెలుగులోకి వచ్చివుండేవి. ఆంధ్రపత్రిక ఆ తర్వాత కూడా స్వాతంత్ర్యోద్యమ రోజుల్లో యిట్లానే అప్పుడప్పుడూ క్షమాపణలు చెప్పి బయటపడుతూ వచ్చింది. అది వేరే కథ.

యిక సర్వేపల్లి రాధాకృష్ణన్ హయాంలో ఆంధ్ర విశ్వ విద్యాలయం మాలపల్లిని పాఠ్యగ్రంథంగా నిర్ణయించిన విషయానికి సంబంధించి గూడూరు నముశ్శివాయగారు '(శ్రీ) ఉన్నవ లక్ష్మీనారాయణగారు: అనుభవాలు–జ్ఞాపకాలు' అని వొక పత్రికలో ప్రకటించిన వ్యాసంలో పింగళి లక్ష్మీకాంతం చెప్పినవని కొన్ని విషయాలు విన్పించారు: మాలపల్లిని పాఠ్యగ్రంథంగా తొలగించమని గవర్నర్ కోరగా రాధాకృష్ణన్ 'నో' అంటూ మొదట జవాబు రాశాడట. తర్వాత గవర్నర్ తంతి యిచ్చి పిలిపించుకొని వొత్తిడి తెస్తేనేగానీ వుపసంహరించుకోలేదట. గూడూరు (నెల్లూరుజిల్లా ?) సబ్ కలెక్టర్ కొంత కమ్యూనిస్టు సాహిత్యాన్ని పట్టుకొని కేసు బనాయిస్తే ముద్దాయిలు సమాధాన మిస్తూ 'పూర్వం మాలపల్లిని కూడా ప్రభుత్వం నిషేధించింది. ఆ మాలపల్లి నేడు బి. యే. విద్యార్థులకు పాఠ్యగ్రంథం. అట్లాగే మా పుస్తకాలు కూడా ముందు ముందు పాఠ్యగ్రంథాలు కావచ్చు. వాటిని నిషేధించ పనిలేదు– అని వాదించారట. కలెక్టర్ ద్వారా మాలపల్లిని పాఠ్యగ్రంథంగా తొలగించమనీ లేకపోతే కేసు పోతుందనీ గవర్నర్‌కు రాయగా, గవర్నర్ రాధాకృష్ణన్‌ను అభ్యర్థించారట.

రాధాకృష్ణన్ పర్సనల్ పేపర్స్‌లో యిందుకు ఆధారాలేమైనా వుండొచ్చునని ఆయన కుమారులు, ప్రఖ్యాత చరిత్ర విద్వాంసులు, జె. యన్. యు. లో చరిత్ర ఆచార్యులుగానూ వుంటున్న సర్వేపల్లి గోపాల్‌గారికి జాబు రాస్తే 'అందుకు సంబంధించిన కాగితాలు లేవు' అని సమాధానం యిచ్చారు.

ఆంధ్రా యూనివర్సిటీలో పాత ఫైళ్ళలో యిందుకు 'స్లా' వుంటుందేమో నని వొక మిత్రుని ద్వారా ప్రయత్నిస్తే- ఆ ఫైళ్లు లేవు, అంత పాతవి భద్రపరిచే అలవాటు లేదు. నీ వెంత పిచ్చివాడివి- అని రాశాడు. స్వర్ణోత్సవాలు, రజతోత్సవాల పేర్లతో మన విశ్వవిద్యాలయాలు జనాన్ని పూదరగొట్టడం నేర్చుకున్నాయి గానీ తమ సంస్థలకు సంబంధించిన యిటువంటి ప్రాచీన పత్రాలు భద్రపరచుకునే సత్సంప్రదాయాన్ని పాటిస్తున్నట్లు లేదు.

యిట్లాగే కె. వి. రెడ్డి నాయుడు 'డైరీలు' చూస్తే మాలపల్లి రెండో నిషేధానికి సంబంధించి కొన్ని ఆధారాలు దొరకొచ్చునని హైదరాబాద్ వెళ్ళినప్పుడు కె. వి. గోపాలస్వామిగారింటికి కెళ్ళాను గానీ ఆయన 'క్యాంప్'లో వుండడంతో వీలుపళ్ళేదు. అట్లాగే సి. ఆర్. రెడ్డి పర్సనల్ పేపర్స్‌లోని జాబులు వగైరా ఢిల్లీలోని జవహార్‌లాల్ మెమోరియల్ లైబ్రరీలో భద్రపరచివున్నవి చూస్తే వున్నవ- సి. ఆర్. రెడ్డి సంబంధాల గూర్చి కొంత దొరకవచ్చునేమో అనుకొన్నానుగానీ ఢిల్లీ యెట్లా వెళ్ళేది? యిక అప్పటి కమ్యూనిస్టుద్యమ సూత్రధారీ, వుమ్మడి మద్రాసు రాష్ట్ర కూలి రక్షణ సంఘం జనరల్ సెక్రిటరీగా వుంటూ అప్పటి జిల్లా సంఘాల పర్యవేక్షకులైన పుచ్చలపల్లి సుందరయ్యగారితో యింటర్వ్యూ జరిపి కొన్ని విషయాలు రాబట్టడానికి వీలవుతుందేమోననుకొన్నాను గానీ యిదీ కుదరలేదు.

యిట్లా మాలపల్లి నిషేధాలకు సంబంధించే బద్దలు కొట్టవల్సిన గ్రంథగ్రంధులు యింకా అనేకం వుండనే వున్నాయి.

1935 నాటి 'గుంటూరు కూలి సంరక్షణ సంఘం' కరపత్రాల కేసు ముద్దాయిల్లో యిటీవలే మరణించిన జొన్నలగడ్డ రామలింగయ్యతోబాటు వొకరైన శ్రీ ప్రతాప రామసుబ్బయ్యకి జాబు రాసి కనుక్కొంటే ఆయన జవాబిది: ''ఆ నాటి 'కూలి సంరక్షణ సంఘం' ప్రచురించిన కరపత్రాల్లో 'మాలపల్లి' నుండి extracts తీసి వేయలేదు. ఆ నవల నుండి మేము, మా ద్వారా మరికొందరు ఉత్తేజం పొందిన మాట నిజమే కాని దాని యందలి ఫిలాసఫీ మా వర్గ సంఘర్షణ సిద్ధాంతానికి అనుకూలంగా లేదు. కాగా హరిజనులకు, యితర పీడిత వర్గాలకు జరిగే ఘోర అన్యాయాలను సిద్ధహస్తులయిన శ్రీ ఉన్నవగారు అత్యంత సామర్థ్యంతో కళ్ళకు కట్టినట్లు చిత్రించి ఉండడంచేత ఆ నవల మా ప్రచారానికి కొంత దోహదం చేసిన మాట వాస్తవం.'' యీ నాలుగు మాటలూ చదివినతర్వాత లెనిన్ టాల్‌స్టాయ్‌ని గూర్చి వ్రాసిన వ్యాసంలో యిటువంటి భావాన్నే మరింత వుద్విగ్నంగా చెప్పిన విషయం స్మరణకొస్తున్నది.

మరి 1934 తర్వాత ఆంధ్ర ప్రాంతంలో తలెత్తసాగిన కూలి రక్షణ సంఘాల ప్రచారానికి తాను (వున్నవ) అనుకోకుండానే ఒక గొప్ప ఆయుధాన్ని అందించాడు, దీన్ని నిరూపించినందుకు బంగోరెని మనసారా మెచ్చుకోంటున్నాను-అని అంటూనే కె. వి. రమణారెడ్డిగారు మాలపల్లిలోని వెంకటదాసు వ్యవహారం రాబిన్‌హుడ్‌ని జ్ఞాపకం చేస్తుంది గానీ కమ్యూనిస్టుని కాదు అని అన్నారు. యీ నాటి సంగతేమో కానీ, ఆ నాటి కమ్యూనిస్టులు వెంకటదాసులో ముఖ్యంగా అతని కోర్టు వుపన్యాసంలో బుర్రకథాగేయంలో కమ్యూనిస్టునే చూచుకొన్నారు.

యింతకూ రమణారెడ్డి నేనేదో ఆ విషయాన్ని నిరూపించినట్లు భావిస్తున్నారుగానీ, నేనింకా దాన్ని గట్టిగా సప్రమాణంగా రుజువు పరచలేకపోతున్నాను. అయితే యీ కూలి రక్షణ సంఘాలకు సంబంధించి ఆర్కివ్స్‌లో నేను లోడ గలిగిన ఫైళ్ళనుండి, అప్పటి

కమ్యూనిస్టుశాఖల్లో పనిచేసిన కార్యకర్తలతో జరిపిన వుత్తర ప్రత్యుత్తరాలను బట్టి అది నమ్మశక్యంగా వున్నదని మాత్రం ప్రస్తుతానికి చెప్పగలుగుతున్నాను.

రమణారెడ్డిగారు 'నా యాంగిల్ నుంచి' అని రాసిన పీఠికలో చాలా సిద్ధాంతమయమైన చర్చను అందించారు. అయితే ఆయ నిచ్చిన తీర్పులతో నేను చాలావరకు విభేదించవలసి వస్తున్నది. రమణారెడ్డిగారు నా గురుప్రాయులు. ఆయన స్నేహ సాన్నిహిత్యాల నుండి, ఆయన రచనల నుండి నేను నేర్చుకొన్నదీ నేర్చుకొంటున్నదీ యెంతో వుంది. యీ గ్రంథ రచనలో సైతం నాకు ఆయనెంతో తోడ్పడ్డారు. నా రాతప్రతిలో చాలా భాగాన్ని ఆయనకు వొకటికి రెండుసార్లు చూపించి సలహాలు తీసుకొని మార్పులుచేసి మరీ రూపొందించవలసి వచ్చింది. ఆయన పుస్తకాల నంగతటుంచి, యెంత కాలంక్రితమో యెక్కడెక్కడి నుంచో యెత్తిరాసుకున్న అముద్రిత నోట్సుల్లోనుంచి సమాచారాన్ని వాడుకొన్నాను. యిందులో అక్కడక్కడా ఆయన సొంతశైలిలోని పదాలు కానవచ్చినా ఆశ్చర్యం లేదు.

నా మనస్తత్వాన్ని హీనోత్తీయిజంతో సరిపోలుస్తూ అందులో తన పూచీ లేదంటున్నారు రమణారెడ్డిగారు. ఆ పోలిక సరైనదే అయితే శిష్యుడుగా గురువుగారి దగ్గర్నుంచే దాన్ని నేను పుణికి పుచ్చుకొన్నానా అనిపిస్తున్నది. ఆయన తన విమర్శ గ్రంథాల్లో గురజాడను గురించి వీరేశలింగం గురించి కూలంకషంగా రాసినట్లే కవికోకిలను గూర్చి రాశారు. శరత్‌ను గూర్చి రాశారు. రవీంద్రుణ్ణి అనువదించారు కూడాను. అయితే తన కఠోర మార్క్సిస్టు దృష్టితో దర్శించి వాళ్ళలోని అభ్యుదయ ధోరణులను పరామర్శించ గలిగారు. నాలో ఆ కఠోరదృష్టి లేదు గానీ, వొట్టి ఆరాధనలో పడిపోకుండానే, నాకున్న సవిమర్శక శక్తులను చిక్కబట్టుకునే గురజాడ, వీరేశలింగం, బ్రౌన్, యిప్పుడు వున్నవపై చెయ్యి చేసుకొంటున్నాను.

యీ రకం వైయక్తిక విషయాలటుంచి ముందుగా నమస్కార బాణం వేసి, ఆయన చేసిన కొన్ని తీర్మానాలతో నాకున్న పేచీలు చర్చించదల్చాను. "ఉన్నవతోనే కమ్యూనిజం ప్రచారం మొదలైందని చెప్పడం చారిత్రకంగా వాస్తవం కాదు"- అని అన్నారాయన. ఆమాట లెవరన్నారు? నేనన్నానా? నా వాక్యాలివి: "కమ్యూనిస్టు పార్టీ అనేది తెలుగునాట అవతరించక ముందే మార్క్సిస్టు భావప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది" అని 13వ పేజీలోనూ, "ఆనాటికి తెలుగులో యీ మాత్రపు కమ్యూనిస్టు భావాలను అంత వుద్విగ్నంగా విన్పించే వాక్యాలను ప్రభుత్వం బహుశా విని వుండదు"- అని 69వ పేజీలోనూ రాశాను. రమణారెడ్డిగారి ఆ వ్యాఖ్యానం తర్వాత యీ వాక్యాలను వుపసంహరించుకోవాలా?

వర్గపోరాటాన్ని గుర్తించినంత మాత్రాన యెవ్వడూ కమ్యూనిస్టు కాలేడని,... శ్రామికవర్గ నియంతృత్వాన్ని గుర్తించి అందుకోసం...క్రియాశీలంగా పాల్గొనేవాడే కమ్యూనిస్టు కాగలడని లెనిన్ చెప్పిన నిర్వచనాన్ని రమణారెడ్డిగారు చాలా టెక్నికల్‌గా వాదనలో ప్రవేశపెడ్తున్నారు. బాగానే వుంది. అంతర్జాతీయ రంగంలోనూ జాతీయరంగంలోనూ యీ నిర్వచనం సమగ్రమైంది కాదనీ సరైందికాదని చెప్పడానికి గల సాదృశ్యాల సంగతటుంచి, పైపెచ్చు తెలుగుదేశంలో యీ వుద్యమం ప్రారంభదశలోనైనా లేనప్పుడు యీ నిర్వచనంతో చూడడం mechanical application అవుతుందే కానీ మరొకటి కాదు. శ్రామికవర్గ నియంతృత్వాన్ని అంగీకరిస్తూనే కమ్యూనిస్టులతోనూ వాళ్ళ పార్టీతోనూ క్రియాశీలక సంబంధాలు లేకుండా పాల్గొనని వాణ్ణి యేమనాలి? దీన్నే యింకా ముందుకు పొడిగించడం నాకిప్పుడు యిష్టంలేదుగానీ, యిది కేవలం హైపోథిటికల్‌గా లేవదీస్తున్న ప్రశ్న మాత్రంకాదు. 1934లో కమ్యూనిస్టు

మేనిఫెస్టో తెలుగు తర్జుమాను 'మొదటిసారి' ప్రచురించిన గద్దె లింగయ్య విషయంలో యిటువంటి విడ్డూరమైన పరిస్థితే తటస్థించింది. ఆ గ్రంథాన్ని ప్రకటించినందుకు, పీఠిక రాసినందుకు ఆయనపై ప్రభుత్వం కేసు పెట్టబోతే అప్పటి అడ్వకేట్ జనరల్ అల్లాడి యిటు వంటి టెక్నికల్ వాదననే లేవదీసి ప్రభుత్వాన్ని బిత్తరలో పెట్టాడు:

"The mere glorification of communistic ideology which may have the tendency to assist the operations of an association (Communist Party) which is declared unlawful ... is not enough to bring it under law. Therefore the crucial question in the case will be is it merely a general glorification or holding up of communist ideology or is it for the purpose of assisting the operations of an association ... unless other evidence is forthcoming that the writer is connected with a particular organisation ... and the book was published for the purpose of assisting the operations of that association it would not be safe to launch a prosecution ..."

దీనిమీదట చీఫ్ సెక్రెటరీ తననోట్‌లో యిట్లా రాశాడు : "...a man who spreads communism is not assisting the operations of the communist party unless otherwise proved that he is connected with the party...it is a curious argument."

యీ లెనిన్ నిర్వచనాన్ని 1921–22 నాటి ఆంధ్రదేశానికి అన్వయించి చూచినప్పుడు గానీ అసలు సమస్య, నిర్వచన సమస్య, అర్థం కాదు. అసలు ఆ లెనిన్ నిర్వచనం యే సంవత్సరానిది ?

మాలపల్లి 'సంగ విజయం' అయిందేగానీ, 'వెంకట విజయం' కాలేదుగదా అని ఆయన మరో ప్రశ్న. 1922–23 నుంచీ 1935 దాకా దాదాపు పదేళ్ళకుపైగా మూడు భాగాలు మాత్రమే (అంటే వెంకటదాసు కోర్టు వుపన్యాసం, జడ్జిమెంట్‌తో ఆగిపోయి) అచ్చయిన మాలపల్లి వెంకటవిజయం గానే వుండి పోయింది. అందుకే తొలి కమ్యూనిస్టు కార్యకర్తలు దాన్నుండి వుత్తేజాన్ని

***

పొందారు. ప్రేరణ పొందారు. తమ పుస్తకం ప్రచారానికి వినియోగించుకొన్నారు. నాలుగో భాగం అచ్చయిన తర్వాతే అది సంగ విజయమైంది. సంగడివైపు అంటే గాంధీ స్వరాజ్యంవైపు పక్షపాతం వున్నదని రమణారెడ్డిగారి వాదన.

నిజమే. స్వరాజ్యమా? కమ్యూనిజమా? యేది కావాలి అని 1922లో భావుకుడైన తెలుగువాణ్ణి, లేదా భారతీయుడైన భావుకుణ్ణి ప్రశ్నిస్తే స్వరాజ్యంవైపే మొగ్గేవాళ్ళు, స్వరాజ్యమూ వద్దు- కమ్యూనిజమూ వద్దు బ్రిటీష్ రాజ్యమే వుండాలనేవాళ్ళుగా వున్న ఆంధ్రదేశ పరిస్థితిలో వున్నవ మాలపల్లి స్వరాజ్యం+కమ్యూనిజం కావాలని కాంక్షిస్తున్నది. యీ చారిత్రక పరిస్థితిని అంచనాలోకి తీసుకోకుండానే వున్నవను పక్షపాతి అంటున్నారాయన. పక్షపాతమే అయితే చారిత్రక అవసరాల నుండి యేర్పడిన పక్షపాతమది. ఆ రోజుల్లో స్వరాజ్యం వైపు మొగ్గు చూపడం పక్షపాతం కాదు. చారిత్రక తక్షణ కర్తవ్యం.

1962 యేప్రిల్ 'చేతన' (విజయవాడ)లో వచ్చిన కే. శే. వున్నవ 'నా అనుభవాలు' వ్యాసంలో తన యీ మానసిక వ్యవస్థను కొంత చర్చించాడు. వున్నవ జాతీయ బంధాలనుండి కమ్యూనిజం చంద్రుణ్ణి చూశాడు. జాతీయోద్యమంలోకి ఆ చందమామ చల్లని వెన్నెలను యిముడ్చుకో జూశాడు. కమ్యూనిస్టులేమో సంశ్లిష్టమైన సంక్లిష్టమైన అంతర్జాతీయ భవబంధాలతో భావానుబంధాలతో స్వదేశాన్ని దర్శించారు. మచ్చిక చేసుకోవాలని చూశారు. యీ రెండింటిమధ్య వుండవలసిన వైరుధ్యమంతా యిక్కడే వుంది. ఆ నాటికి వున్నవ చేసిన గొప్ప భావన అది నిజంగా గొప్పే అయితే, లేదా పొరపాటు అది నిజంగా పొరబాటే అయితే, కమ్యూనిజానికి జాతీయంగా అంటుగట్టుకోవాలనుకోవడమే. అతని మెరిట్ గానీ డీమెరిట్ గానీ యిక్కడే వుందని నా విశ్వాసం.

తాత్విక దృష్ట్యా చూదినప్పుడు జాతీయవాదంలో పరిమితులు బలహీనతలు గోచరించినట్లే, ఆచరణరీత్యా అంతర్జాతీయ వాదం లోని యిప్పటి వైరుధ్యాలు వైఫల్యాలు వ్యక్తంగావడం లేదా? యెన్నన్నా వివిధ దేశాల్లో నేడున్న కమ్యూనిస్టు ప్రభుత్వాల మధ్య 'అంతర్జాతీయ వుద్యమ వైఖరి'లో స్పష్టమైన వైరుధ్యాలే గోచరిస్తున్నాయి. తమ తమ జాతీయ ప్రయోజనాలకు బంధాలకు లొంగి కమ్యూనిస్టులు పనిచేయవలసి వస్తున్నది. తమ జాతీయ అవసరాలను కొంత మేరకైనా త్యాగంచేసి లేదా పక్కకు నెట్టి కమ్యూనిస్టు ప్రభుత్వాలు అంతర్జాతీయ వుద్యమ పరివ్యాప్తికి పనిచేస్తున్నాయా?

యిక నిషేధం యెత్తివేత విషయంలో కొన్ని వాక్యాలను తొలగించడానికి వున్నవ యెందుకొప్పుకొన్నాడు, అదేసమయంలో గరిమెళ్ళలాగా యెందుకు మొండికిపడి నిలవలేదు అని అడుగుతున్నారు కె. వి. ఆర్. గారు. అడగవల్సిందే. యీ విషయమై గ్రంథంలో 69వ పేజీలో కొంతవరకు చర్చించాననే అనుకొంటున్నాను. అయినా అడుగుతున్నారు. ప్రభుత్వం తొలి బింకం వదిలి దిగివచ్చినప్పుడు, యెంతో దిగివచ్చినప్పుడు, తనూ కొంత సడలించుకోక తప్పని పరిస్థితి యెదురైంది. సహాయ నిరాకరణం నీళ్ళు గారిపోయి వొకవిధంగా **responsive cooperation** అనే కొత్తరకపు రాజకీయు యెత్తుగడ ప్రవేశించిన కాలమది. యెంతో దక్షతతో లౌక్యంతోను వాదించి జగ్గడి గేయం తొలగింపుకు వొప్పుకోకుండా దాన్ని వుంచుకోగలిగాడు. యిది రాజీకాదు, లొంగుబాటూకాదు, వాస్తవబద్ధమైన లౌక్యం కావచ్చు. కమ్యూనిజం ప్రచారం చేయడం నేరమేమీకాదని ధైర్యం చేసి విస్పష్టంగా ప్రభుత్వం మొఖాన ఆనాడే చెప్పగలిగిన వున్నవలో లొంగుబాటువంటి దాన్ని కె. వి. ఆర్., వంటివారు చూడదల్చుకోవడం ఆశ్చర్యంగానే వుంది. అయినా 'అదే సమయంలో' అని అన్నారు. గరిమెళ్ళ మొండికేసుకున్నది 1922లో. వున్నవ ప్రభుత్వంతో వాదానికి దిగింది 1928లో. యీ ఆరేళ్ళ వ్యవధిలో యెంతో చరిత్ర నడిచిన విషయం ఆయన దృష్టిలోకి తీసుకొన్నారా?

వొక విరసం అభిమాని నాతో అన్నాడు— వున్నవ మాలపల్లిలో కమ్యూనిజం అనేది యేమైనా వున్నదనుకొంటున్నారా, నిజంగానే వుంటే కాశీనాథుని నాగేశ్వరరావులాంటివాళ్ళు దాన్నెందుకు మెచ్చుకున్నారో, మెచ్చుకోగలిగారో ఆలోచించారా; వాళ్ళు మెచ్చుకొన్నారంటే అందులో అది లేదనే గదా— అని వ్యంగ్యంగా నెగటివ్‌గా వాదించాడు. దీనికి సమాధానం నా ధోరణిలో నేను 72–78 పేజీల్లో చెప్పాను. యిప్పుడది చాలదనిపిస్తున్నది. చైనాతో అమెరికా సఖ్యానికి దిగిందంటే, లేదా చైనా అమెరికాతో పొత్తు కలిపిందంటే చైనాలో కమ్యూనిజం లేదనాలా?

యిప్పటికే చెప్పవలసిన చాలా విషయాలు దారి తొలగి పోయి నా ముందుమాటలు చాలాదూరం వచ్చింది. యిక పొడిగించక యిక్కడే యిప్పుడే ఫుల్‌స్టాప్ పెడ్తూ, వొక్కమాట.

ఆఖరుగా 'మాలపల్లి'పై వచ్చిన నాన్‌సెన్స్ రాతలకు వొక నిలువుటద్దం డాక్టర్ బొడ్డపాటి వేంకటకుటుంబరావు 'ఆంధ్ర నవలా పరిణామము' (1971) పేజీ 279 లో దొరుకుతుంది. పరికిస్తారా:

> "నాగరక ప్రపంచము గొడ్డుపోయినట్లుగ నిందుఁ జిత్రింపఁ బడినది జానపద జగత్తు. ధన విద్యా కుల సంపదలతో దులఁ దూగు వారెందఱో యుండఁగా, నిందు వర్ణింపబడిన ప్రధాన పాత్రలు సంఘుజఘున్యజ వర్గమువి. పూర్వ సాంప్రదాయ ధిక్కారమున కీ యుగ వాతావరణము నండఁజూచుకొని యింత తెగించిన నవలా ప్రథమ ప్రయత్న మిదియే."

యీ తీసిస్ రచనకుగాను వుస్మానియా విశ్వవిద్యాలయం ఆయనకు పిహెచ్. డి. తోక తగిల్చింది! బాగుందికదూ!

తిరుపతి. —బంగోర

"...Passages preaching rank communism and encouraging the union of labour against capital and strikes should be omitted or rewritten (in the novel)."

—మద్రాసు ప్రభుత్వం 1928 సంవత్సరం జనవరి 18న గుంటూరులోని వున్నవ లక్ష్మీనారాయణకు పంపిన వొక జాబులోని వాక్యమిది.

" ..I have to state that it is not wrong to preach communism or to encourage the union of labour against capital and yet..."

—వున్నవ లక్ష్మీనారాయణ 30–1–1928 న గుంటూరు నుంచి సదరు ప్రభుత్వానికి జవాబిస్తూ వ్రాసిన లేఖ లోని వాక్యభాగం యిది.

యింతకాలం తెలుగుపాఠకుల యెరుకలోకి
రాకుండానే ప్రభుత్వ ఫైళ్ళలో మాత్రమే
మగ్గుతూ వచ్చిన తెలుగు సాహిత్య చరిత్రలోని
వొక అజ్ఞాత అధ్యాయం
యీ పుస్తకం.

గాంధేయ మూర్తి వున్నవ లక్ష్మీనారాయణ
తన 'మాలపల్లి' నవలాశరీరంలో నుంచి
కొన్ని వాక్యాల మాంసపు ముక్కల్ని కోసి
అప్పటి బ్రిటిష్ – జస్టిస్ పార్టీ ప్రభుత్వపు
మొసలినోటికి అందివ్వవలసి వచ్చింది!

యీ దిగువ యిచ్చినవే ఆ కొన్ని వాక్యాలు. మాలపల్లిపై
ప్రభుత్వం విధించిన కటిక నిషేధం మూలంగా తర్వాతి
ముద్రిత ప్రతుల్లోకి రాకుండా కనుమరుగైనవే
యీ క్రింది ప్రాణపూర్ణమైన వాక్యాలు!

"రాజ్యాలు మండలాలు పట్టణాలు వాండ్ల (ఐశ్వర్య వంతుల) పరమయినవి. పెద్దదొంగా చిన్నదొంగా అనే భేదంతో అందరూ దొంగలే. సంఘంయొక్క ఆస్తి అంతా అపహరించి శాశ్వతంగా వంశపారం పర్యంగా నిలుపుకోడాని కనుకూలమయిన చట్టాలు కల్పించుకొన్నారు (ధనికులు)."

"(కష్టపడి పంటలు పండించి చేతిపనులు జేసి అమర్చిన పదార్థమంతా ధనవంతు లపహరించి తిని తొక్కతొం బాడి జేసి శ్రమపడి పనిజేసేవాండ్లకు ఆహారం లేకుండా చేస్తున్నారు.) భాగ్యవంతుల పండగలు బీదవాండ్ల కెండగలు. భాగ్యవంతుల కరువులు బీదలకు పస్తులు. భాగ్యవంతులు పొలాలు తమవనీ మూలధనం తాము బెట్టి బీదలకు యంత్రములలో పని కల్పిస్తున్నామనీ అనేక సాకులు గల్పించి పనివాండ్ల శ్రమయొక్క ఫల మంతా అపహరించడం నమ్మకద్రోహం గాదుట. ఆ ఆస్తిలో దొంగలకే కాక వారి సంతానానికి కూడ చిరకాల హక్కు కలుగుతుందిట."

‘‘సుంకాలు విధించి దేశీయ వృత్తులను నశింపుజేసి వేల కోట్లు యిండియా ధనాన్ని హరించడం దొంగతనం గాదని చట్టం జెపుతున్నది. యీ పనులు తప్పన్నా వీటిని సవరించినా చౌర్యమూ రాజద్రోహమూ అవుతుందని చట్టాలుజేసి పెట్టుకొన్నారు.’’

‘‘(ధనికులే కలియుగ రాక్షసులు). యీ రాక్షసత్వం బీదల హింసించడంవల్ల వాండ్లకు గలిగింది. ధన భారమే వాండ్లను కుంగదీస్తున్నది. వాండ్ల ఆత్మలూ దేహాలూ గూడా దుష్కర్మలవల్ల విరూపమును బొందుతున్నవి.’’

‘‘ప్రభుత్వ పద్ధతి యేది చూచినా మేడిపండు వ్యవహారంగా వున్నది. దీనిని సవరించవలెనని ప్రయత్నం చేయడమే తప్పు. కరిగిపొయ్యవలసింది తప్ప మాట్లు వేసి ప్రయోజనం లేదు.’’

# పున్నవ వ్యక్తిత్వాంశాలు

ముందుకు పోయేముందు యాభైయేడేళ్ళ వెనక్కు వెళ్దాం. పున్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి నవల వ్రాయబోతున్న తరుణం అది.

అప్పటి విషయాల స్ఫూర్తిని కాస్తయినా పొందుదామని పాత పత్రికల సంపుటాలను తిరగేస్తుంటే ఆంధ్ర (దిన) పత్రికలో పున్నవను గురించి మామూలు మాటల్లో మామూలు విషయాన్నే తెలిపే వొక వార్తాలేఖ నాదృష్టిని ఆకట్టుకొంది:

"ఉన్నవ లక్ష్మీనారాయణగారితో ఒకప్పుడు నేను సంభాషించి యుంటిని. అప్పుడు వారిని 'ప్లీడరు వృత్తిని మీరు మాన దలచినట్టు మీ గుమాస్తావల్ల నాకు తెలిసినది. మీ స్థితియేమి, మీరు ఎందుకు తొందరపడెదరు' అని నేను ప్రశ్నించితిని. అందుకు వారు 'నిజమే నేను ధనవంతుడను కాదు. నాకు ఆర్థిక లోపమున్నది. కాని ఏ వ్యక్తియైనను స్వలాభమును చూచుకొనుట ధర్మముకాదు. నేను ద్రవ్యము సంపాదించి నా యక్కరలు తీరునంతవరకు యీ నాన్ కో ఆపరేషన్ మూవ్‌మెంటు వుండునా? ఈ సమయములో ఉద్యమమునకు తగిన సహాయము చేయక పోయినచో ముందు దేశమునకు మహా అనర్థకము రాగలదు గాన వెంటనే నావృత్తిని నేను వదిలి ఉద్యమప్రచారము చేయుటకు నిశ్చయించుకొంటి'నని చెప్పియుండెను."

అతిశయోక్తులు ధ్వనించడం లేదు. అనవసర వర్ణనలు గుప్పించడం లేదు. పేరాల నుంచి రావుల సీతారామయ్య అనే వ్యక్తి మామూలు పొడిపొడి మాటల్లో

వ్రాసిన యీ పై వాక్యాల్లో వున్నవ సహజ వ్యక్తిత్వాంశలేవో ద్యోతకమవుతున్నాయి. 'ఆంధ్రదేశము : సహాయ నిరాకరణము' అనే వార్తావిభాగంలో 1921 ఆగస్టు 4 తేది గురువారంనాటి ఆంధ్ర (దిన) పత్రిక 10వ పేజీలో వచ్చిన వొక చిన్నలేఖలోని వాక్యాలివి. వున్నవ లక్ష్మీనారాయణను మాచర్ల వద్ద అరెస్టు చేసి గుంటూరు మీదుగా పోలీసులు రైల్లో తీసుకుపోయిన పదిరోజుల్లోపున అచ్చయిన చిన్న లేఖ అది.

కడుపులో చల్ల కదలకుండా యింటిపట్టున కూర్చోగలిగిన స్థితిమంతుడేమీ కాదు వున్నవ. 'సొంత కృషి' మీద పైకి వచ్చి ధనార్జనపరుడై ప్రాచుర్యంలోకొచ్చిన వ్యక్తీ కాదు. 1897లో మెట్రిక్ లేషన్ పూర్తిచేసి 1900లో యఫ్. యె. పాసై పేదరికంవల్ల చదువుకు స్వస్తిచెప్పి గుంటూరు కాలేజిలో వుపాధ్యాయుడుగా కొంతకాలం పనిచేశాడు.1 రాజకీయ విషయాల్లో జోక్యం కలగజేసుకో కూడదనే కట్టడి చేయడంతో తన రాజకీయ వ్యక్తిత్వానికీ వుపాధ్యాయత్వానికీ లంగరతకదని బడిపంతులగిరి వదులుకొన్నాడు. 1903లో డిస్ట్రిక్ట్ మున్సబ్ కోర్టులో ప్లీడర్ గా చేరి యెట్లాగో 'న్యాయమార్గాన' కాలం నెట్టుకొస్తుండేవాడు. మరసటేడే యీ న్యాయవాద వృత్తినీ మానేసి రాజమండ్రి వెళ్లి ట్రైనింగ్ కాలేజిలో చేరాడు. 1905లో పట్టపరీక్షలో సగంమాత్రమే పాసయ్యాడు.

1902లోనే వుపాధ్యాయుడుగా వున్నపుడే గుంటూర్లో వితంతు వివాహాన్ని వీరేశలింగం అధ్యక్షతన జరిపించి, తన సనాతన బంధుమిత్రుల బహిష్కారాన్ని నిబ్బరంతో యెదుర్కొన్నాడు. గుంటూరు వితంతు శరణాలయం సూపరెన్టెంటుగా వుండి పరంపరగా సంస్కరణ పెళ్లిళ్ళు జరిపించాడు. 'గుంటూరు వీరేశలింగం'గా

---

1. 1921 ఆగస్టు 10 తేది ఆంధ్ర (దిన) పత్రికలో 'శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు' అనే జీవిత రేఖారచన. వున్నవ పుట్టినతేదీ విషయంలో మనవాళ్ళకు యేకాభిప్రాయం వున్నట్లులేదు. తెలుగు భాషాసమితి వారి 'విజ్ఞానసర్వస్వము' 1873 అని పేర్కొన్నది. (చూడు 4 వ సంపుటం 'తెలుగుసంస్కృతి-చరిత్ర' 2 వ భాగం). 'సంఘసంస్కర్త ఉన్నవ' కర్త జి. వెంకటసుబ్బయ్య (హైదరాబాదు, 1977). వున్నవ పుట్టినతేదీ 1877 డిసెంబర్ 4 తేదీ అన్నాడు. యీ ఆంధ్రపత్రిక వ్యాసంలో 'ఈశ్వరనామ సంవత్సర కార్తీక బహుళ 30' అని వుంది. దీనికి సరియైన యింగ్లీషుతేది 1877 డిసెంబర్ 4 అవుతుంది. మరో వున్నవ జీవితచరిత్రకారుడు మందలపర్తి ఉపేంద్రశర్మ యీ గొడవలేమీ పెట్టుకోకుండా 'ఈశ్వరనామ సంవత్సర సరియైన 1877 లో పంతులుగారు జన్మించి'నట్లు వ్రాసి తృప్తిచెందాడు)

పేరు పడ్డాడు.[2] రాజమండ్రి చదువులకు వెళ్ళినప్పుడు అక్కడి వీరేశలింగం పితంతు శరణాలయానికి కూడా కొంతకాలం సూపర్నెంటుగా పనిచేశాడు గానీ అనతికాలంలోనే వీరేశలింగంతో విభేదించినట్లే వున్నాడు. బహుశా తనలో రగులు కొంటూ వచ్చిన వుగ్ర జాతీయోద్యమాభిమానంవల్లనే వీరేశలింగంతో యిమడలేక పోయినట్లు భావించవలసి వుంటుంది.

గుంటూరుకు తిరిగొచ్చిన తర్వాత కొంతకాలం ర్యాలీబ్రదర్స్‌లో నెలకు 30 రూపాయల జీతంతో క్యాషియర్‌గా పని చేశాడు.[3] అక్కడా రాజకీయాల్లో పాల్గొనకూడదనే షరతు పెట్టడంతో తప్పుకొన్నాడు. 1908లో మళ్ళీ న్యాయవాద వృత్తి చేపట్టాడు.

1913 సెప్టెంబర్ 6 తేదీన స్టీమర్లో లండన్ వెళ్ళాడు. డబ్లిన్‌లో బారెట్లా చదివి నూత్నమైన విశాలభావాలు వంట పట్టించుకొని వచ్చాడు. అయిరిష్ ప్రజలు స్వరాజ్యం కోసం సాగిస్తూ వచ్చిన 'హోమ్‌రూల్' పోరాటం, వున్నవ అక్కడికి వెళ్ళేప్పటికి 'షిన్ ఫాన్' వుద్యమంగా రూపాంతరం చెందింది. రాజకీయాభినివేశం వున్న వున్నవలో ఆ వుద్యమప్రభావం గాఢంగానే పని చేసివుండాలి.

యీ సందర్భంలో, యింకా నిర్ధారణ చేయబడని వుదంతమే అయినా, వున్నవ అయిర్లెండ్‌లో వుండగా జరిగిన వొక సంఘటన గూర్చి ప్రస్తావించ వలసి వుంది. కపిల వెంకటరావు వ్రాసిన విషయం యిది:

"ఐర్లెండులో ఉన్నప్పుడు లక్ష్మీనారాయణగారు హాజరుకాని రాజకీయ సభ లేదు... గాంధీమహాత్ముడు మొదటి ప్రపంచ మహాసంగ్రామం మొదటి రోజులలో (బ్రిటన్) మిత్రమండలి సైనికుల సహాయార్థమై ఆంబులెన్సు దళాలను తయారుచేయ డమునకు ఉద్యుక్తుడు కాగా లక్ష్మీనారాయణగారా వుద్దేశాన్ని గట్టిగా ఖండించి నాడు. నల్లవాళ్ళను బానిసలుగా ఉంచి నల్లవాళ్ళ నెత్తురు పీల్చి జీవించే తెల్ల వాళ్ళకు మనమెంత మాత్రం సాయం చేయకూడదని అతని వాదన. ఆదే సంద

---

2. యింగ్లీషు దినపత్రిక Hindu 1910 జూన్ 7 తేదీన 'The second Viresalingam of Guntur' అని పేర్కొన్నది[చూడు: కావలి జవహర్ భారతి లెక్చరర్ వి. రామకృష్ణమాచార్యులు పిహెచ్. డి. థైసిస్ 'Social Reform Movements in Andhra 1848-1919' (జవహర్లాల్ నెహ్రూ యూనివర్సిటీ, న్యూఢిల్లీ, 1977, పేజీ 257]

3. వాల్కార్ట్ కంపెనీ క్యాషియర్ అని కపిల వెంకటరావు వ్యాసం.

త్నంలో ఆయన వ్రాసి ప్రచురించిన వ్యాసాలను ప్రభుత్వంవారు అంతు పెట్టినారు.''4

''ఒకనాడు లాన్సుబరీ ఒక సభలో ప్రసంగిస్తూ, నల్ల కూలీలను గురించి నిరసించి మాట్లాడినాడు. పోట్లు లేక ప్రాపింగు తలలతో నిండి ఉన్న ఆ సభలో ఒక తలపాగా వ్యక్తి లేచి నిలబడి 'నేను నల్లవాడినే, నల్లవాళ్ళను గురించి అలా అన్నందుకు క్షమాపణ చెప్పక తీరదు' అంటూ తీవ్రంగా ఉపన్యాసమిచ్చారు. సభికులందరికీ అతనిపై అమిత వాత్సల్యం కలిగినది. ఆ తలపాగా వ్యక్తే లక్ష్మీనారాయణగారే.

''తలపాగా తాను ధరించడమే కాదు,...మిగతా వాళ్లు (బారెట్లా చదవను తనతో వచ్చిన ఆంధ్రమిత్రులు) కొన్న పోట్లు తగలపెట్టించినాడు. వాళ్లు ఆ దేశపు గుడ్డలు కొనుక్కోరాదు. వాళ్లు ధరించే ఉన్ని దుస్తులు హిందూదేశంనుంచి రావలెను. విదేశీవస్తు బహిష్కారమేకాదు. విదేశీయాచార బహిష్కారం కూడా ఆయన ఆచరిస్తూ, తన తోడివారిచేత ఆచరింపచేసినారు. మద్యమాంసాదుల, మహిళామణుల జోలికి పోమంటే పోమని వారందరివల్లను ఆయన ప్రమాణాలు చేయించుకున్నాడు.''5

మధ్యలో వొకసారి సెలవుల్లో స్వదేశానికి వచ్చినప్పుడు గుంటూర్లో శ్రీనివాసశాస్త్రి ఆంధ్రోద్యమంగూర్చి చేసిన వుపన్యాస సందర్భంలో అధ్యక్షత వహించిన వున్నవ మాట్లాడుతూ 'రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే యితర సంస్కరణ లేవీ అభివృద్ధి కావనీ, అయిరిష్ ప్రజల వలెనే భారతీయులు స్వరాజ్యాన్ని సాధించాలనీ స్పష్టంగా చాటూరు...వున్నవ వుద్దేశాలు తీవ్రమైన మార్పు చెందాయ'ని గుంటూరు మిత్రులు అనుకున్నారు.6

---

4. 'నవ్యాంధ్ర నిర్మాతలు', నవోదయపబ్లికేషన్స్, మద్రాను, పేజీ 88. వీరేశలింగం మొదలుకొని పొట్టి శ్రీరాములుదాకా మొత్తం 60 మంది ఆంధ్రనాయకుల సంగ్రహ జీవితచరిత్రల సంకలన గ్రంథం యిది. శ్రీశ్రీ, సముద్రాల, సఖా, మల్లంపల్లి ప్రభృతులు వ్రాసిన వ్యాసాలున్నాయి.సంకలనకర్త యెవరో లేదు. ప్రచురణ తేదీకూడా లేదు. వున్నవపై వ్రాసిన వ్యాసం కపిల వెంకటావుది.

5. ఆదే వ్యాసంలోది.

6. 1922 సెప్టెంబర్ 23 ఆంధ్ర (దిన) పత్రికలో వచ్చిన 'ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు; జీవితచరిత్ర' వ్యాసం. వ్రాసింది 'చిరకాలమిత్రుడు'.

బారిష్టర్ పరీక్షలో కృతార్థుడై 1916 జనవరిలో బయలుదేరి మార్చినెలలో స్వదేశానికి తిరిగి వచ్చాడు. మద్రాసులో హైకోర్టు న్యాయవాదిగా జీవితం ప్రారంభించాడు గానీ అక్కడ భార్య అనారోగ్య కారణంగా ఎక్కువకాలం వుండలేక పోయాడు. మద్రాసులో వున్నకాలంలో ఆంధ్ర ముఖ్యుల సరసన మెలగుతూ రాజకీయ సాంఘికోద్యమాల్లో చురుకుగా పాల్గొంటూనే వచ్చాడు. 1917 యేప్రిల్ 18న మద్రాసు ఆంధ్రపత్రికాఫీసులో ఆంధ్ర నాయక ముఖ్యుల సమావేశం జరిగినప్పుడు, మద్రాసులో వుంటున్న ఆంధ్రులకు ప్రత్యేక రాజకీయ సంఘం వుండాలనే తీర్మానాన్ని వున్నవ ప్రతిపాదించాడు. మూడు వారాల్లోపున ఆ సంఘం యేర్పడినప్పుడు యిద్దరు కార్యదర్శుల్లో వున్నవ వొకడుగా యెన్నికయ్యాడు.[7] ఆతర్వాత కొద్దికాలానికే మద్రాసు వదిలి గుంటూరుకే వచ్చి చేరుకున్నాడు. 'యువకులలో హెచ్చుపలుకుబడి'ని సంపాదించుకున్నాడు.[8]

యిక ఆంధ్రోద్యమ ప్రారంభకుల్లో వున్నవ వొక 'మొగేదారు'గా పేరెన్నికగన్నాడు. 1912 మే లో కృష్ణా-గుంటూరు జిల్లాల సంయుక్తసభలు నిడదవోలులో జరిగేదానికి పూర్వం గుంటూరు జిల్లా సంఘ కార్యదర్శిగా జిల్లా సంఘాన్ని సమావేశ పర్చి తీర్మానాలు తయారుచేయవలసి వచ్చినప్పుడు వున్నవ ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు గానీ నెగ్గలేదు.[9] అయితే చర్చలు మాత్రం వేడిగానూ వాడిగానూ జరిగాయి. నిడదవోలు సభల్లోనూ పట్టుబడ్డాడు గానీ తీర్మానం నెగ్గకపోయినా వాయిదా పడింది. యీ సందర్భంలోనే మద్రాసు, మైసూరు, హైద్రాబాదు, మహారాష్ట్ర, వొరిస్సా ప్రాంతాల్లో చెల్లాచెదురుగా వున్న ఆంధ్ర ప్రాంతాలను కలిపి జె. గురునాథంతో కలిసి విశాలాంధ్ర దేశపటాన్ని తయారుచేశాడు.[10] అప్పట్లో యిది అందరికీ వొక వింత అయింది. ఆ తర్వాత 1913 మే 26న బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగినప్పుడు ఆహ్వాన సంఘ కార్యదర్శులలో వున్నవ వొకడు. యీ సభల తర్వాతనే అయిర్లెండ్ వెళ్ళాడు.

---

7. M. Venkatarangaiya, 'The Freedom Struggle in Andhra Pradesh,' vol. II Hyderabad, 1969, Pp. 433-35.

8. కొండ వెంకటప్పయ్య, 'దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర' (హైద్రాబాదు, 2 వ యెడిషన్, 1966), పేజీ 168.

9. 1921 ఆగస్టు 10 ఆంధ్ర (దిన) పత్రిక వ్యాసం.

10. 1953 అక్టోబర్ 1 ఆంధ్ర (దిన) పత్రిక (ఆంధ్రరాష్ట్ర అవతరణ సంచిక) లో వున్నవ వ్యాసం. (K. V. Narayana Rao వ్రాసిన 'The Emergence of Andhra Pradesh' గ్రంథం, బొంబాయి, 1973, పేజీ 29 లో కోట్ చేశారు).

అయిర్లెండ్ నుండి వచ్చిన తర్వాత రేపల్లెలో జరిగిన గుంటూరు జిల్లా సంఘ సంస్కరణ సభకు అగ్రాసనాధిపతిగానూ, కొవ్వూర్లో జరిగిన కృష్ణామండల సంఘ సంస్కరణ సభకు అధ్యక్షుడుగానూ వుండి తన వుపన్యాసాలతో చర్చలతో నూతన వుద్బోధలు కలిగించాడు.[11] 1918లో సత్తెనపల్లిలో జరిగిన గుంటూరు మండల రాజకీయ సభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడయ్యాడు. అదే సంవత్సరం కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు అధ్యక్షతన గుంటూర్లో జరిగిన 'అవసరాంధ్ర రాష్ట్రీయ సభ'లో "మాంటేగ్యు మంత్రిచే నొసంగబడిన రాజకీయ సంస్కరణ ప్రణాళిక నేతిబీరకాయ వంటిదవి త్రోసివేయవలసిన్నదని ఈ ప్రణాళిక వలన జనసామాన్యమునకు కట్టుకొన గుడ్డయు తినుట కన్నమును రాదని నిర్భయముగ చెప్పి వాద ప్రతివాదముల గావించి యెదుర్కొనినారు."[12] ఆ తర్వాత అరెస్టయ్యేనాటికి గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షుడయ్యాడు.[13]

---

11. వున్నవ మొదట బ్రహ్మసమాజోద్దేశాలకు వ్యతిరేకిగా వున్నప్పటికీ గుంటూర్లోని ప్రార్థనా సమాజంలో సభ్యుడుగా వుంటూ దానిపట్ల సానుభూతి చూపేవాడు (చూడు: ఆంధ్రపత్రిక 1921 ఆగస్టు 10). ఇక 1910-12 ప్రాంతాల్లో కొండా వెంకటప్పయ్య వేటపాలెంలో శారదా నికేతన్ స్థాపించాలనుకొన్నప్పుడు వెంకటప్పయ్యతో కలిసి పూనా వెళ్ళి మహిళా విద్యాలయాన్ని చూచి కార్వేపండితుడితో ముచ్చటించి సంఘసంస్కరణ సంస్థల స్ఫూర్తిని కూడా పొంది వచ్చాడు (చూడు: కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర, పేజీ 160).

12. 1921 ఆగస్టు 10 ఆంధ్రపత్రిక. ఇంతకు పదేళ్ళక్రితం 1909 ఏప్రిల్ 10-12 తేదీల్లో భీమవరంలో 18 వ కృష్ణా-గుంటూరు మండలసభలు మోచర్ల రామచంద్రరావు అధ్యక్షతన జరిగినప్పుడు "కొద్దిరోజులక్రిందట యీ దేశపు రాజకీయ వ్యవహారముల సంస్కరణ విషయంలో లార్డ్ మార్లేగారున్ను, మింటోగారున్ను మనకు ఇచ్చిన దయాపూర్వకమైన కొన్ని మార్పులకున్ను....కృతజ్ఞత తెలియజేస్తూ" కె. వి. రెడ్డి నాయుడు తెచ్చిన తీర్మానాన్నీ, "అనాలోచనాపరులును, దుర్మార్గులూనగు కొందరిచేత నవలంబింపబడు నరాజక పద్ధతులను గర్హించుచు, వానియెడల తమ అసహ్యమును తెలియజేయుచు, అందువలన దేశమునకు గలుగుచున్న యుపద్రవమునకు చింతిల్లుచున్నారు. మరియు గుంటూరు-కృష్ణాజిల్లాలలో రాజద్రోహమునకు గాని అరాజక పద్ధతులకుగాని సంబంధించిన కుట్ర వుద్దేశము లేదనియు... విన్నవించుకొంటూ" చిలకమర్తి తెచ్చిన తీర్మానాన్నీ బలపర్చిన వున్నవ యిప్పుడు మాంటేగు-చెమ్స్ఫర్ సంస్కరణలను తిరస్కరించాలన్న దశకు వచ్చాడంటే ఆయనలోని రాజకీయవ్యక్తి కాలూకు ఆలోచనలు, సానుభూతులు క్రమంగా యెట్లా వికాసమవుతూ వచ్చాయో తెలుసుకోవచ్చు. (మళ్ళీ 1923 యెన్నికల్లో శాసన సభాప్రవేశాన్ని కోరే ఆంధ్ర స్వరాజ్యపార్టీ ముఖ్యుల్లో వొకడై సి. ఆర్. దాసుకు చేరువయ్యాడు వున్నవ).

13. 1921 జూలై 25 ఆంధ్రపత్రిక వార్త.

యితడు మొదటినుంచీ కాంగ్రెస్ రాజకీయాల్లోనూ సంఘ సంస్కరణోద్యమాల్లోనూ తలమున్కలై వుద్యమశీలిగా ప్రత్యక్ష కార్యకర్తగా వుంటూ వచ్చాడు వున్నవ. బుద్ధిజీవిగా దేశసమస్యలను గూర్చి లోతుగా ఆలోచించడం, గాఢంగా చర్చించడం నేర్చుకొన్నాడు. జొన్నవిత్తుల గురునాథంతో కలిసి 1907 లోనే ప్రకటించిన "ఇండియా రాజ్య తంత్రము" అనే గ్రంథంలోని 14 ఆఖరు అధ్యాయం 'నూతనోద్యమము'లో దేశ సమస్యలను గూర్చి అప్పటి వున్నవ ఆలోచనల పరిధి యెంత విశాలమైనదో, అభ్యుదయాంశ గలదో వివరిస్తుంది (చూడు : అనుబంధం-1).

యీ సందర్భంలోనే వున్నవ సాహిత్య దృక్పథం, వ్యక్తిత్వం యేమిటో తెలుసుకోవడం ప్రయోజనకారిగా వుంటుంది. ఆ రోజుల్లోనే తన నవల మాలపల్లిని వాడుకభాషలోనే వ్రాయాలనుకోవడంలో ఆయన ప్రజాతంత్ర దృష్టికి తార్కాణంగా పరిగణించాలి. 1920కి ముందే కృష్ణాపత్రికలో జానపద గేయాలు ప్రకటిస్తుండేవాడు.15 జానపద గేయ ఫణితులపై మక్కువ కనపర్చడమనేది వొట్టి పండిత సంప్రదాయమున్న వ్యక్తికి సాధ్యమయ్యే పని కాదు. సామాన్యజన హృదయానుభూతులనూ వారి వ్యక్తీకరణ రీతులను తెల్సుకోవాలనే శ్రద్ధ వున్నవాడికే యీ యిష్టం వుంటుంది. "సాహిత్య విషయములలో వీరు చేసిన పరిశ్రమ వారి స్నేహితులకు తప్ప పలువురకు తెలియదు. వీరికి ఆంధ్ర వాఙ్మయము కరతలామలకము. ఇందుతోబాటు జానపదుల యాచారవ్యవహారములును వారు చెప్పుకొనెడి కథలును పాటలును బాగుగ తెలియును. పల్లెటూరు వారనిన వారికి నిరసనము లేదు. వ్యావహారిక భాషపై ఏవగింపు జూపెడు పండితుల ప్రకాండుల దుస్సహానము వారికిష్టము లేదు. వ్యావహారిక భాషయందు గల వైచిత్ర్యములు వారికి హృద్గతములు. సాహిత్య విషయములందు మాత్రమే వారు పనిచేసి యున్నచో వారు వాఙ్మయమునకు మహోపకారము గావించి యుండెడివారు. కాని వారి కాలమితర విధముల వినియోగ

---

14. మాలపల్లి నవల వ్రాసేదానికి ముందు వున్నవ రచించిన గ్రంథాల్లో దీనితోబాటు మరి రెండు కూడా వున్నాయి. 'బిపిన్ చంద్రపాల్ వుపన్యాసాలు' (బహుశా ఆయన వుపన్యాసాలను తెలుగులోకి తర్జుమాచేసి వున్నవ యెడిట్ చేసిన గ్రంథం కావచ్చు), 'అక్బరు చరిత్ర', మచిలీపట్నం ఆంధ్ర భాషాభివర్ధని గ్రంథమాలలోనిది [చూడు: University of Madras అచ్చు వేయించిన Report of the Intermediate Telugu Composition Committee (1914), పేజీ 61].

15. మందలపర్తి ఉపేంద్రశర్మ, 'లక్ష్మీనారాయణులు' (వున్నవ జీవితచరిత్ర). హైదరాబాదు, 1974.

బడెను. మఱి సాంఘిక విషయములును రాజకీయ విషయములును ప్రాచీన కాలము నందు ఏరీతిన నుండెడివో కనుగొనుటకు వారు పరిశోధనముల గావించుచుండెడి వారు. వీరి సంపాదకత్వము క్రింద వెలువడెడి 'గుంటూరు పత్రిక'లో ఈ పరిశోధనములు వెల్లడియగునని భావించెదను"—అని వున్నవ 'చిరకాల మిత్రుడు' చెప్తున్నాడు.[16]

తెనాలి తాలూకా పెదపాలెంలోని శ్రీ కృష్ణాశ్రమానికి అధ్యక్షుడై నిమ్న జాతి జన సమస్యలకు తన మనసు అర్పించుకొన్నాడు.[17] 'దేశమంటే మట్టి' అనే భావన కాదు వున్నవది. 'దేశమంటే మనుషులోయ్' అని నిత్యానుభవరీత్యా మనసుకు తెచ్చుకొని మసలుతూ వచ్చాడు.[18] అందువల్లనే సమకాలికులైన కొందరు భావకవుల మోస్తరు తన దేశాభిమానాన్ని గుంటిలో మట్టిలో చుక్కల్లో పూల

---

16. 1922 సెప్టెంబర్ 23 ఆంధ్రపత్రికలో వ్యాసం. జానపద గేయకీతులపై వున్నవకు, గల మక్కువకు ఆ బాణీలపై ఆయనకుగల అధికారానికి 'స్వరాజ్యసోదె' (కృష్ణా పత్రిక), 'బుడబుక్కల జోస్యం' (1936 మే నెల 'భారతి' పత్రిక), వంటిరచనలు నిదర్శనలు.

17. హరిజనాది అట్టడుగుజాతి వారి అభ్యున్నతికోసం యేర్పడిన సంస్థ యిది. 1916 లో నల్లపాటి హనుమంతరావు, పుతుంబాక సీతారామయ్య శ్రీకృష్ణాశ్రమాన్ని స్థాపించారు. 1918 లో పంచములకు పాఠశాలపెట్టి భోజనవసతి, వృత్తిపనులు నేర్పడం వంటి పనులు ప్రారంభించారు. సహాయ నిరాకరణోద్యమం వచ్చిన తర్వాత అస్పృశ్యుల సమస్య గాంధీ దృష్టికి రావడంతో యిదొక చిన్న యాత్రాస్థలమైంది. ప్రభుత్వం అప్పట్లో 300 రూపాయల గ్రాంటు చెక్కు యీవంలో పంపించి. పక్కనున్న కుమగల్లు గ్రామంలో 30 యెకరాల భూమి కూడా కేటాయించడానికి సిద్ధంగా వుండింది. ఈ రెంటిని కూడా కాంగ్రెస్ ఆజ్ఞను శిరసావహించి తృణీకరించడం జరిగింది. తర్వాత గాంధీ సిఫార్సుతో తిలక్ స్వరాజ్య నిధి నుండి 6,000 రూపాయల విరాళం యివ్వడం గమనించతగింది (చూడు: 'భారతి' 1925 యేప్రిల్, వింజమూరి పార్థసారధి అయ్యంగార్ వ్యాసం: మాదల వీరభద్రరావు, 'గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం: 1920-30 ఉజ్జ్వల ఘట్టాలు,' బెంగుళూరు, 1974, పేజీలు 159-160).

18. 'దేశమంటే మట్టికాదోయ్, మనుషులోయ్, అని కవిత్వీకరించిన నినాదంగా 1910-11 లో గురజాడ 'దేశభక్తి' గీతంలో అనపల్పి వచ్చిందంటే దాని వెనుక బోలెడంత కథ లేకపోలేదు. బెంగాల్‌నుంచి వచ్చిన బిపిన్ చంద్రపాల్ ఆంధ్రపై మెరుపువాడి జరిపి, తన 'వందేమాతరోపన్యాసాల'తో తెలుగు యువతను వుర్రూతలూగించి, వారిలో వొక నూత్న రాజకీయ చైతన్యాన్నీ ప్రతిఘటనోత్సాహాన్నీ రగుల్కొల్పిపోయినా, ఆ వుపన్యాస ప్రవాహంలో అంతర్లీనంగా చేరిన వొక మైకపు బురదను కూడా తెలుగువారి మేధలకు పట్టించాడు. గంగాతీరం నుంచి కావేరి దాకా హిమాలయాలనుంచి రామేశ్వరందాకా యీ సమస్త దేశం వొక 'పుణ్యభూమి' అనీ 'పవిత్రపృథ్వి

మొక్కల్లో, కాకుంటే చరిత్రగుత్తల్లో పెదజల్లుకోకుండా మనుషుల మధ్యలో నివా స్నం చేసుకొని వాళ్లు చిక్కుకున్న సుడిగుండాల్లో నిమజ్జనం చేసుకొని తనను తాను అర్పించుకొనే క్రియానిరతికి తనకు చేతనైన పరిధిలో వొక వుదాహరణగా వుంటూ వచ్చాడు. జనజీవితంతో ముఖ్యంగా శ్రామికజన జీవితంతో ఆ మాత్రమైనా తాదాత్మ్యం చెందినవాడు గాకపోతే మాలపల్లి నవల సృష్టి సాధ్యమై వుండేదిగాదు. తెలుగు నేలను దద్దరిల్లజేసిన ఆనాటి అనేక రకాల రాజకీయ సాంఘిక వుద్యమాల్లో నుంచి నేరుగా పూడిపడ్డ నవల మాలపల్లి.

దేశ రాజకీయ వుద్యమాల్లో స్పష్టమైన ఆర్థిక లక్ష్యాలుకూడా చోటుచేసుకొంటున్న రోజులవి. కమ్యూనిస్టుపార్టీ అనేది తెలుగునాట అవతరించకముందే మార్క్సిస్టు భావ ప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది. రష్యాలో అక్టోబర్ విప్లవం మహావిజయం పొంది కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడ్డంతో మనదేశంలోకూడా వామపక్ష సిద్ధాంతాలు, వర్గ పోరాట భావబీజాలు స్లోగా పాటమరిస్తున్న రోజులవి.[19]

దీనికి సమాంతరంగా ఆంధ్రలో (అప్పటి మద్రాసు సంయుక్తరాష్ట్రంలో) బ్రాహ్మణేతరోద్యమం పేరుతో కారాజువ్వలా దూసుకొచ్చి, మాంటేగు-ఛెమ్స్‌ఫర్డ్ రాజకీయ సంస్కరణల పేర జరిగిన యెన్నికల్లో జస్టిస్ పార్టీ వేషంలో భూస్వామ్య ప్రాతినిధ్య ప్రభుత్వం గద్దెమీదకు వచ్చింది. విదేశీపాలకులతో భూస్థితిపరులకు రాజకీయ లంకె కుదరడంతో బ్రిటీష్ ప్రభుత్వ వర్గాలతోటి జస్టిస్ పార్టీ వ్యక్తి

---

జనయిత్రి' అనే గుడ్డిభావావేశాన్ని కల్గించిపోయాడు. రాజకీయం ముందుకొచ్చి సంఘ సంస్కరణ విస్మరించబడింది. భావుకుడైన గురజాడ యీ నినాదం వెనుక అసంకల్పితంగానైనా వచ్చి చేరిన ప్రమాదాన్ని సకాలంలోనే పసిగట్టాడు గనుకనే నిజమైన దేశభక్తికొక విశాల నిర్వచనాన్నిస్తూ క్రియాపరమైన గమ్యోపదేశం చేస్తూ ఆ గేయం వ్రాయవల్సి వచ్చింది.

19. మన దేశంలో సాగుతున్న బోల్షివిక్ ప్రచారాలపై నిఘావేసి ప్రభుత్వానికెప్పటి కప్పుడు చేరవేస్తూ వుండేందుకుగాను మద్రాసుప్రభుత్వం 1920 లోనే చర్యలు తీసుకుంది. అబ్దుల్ హసన్ అనే సి ఐ.డి. సబిన్‌స్పెక్టర్ బెంగుళూరు ప్రాంతంలో ప్రత్యేకంగా పనిచేసేందుకు 1920 మే నెల 6 తేది నుంచి కొన్ని నెల్లపాటు మద్రాసు ప్రభుత్వం డెప్యుటేషన్‌లో వుంచిందంటే అప్పటి బ్రిటీష్‌ప్రభుత్వానికి బోల్షివిక్ ప్రచారమంటే యెంతగా కంపరం పుట్టించిందో యీ వొక్క సాదృశ్యం చాలు [చూడు: మద్రాసు, తమిళనాడు ఆర్కివ్స్‌లోని 16-10-1920 నాటి హోమ్ (పబ్లిక్) డిపార్ట్‌మెంట్ జి. వో. నెం. 729].

చారం బాహాటంగా ప్రారంభమైన రోజులవి. మత నియోజకవర్గ ప్రాతిపదికతో భారత ముస్లిమ్‌లను జాతీయ వాదపు దారిలోనుంచి పక్కకు తప్పించ బూనిన రాజకీయ కౌటిల్యమే కుల ప్రాతినిధ్యమనే విషకన్యతో బ్రాహ్మణేతరులను జాతీయోద్యమం నుండి చీలగొట్ట జూచిన బ్రిటీష్‌వారి ద్రోహ తలంపును వెల్లడిచేసిన రోజులవి. పీడితజనం విద్యకోసం, సాంఘిక న్యాయంకోసం, కనీస ప్రతిపత్తికోసం సాగించే యాత్రలో మొత్తం బ్రాహ్మణేతరులందర్నీ కూడగట్టుకొని రావాలనుకున్న జస్టిస్ పార్టీ, రాజ్యాధికారంలో నాలుగు యెంగిలిమెతుకులు చేజిక్కించుకముందే దాని అసలురూపం బహిర్గతమై దేశీయ భూస్వామ్యవర్గాలు సెరపే ఘాతుకంగా పరిణమించిన దశ అది. జస్టిస్ పార్టీయులు బ్రిటీష్‌వారి పుంపుడు సానిపిల్లలైనారో లేదో గానీ పెంపుడు పిల్లలైపోయిన రోజులవి.[20] జస్టిస్‌పార్టీకి గుంటూర్లో తొలినుంచీ మంచి పట్టే దొరికింది. దీనికి రియాక్షన్‌గా మాలపల్లి పుద్భవించిందా అని కూడా చూడాల్సివుంది.

భారత రాజకీయాకాశంలో గాంధీజీ నక్షత్రప్రభలు వెలుగొందడం ప్రారంభమైన రోజులవి. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయనిరాకరణ, సాత్విక నిరోధం వొక పుద్యమావేశంగా తెలుగు భావుకులను ముంచెత్తుతున్న సన్నివేశమది. ఆంధ్రలో యింకో యేడాదిలోపున అల్లూరి సీతారామరాజు అనే అనామకుడు (?) లేవనెత్తబోతున్న సాయుధవిప్లవం సంసిద్ధమవుతున్న దశావిశేషమది. తెలుగునాట వెల్లివిరిసిన యీ ప్రజాసంరంభమే పున్నవ నవలకు విశాల నేపథ్యం. సంకీర్ణమైన యీ నానా రకాల మార్పుల సుడుల్లోబడి అస్తవ్యస్తమైన అస్పష్టమైన దృక్పథాల అలజడిలో చిక్కుకున్న తెలుగుప్రజ స్థితిగతులను సృజనాత్మకమైన ప్రక్రియలో చిత్రీకరించి వొక గమ్యసూచన చేయాలనే తపన మాలపల్లిలో గోచరమవుతుంది.

వొక్క యేడాదిలో స్వరాజ్యాన్ని సాధించి తీర్తాం అని గాంధీజీ నినాదమివ్వడంతో ఆ స్వరాజ్యం యెట్లుండాలి అని స్వప్నించడం యెక్కువైంది పున్నవకు.[21] స్వరాజ్యం సురాజ్యంగా కూడా వుండాలనుకున్నాడు. వొక్క స్వరాజ్యాన్నే గాక సమతారాజ్యాన్ని గూర్చికూడా కలలు గన్నాడు పున్నవ. రాజ్యా

20. కె. వి. రమణారెడ్డి, 'కవికోకిల: జీవితమూ సాహిత్యమూ,' నెల్లూరు, 1965, పేజీలు 119-120.

21. పున్నవ యిట్లాంటి స్వప్నంలో పున్నాడనేదానికి ఆధారం లేకపోలేదు. పల్నాడులో ఆరెద్దయి ఆరునెల్లు శిక్షలుపడ్డ ముగ్గురు మహమ్మదీయుల "కుటుంబములు బీదవి. మాచర్లవారిని చందాలు వేసుకొని వారి కుటుంబములను పోషింపవలయునని తెలియజేసితిని. వారట్లు చేయుదు

ధికారం చేతులు మారడమేనా స్వరాజ్యం? కాకూడదు, కారాదు అనుకొన్నాడు పున్నవ. దేశంలో వొకే వొక్క అఖండమైన జాతినేగాదు పున్నవ చూచింది. జాతి పొరల్లో వర్గాల్ని చూశాడు. వర్గాలమధ్య విరుద్ధస్వభావాలను ఆకళించుకొన్నాడు. నిరంతరం సాగే వర్గపోరాటాల్ని చూశాడు, వొక జాతిని మరొక జాతి శాసించడాన్ని దోచుకోవడాన్ని అధర్మం అని అక్రమం అని యెట్లంటున్నామో, వొక జాతిలోని వొక వర్గాన్ని యింకో వర్గం నిలువుదోపిడీ చేయడం అణగదొక్కడం అంతకంటే యెక్కువ అధర్మం యెక్కువ అక్రమంకాదా? యిటువంటి అక్రమానికి ఆసరా యిచ్చే రాజ్యం- అది స్వరాజ్యం కానీ, పరరాజ్యంకానీ- వున్నంత కాలం అశాంతి వుండితీరుతుంది. అశాంతి వున్నంతవరకు దానికి ప్రతి చర్యగా ప్రజాందోళన వుంటుంది. ఆందోళన లేకపోతే యీ కర్మభూమిలో అంతా సవ్యంగా వున్నట్లేనా? వొట్టి అశాంతి రాహిత్యమే శాంతి అవుతుందా? వొక జాతిలో అన్నానికి వస్త్రానికీ గతిలేని దరిద్రులధికులై కొందరుమాత్రం అంతులేని సంపదల్లో సౌఖ్యాల్లో వోలలాడేవారు అయితే యెట్లా? యీ స్థితి వున్నంతవరకు శాంతి యెటా సాధ్యం? స్వాతంత్ర్య సమత్వ సౌభాగ్యాలతో కూడిన సమగ్ర జీవనంతో కళకళలాడుతుండడమే గదా శాంతి! దీనికి ప్రతీకగా వుండాలి ఆ వచ్చే స్వరాజ్యం. యిదీ పున్నవ కల!

గాంధీయిజాన్నీ బోల్షివిజాన్నీ సమ్మిశ్రం చేసి సమన్వయం వంటిదేదో చూపాలనుకొన్నాడు. ఆ చూపడం యెట్లా? బోల్షివిజాన్ని పూర్తి విజాతీయమైన సిద్ధాంతంగానే సంభావించుకోవాలా? విజాతీయమే అయితే దానికి అంట్లుగట్టి సజాతీయం చేసుకోడానికి లేదా? యీ రెండు భిన్నమార్గాలకు ధోరణులకు ప్రాతినిధ్య

---

మని చెప్పిరి. ఒక్కొక్క కుటుంబమునకు నెలకు 10 రూపాయిల చొప్పున రు. 30 లు వాళ్ల జయిలులో వున్నంతకాలము పంపవలయును. వీరు ముగ్గురు బయటికిరానిది మేమిరువురము బయటకు వచ్చుట కంగీకరించము. వీరి కుటుంబములను ఆదరింపనిచో పల్నాటిలో ఉద్యమమునకు బలము తక్కువగును. వెంటనే యేర్పాటు జరుపవలయును ...'' అని తన నివేదికలో వ్రాసిన పున్నవ వారిని గురించి ఇట్లా ముగించాడు: "ముద్దాయిలను ఆ సాయంత్రము ఖయిదులో చూచితిని ధైర్యముగానున్నారు. స్వరాజ్యము మూడు నెలలలో వచ్చును. మనమందరము విడిపింపబడుదుమని చెప్పితిని''—అని కూడా అన్నట్లు వ్రాశాడు. యీ మాటలు కేవలం వారికి ధైర్యవచనాలుగా చెప్పినవిగా తోచడంలేదు. మూడు నెలల్లో గాకపోయినా ఆరునెలల్లో అయినా స్వరాజ్యం వచ్చి తీరుతుందనే నమ్మకంలో వున్నట్లు, అమాయికంగా కలలుగంటున్నట్లు అర్థం చేసుకోవాలి. ఈ నివేదికలోని వాక్యాలకు చూడు: మాదల వీరభద్రరావు గ్రంథం 'గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం: 1920-30 ఉజ్వల ఘట్టాలు' (బెంగుళూరు, 1974), పేజీలు 64-65.

సన్నిభమైన ప్రాణపూర్ణమైన రెండు సజీవపాత్రలను సోదరులుగా ప్రవేశపెట్టి నవ లీకరిస్తే యెట్లుంటుంది? యీ రెండు పాత్రల్లో యేది మంచిదో యేది చెడ్డదో బేరీజు వేసినట్లుండకూడదు. అట్లా బేరీజువేసి చూపడానికి తనెవరు? పాఠకుల ఆలోచనకే వదలడం బాగుంటుంది. కథాచిత్రణ అట్లా కొనసాగాలి. తన నవలలో స్వరాజ్య ధర్మం సరసన సమతా ధర్మం సమవుజ్జీగా వుండి నడవాలి. ఆనాటికి మనదేశంలో వున్నదెల్లా వొక్క స్వరాజ్య కర్తరే. సమతా రాజ్య సామ్యవాద ధర్మ ప్రస్తావన అను యీ మాత్రమైనా సృజనాత్మకంగా తీసుకురావడం అనేది ఆనాటికి వున్నవ వేసిన గొప్ప ముందడుగు.

యీ దృక్పథ సమన్వయంతో వొక పెద్ద నవల వ్రాయాలని మనసులో మథనపడుతున్నా వుద్యమాల్లో ప్రత్యక్ష కార్యనిరతిలో వ్యగ్రుడైవున్న వున్నవకు ఆ వ్రాసే తీరిక, కుదిరక యేది?

సరిగా యీ సమయంలో వున్నవ పల్నాడులో అరెస్టయ్యాడు. జైలుకు పోయాడు. తన కలను నిజపర్చుకోడానికి అవకాశం దొరికింది. తన సాహితీ తపన ఫలించే తరుణం ఆసన్నమైంది.

వున్నవ యెందుకు అరెస్టయ్యాడు?

# మాలపల్లి పూర్వరంగం

1921 నాటికి 'భారతదేశం తగలబడిపోతున్న యిల్లు' మాదిరిగా వున్నదని రవీంద్రనాథటాగోర్‌తో వచ్చిన వివాద సందర్భంగా గాంధీజీ "యంగిండియా" పత్రికలో వ్రాసున్నాడు.[22] నిజానికి అప్పటి భారత దేశస్థితి అక్షరాలా తగలబడి పోతున్న యిల్లే. మామూలు థర్మామీటర్లు కొలవగలిగే స్థాయిని దాటిపోయింది దేశ రాజకీయోష్ణోగ్రత.

---

22. 1921 అక్టోబర్ 13 సంచికలో The Great Sentinel అనే గొప్ప వ్యాసంలో గాంధీజీ యిట్లా వ్రాశారు: "It is my conviction that India is a house on fire because its manhood is being daily scorched, it is dying of hunger because it has no work to buy food with...I have found it impossible to sooth suffering patients with a song from Kabir. The hungry millions ask for one poem- invigorating food. They cannot be given it. They must earn it. And they can earn only by the sweat of their brow .." కె. వి. రమణారెడ్డి తన 'కవికోకిల జీవితం....' గ్రంథంలో కవికోకిల "కాంగ్రెస్‌వాలా' నాటకాన్ని గూర్చి వ్రాసిన అధ్యాయం (పేజీలు 286-93) లో యీ రాజకీయ వివాద నేపథ్యాన్ని గురించి విపులంగా చర్చించారు. హిరేన్‌ముఖర్జీ వ్రాసిన 'Gandhiji, a study,' Gurdial Mallik వ్రాసిన 'Gandhiji and Tagore' అనే గ్రంథాల ఆధారంగా యీ వివాదానికి గల వివిధ ముఖాలను చక్కగా చర్చించి వున్నారు.

రోమ్ నగరం తగలబడిపోతుంటే నీరో చక్రవర్తి ఫిడేల్ వాయించుకొంటూ వున్నాడట! చాలామంది తెలుగుదేశపు భావకవుల్లాగా వున్నవ లక్ష్మీనారాయణ ఆత్మాశ్రయ ఆత్మానంద కవిత్వ రచనలకు నగిషీలు చెక్కుకుంటూ వుండిపోలేదు. భారతదేశపు యిల్లు తగలబడిపోతుండగా ఆయనొక నవల ప్రాకాడంటే తన జాతి జనుల్లో వొక నూతనోత్తేజాన్ని సాక్షాత్కరింపజేసి. బ్రిటీష్ ప్రభుత్వంపైకి యెగసే ప్రజాధిక్కారాన్ని సాహితీకరించి మాలపల్లి నవలారూపంలో తన రచన వొక 'ఫైరింజన్' లాగా పనిచేయాలనే గుర్తింపుతో మరీ చేశాడు. తాను యింతకాలం జాతినుండి గ్రహిస్తూ వచ్చిన మనస్థితిని యీ నవలలో జ్వరోద్రిక్తంగా ప్రజ్వరిల్ల జేసి తిరిగి జాతికే సమర్పించుకోవాలనే గురుతరమైన బాధ్యతతో యీ రచన్ను రూపొందించాడు.

జాతీయోద్యమ పురోగతిలో జనసామాన్యంలో కల్గిన నానావిధమైన కదలి కలకు భావవికారాలకు ప్రభావితుడై జాతీయాభినివేశంతో రచించిన నవల మాలపల్లి. యదార్థచిత్రణలతో బాటు సాంఘిక రాజకీయ చరిత్ర పుటల్లోని సత్యనిష్ఠురతనూ జీవితోష్ణోగ్రతనూ సంతరించుకొన్న రచన యిది. కాబట్టే దీన్ని సరిగా అర్థం చేసుకోడానికి సమకాలిక భారతదేశ స్థితిగతులను స్వాచిత్క్రంగానైనా మనసుకు తెచ్చుకోవలసి వుంటుంది. ఆనాటి పాలకవర్గ పాలసీలు, పాలిత జన పోరాటాల్లో కానవచ్చే సామాజిక చైతన్య పరిణామాలూ, తదితర వ్యపరితల అంశాలైన రాజకీయాలూ నైతికవిలువలూ మత తత్వవిషయాలూ వీటితో సంచనింపు జేసుకోవలసి వుంటుంది.

మొదటి ప్రపంచయుద్ధం ముగిసింది. దేశంలో పెనుమార్పులనే కల్గించింది. యుద్ధావసరాల మూలంగా భారతీయ బూర్జువావర్గాల్లోని పై స్థాయివారు లాభాలు బాగా పుంజుకొన్నారు. యుద్ధకాలపు యెగుమతులద్వారా దేశీయ పెట్టుబడిదారులు యిబ్బడి లాభాలనే పుంజుకొన్నారు. వర్తక వాణిజ్య పరిశ్రమారంగాల్లో సామ్రాజ్యవాదుల మోచేతి కిందినీళ్లు తాగే ధనికతెగ బాగా బలిసిపోయింది. ధాన్యం ధరలు పెరగడంవల్ల, వాణిజ్య పంటల విస్తరణవల్ల బడా రైతులు లాభపడ్డంతగా సన్నకారురైతులు, కూలీలు బాగుపడ్లేదు. ప్రత్యేకించి గుంటూరుజిల్లాలో వాణిజ్య పంటల సేద్యంవల్ల సామాన్యరైతులు యేటేటా అధిక ధరలకు తిండిగింజలు, కడపు గొడ్లమేత కూడా కొనుక్కోవలసిన అవస్థ యేర్పడింది. మొత్తమ్మీద వ్యవసాయం విస్తరిల్లినా వ్యవసాయదారుడు బలపడలేదు. రైతుకూలీల పరిస్థితి సరేసరి నానాటికి క్షీణించింది.

భారతప్రజల రాజకీయ చైతన్యం లాల్-బాల్-పాల్ ప్రభృతుల చేతుల్లో పడి కాళీపూజ గణేశ్ పూజోత్సవాలతో పూరేగింపులతో వొక హైందవ పునరుద్ధరణోద్యమంగా తయారైనదల్లా క్రమంగా జాతీయోద్యమ స్వభావాన్ని సంతరించుకొంటూ వచ్చింది. బస్తీల్లోని రాజకీయోత్సాహానికి గ్రామసీమల్లోనివారు అంట్లు గట్టుకొని చిన్న-చిన్న గ్రామాల్లోకి కూడా నూత్న సంరంభాన్ని రాబిల్చుకొన్నారు. కాలం పుట్రా వుండి పట్టణాల్లో తిరగనేర్చి యింగ్లీషు చదువు సంధ్యలు వంటపట్టించుకొన్న రైతుబిడ్డల మాట చెల్లుబడికాజొచ్చింది.

యుద్ధం తర్వాత బ్రిటన్ టర్కీని చీలదీసి ఖిలాఫత్‌ను విచ్ఛిన్నం చేయబూనినందుకు భారతీయ ముస్లిమ్‌లలో బ్రిటన్ వ్యతిరేకతతో బాటు ఆగ్రహంకూడా ప్రబలింది. యీ నూతన పరిణామాన్ని ఆసరాగా తీసుకొని గాంధీజీ ముస్లిమ్ మితవాదులను సమీకరించుకోగలిగాడు. వొకవిధంగా కాంగ్రెస్-ముస్లిమ్ మిలాఖత్‌ను గాంధీజీ ఖిలాఫత్ వుద్యమం మూలంగా సాధించగలిగాడు.

దివ్యజ్ఞాన సమాజపు పూడల సాయంతో అనిబిసెంటమ్మ 'హోమ్‌రూల్' వుద్యమాన్ని ప్రవేశపెట్టింది. నూతన రాజకీయ కదనోత్సాహంతో ముందుకు దూసుకొచ్చింది. జాతీయ మహాసభల్లో అంతర్గతంగానూ వాటికి బాహిరంగానూ మండల సభలూ, కుల వృత్తిసభలూ, ఆస్తికసభలూ, సంఘసంస్కరణ సభలూ జరుగుతూ తుంటలు తుంటలుగా వొక మహా జాగృతి సమాజంలోని వివిధ పొరల్లో అసంఘటితమై ప్రసవింపజొచ్చింది.

యిక దక్షిణాదిలో జస్టిస్‌పార్టీ లేవనెత్తిన సాంఘికన్యాయ నినాద మహిమవల్ల నైతేనేమి, రాజ్యాధికారంవల్ల జతకూడిన హోదావల్లనైతే నేమి, యే వర్గం యెప్పటికి ప్రబలంగా వుంటే అప్పటికావర్గాన్ని వెంటాడి ఆశ్రయించే అస్వాధీనత వల్లనైతేనేమి, గ్రామాల్లోని సాదా రైతులు కర్షకప్రజలు భూఖామందుల, రాజాల, పిల్లరాజాల 'ధృతరాష్ట్ర కౌగిలి'లోకి చేరారు. కౌగిలి భ్రమలు సడలేసరికి చాలా గ్రంథం గడిచిపోయింది.

చావు తప్పి కన్ను లొట్టబోయినట్లుగా బ్రిటన్ యుద్ధంలో నుంచి బయటపడ్డా సామ్రాజ్యవాదశక్తిగా క్షైణ్యతను పొందింది. లోగడ స్వదేశీ వుద్యమం ద్వారా దేశీయ పెట్టుబడిదారీ వర్గం బ్రిటన్ సామ్రాజ్యవాదాన్ని అదరగొట్టి, బెదరగొట్టి రాబట్టుకొన్న అదనపు ఆర్థిక వసతులతోబాటు యిప్పుడు కొత్త ప్రయోజనా-

అను పోరాటసరళిలో సాధించుకోడానికి పన్నాగం పన్నింది.[23] యుద్ధానంతర ఆర్థిక మాంద్యం మూలంగా అధిక పన్నులకు గురైన కర్షకులూ, ధరలు పెరిగి పనులు తరిగిన కార్మికులూ, వుద్యోగావకాశాలు సన్నగిలిన విద్యావంతులూ పోరాట మార్గంలోకి ప్రవేశించగలిగారు. వీటన్నిటికీ జతగా రైతాంగపోరాటాలూ వాటికి మేధోవర్గపు నాయకత్వాలూ లభించజొచ్చాయి. చాంపరాన్‌లో నీలిమందు రైతుల సత్యాగ్రహమూ, ఖెడా రైతుల పోరాటమూ, అహమ్మదాబాదు మిల్లు కార్మికుల సమ్మె- వీటన్నిటిలో గాంధీ నిర్వహించిన నాయకత్వం తత్కాలానికి మంత్రశక్తిలానే పని జేసింది.

యుద్ధకాలాన్ని ఆసరాగా జేసుకొని 'డిఫెన్స్ ఆఫ్ యిండియా' చట్టాన్ని ప్రవేశబెట్టి విప్లవచర్యలను ప్రజాందోళనలను అరికట్టేందుకు దేశంలో యమర్జన్సీ శాసనాలను ప్రవేశపెట్టిన బ్రిటీష్ ప్రభుత్వం యుద్ధం ముగిసిన తర్వాతకూడా విచారణల పేరుతో వుద్యమకారులను కఠిన నిర్బంధాలకు లోనుచేసే తలంపుతో 1919 మార్చిలో రౌలట్ చట్టాన్ని ప్రవేశపెట్టింది. దేశం అల్లకల్లోలమైంది. జన రక్తంలో కొత్తరకపు కిదనోత్సాహ కణాలు యింజెక్ట్ చేసినట్లయింది. రౌలట్ బిల్లు తర్వాత జలియన్‌వాలాబాగ్‌లో జరిగిన ఘోరమైన కాల్పుల హింసాకాండ- వీటికి వ్యతిరేకంగా యెక్కడబట్టినా హర్తాళ్లు, సత్యాగ్రహ శపథాలు, వుపన్యాసాలు, ప్రార్థనలు జరుగుతూ వాతావరణం వుద్విగ్నమైవుంది.

1919-20లోనే విజయవాడకు గాంధీజీ వొకటికి రెండుసార్లు వచ్చివెళ్లాడు. హరిజన సమస్య, అస్పృశ్యతా నివారణ అనేది వొక నూతన వుద్యమంగా వొక 'మతధర్మం'గా కాంగ్రెస్ కార్యక్రమంలో భాగం కాజొచ్చింది. అదొక లాంఛన పూర్వకమైన కార్యక్రమమైందేగానీ, ఆ సమస్యతో ముడిబడిన గాఢమైన ఆర్థిక వ్యవహారాలు గాంధీ శిష్యకోటిలో చాలామంది మనసుల కెక్కనేలేదు. హరిజనుల దేవాలయ ప్రవేశాలు, వారితో సహ పంక్తిభోజనాలు-యిటువంటి పైపై వుత్తుత్తి చర్యలతో తృప్తిపడుతూ వచ్చారేగానీ, దీని వర్గస్వభావం గూర్చిన అవగాహన గానీ యిదొక ఆర్థిక సమస్య అనే ఆలోచనలుగాని అప్పట్లోనూ యిప్పట్లోనూ అటు కాంగ్రెస్‌వాళ్ళలోనూ యిటు అంబేత్కరీయుల్లోనూ కానరావడంలేదు. 1917లో

---

23. కె. వి. రమణారెడ్డి, 'భారత స్వాతంత్ర్య పోరాటాలు' (రాజమండ్రి, 1975), పేజీలు 78, 80. భారత స్వాతంత్ర్యపోరాటాల వెనకగల ఆర్థిక లక్ష్యాలను తెలుగులో వివరించే ప్రయత్నంతో సాగిన రచన యిది.

బెజవాడలో ఆదిఆంధ్ర (హరిజన) మహాసభలు జరిగాయి-హైద్రాబాదు ప్రసిద్ధ 'ఆదిహిందూ' నాయకుడు భాగ్యరెడ్డివర్మ అధ్యక్షతన. యీ సభల ప్రతిధ్వనులు మాత్రమేకాదు మాలపల్లెలో కానవచ్చేది. యీ సమస్యతో ముడిబడివున్న వర్గ దృక్పథాన్ని 'ముడిరూపం'లో నైనా తన నవలా చట్రంలో వున్నవ చిత్రించిన తీరు కానవస్తుంది.[24]

సహాయనిరాకరణ-సత్యాగ్రహ 'మంత్రోచ్చాటన' జరిగిన 1920 సెప్టెంబర్ కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ సభలకు వున్నవ వెళ్లాడో లేదో తెలియదు.[25]

మాంటేగు-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణల కింద మొదటిసారి శాసనమండలికి ప్రత్యక్ష-సాధారణ యెన్నికలు జరిగాయి. యీ యెన్నికల తతంగం వొక పచ్చి మోసమనీ, బ్రిటీష్‌వారు పన్నిన వొక మాయాజాలమనీ నినాదం లేవదీసి యీ యెన్నికల కర్మకాండను గాంధీజీ నాయకత్వంలో కాంగ్రెస్‌వాళ్లు బహిష్కరించారు; తర్వాత యాభైయేళ్ళకు యిదే కాంగ్రెస్‌వాళ్ళ ఆధ్వర్యంలో జరిగిన యెన్నికలను నక్సలైట్లు, విరసంవాళ్లు దాదాపు యిటువంటి ధోరణిలోనే 'బాయ్‌కాట్' చేసినట్లు! యింకేం,

---

24. హరిజన సమస్య గూర్చి సమకాలికాభిప్రాయాన్ని దర్శించగోరువారు 1920 ఫిబ్రవరి 7 కృష్ణా పత్రికలో అ. నారాయణరావు వ్రాసిన 'సంఘదౌర్జన్యము' అన్న వ్యాసం చదవవచ్చు. సమకాలీన ఫ్యూడల్ సమాజంలో ముఖ్యంగా కృష్ణజిల్లా పల్లెల్లో హరిజనులపట్ల గ్రామీణ భూస్వాములు దౌర్జన్యాలను చర్చిస్తూ, యీ సమస్యకు తన మనసును అర్పించి పనిచేస్తున్న గూడూరు రామచంద్రరావు వంటివారిని 'మాలబ్రాహ్మలు' అనే బిరుదులు తగిల్చి వారిని వెలికి గురిచేస్తున్నారని వ్రాస్తూ "ఒకవైపు బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుల అధికారములను సంపాదింప ప్రయత్నించుచుండ, మరియొకవైపున నట్టి అధికారములనే సంపాదింపజూచు పంచముల నణగద్రొక్క ప్రయత్నించుచున్న విషయము మరువదగినది కాదు. ముందు రానున్న స్పర్థ బ్రాహ్మణ-బ్రాహ్మణేతరుల మధ్యగాదు. పంచముల-పంచమేతరుల మధ్యనని గ్రహింపవలయును. ఇది యీ వరకే ప్రారంభమైనది." అని అన్నాడు. ఇంకో పదేళ్ల అనంతరం ముద్దుకృష్ణ పత్రిక 'జ్వాల' మొదటి సంచిక (1933?) లో 'పంచములు-దేవాలయములు' అనే వ్యాసంలో గాంధీజీ హరిజన దేవాలయ ప్రవేశోద్యమాన్ని గూర్చి వ్రాస్తూ "....అంతకన్న వాళ్లకు చేయవలసిన ఉపకారాలు వున్నవి. వాళ్ళ మాలిన్యం, ఆకలి తగ్గించాలి. చదువు చెప్పించాలి....ఈ విషయంలో పైకి చప్పుడు కాకుండా పిఠాపురం మహారాజా చేస్తూన్న వుపకారం చాలామంచిది...." అన్నాడు.

25. కలకత్తా సభలకు వెళ్తూ గాంధీజీ, షౌకతాలీ బెజవాడలో ఆగి సభజరిపినప్పుడు — పట్టాభి, కొండా, గొల్లపూడి ప్రభృతులు రాకపోయినా వున్నవ హాజరైనట్లు అయ్యదేవర కాళేశ్వరరావు 'నా జీవితకథ: నవ్యాంధ్రము' (విజయవాడ, 1959) పేజీ 291 చెప్తున్నది.

కాంగ్రెస్ వారి ఆ రాజకీయ సన్యాసం మూలంగా జస్టిస్ పార్టీ వారు దాదాపు యేక పక్షంగా 'గెల్చి' కూర్చొన్నారు. యెక్కడికక్కడ స్థానిక భూస్వామ్యవర్గాల వారు 'పోటీ' చేసి దండిగానే స్థానాలు గెల్చుకొన్నారు.[26] ఫ్యూడల్ ప్రభువులకు అధికారహోదా లభించి స్థానిక పెత్తందార్లుగా ప్రాచుర్యంలోకి వచ్చారు. 'ముఖ్యమంత్రి'గా కడలూరుకు చెందిన తెలుగుకాపు యె. సుబ్బరాయులు రెడ్డియార్, 'మంత్రులు'గా పానగల్లురాజా పి. రామారాయణింగార్, యేలూరీయుడు కె. వి. రెడ్డినాయుడు పదవీస్వీకారాలు చేశారు. జస్టిస్‌పార్టీ నాయకుల సుడిగాలి పర్యటనలు సన్మాన సంరంభాలు జరిగాయి. గ్రామీణ రైతాంగవర్గాలు వీరి చుట్టూ సమీకరణం కావడం వున్నవ గ్రహించకపోలేదు.[27]

కలకత్తా కాంగ్రెస్ సమావేశం తర్వాత కొండా వెంకటప్పయ్య తన శాసన సభ్యత్వాన్ని త్యజించడానికి పెట్టిన షరతుల మూలంగా సహాయ నిరాకరణోద్యమంలో తీవ్రంగా పనిచేయడానికి కొందరు గుంటూరు లాయర్లతో కలిసి వున్నవ తన వకీలు వృత్తిని విసర్జించాడు.[28]

---

26. గుంటూరు జిల్లాలోని 3 శాసనమండలి స్థానాలకు 'గెల్చిన' సభ్యులు: జాగర్లమూడి కుప్పుస్వామి, పి (పైడిపాటి). సి. యెతిరాజులు నాయుడు, వంగులూరు వెంకటసుబ్బారావు. కృష్ణ జిల్లాకు కె. వి. రెడ్డి నాయుడు, కోవెలమూడి గోపాలకృష్ణయ్య, టి. బాలాజీరావు నాయుడు యెన్నికయ్యారు. యెన్నికలు జరిగిన 98 స్థానాల్లో 63 మంది జస్టిస్ పార్టీయులు గెల్చినట్లు E. F. Irschick వ్రాసిన గ్రంథం 'Politics and Social Conflict in South India' (Bombay, 1969) పేజీ 178 లో పేర్కొన్నది. ప్రభుత్వ నామినేటెడ్ సభ్యులతో కలుపుకొని మొత్తం 127 మంది సభ్యుల్లో జస్టిస్‌పార్టీకి 81 మంది పోగయినట్లు ఆ గ్రంథంలో లెక్కలు తేల్చడం జరిగింది. అయితే ఆంధ్రపత్రిక వుగాదిసంచిక (1921) యిచ్చిన లెక్కల ప్రకారం "చెన్న రాష్ట్రమున కేర్పడిన 125 సభ్యులందును 102 సభ్యులు బ్రాహ్మణేతరులేర్పడిరి." యీ రెండు లెక్కల్లో యేది కరెక్టో తేల్చడానికి వొక చిరు పరిశోధన అవసరమయ్యేలావుంది.

27. యిటువంటి సమీకరణనే సి.ఆర్.రెడ్డి 1922 లో యిట్లా నిశితంగా వర్ణించాడు: "but a universal rush to Ministerial ante-chambers is hardly a sign of democratic self-respect. Now that autocratic terror is over, people should give rest to their knees and not crawl so very much." (చూడు: C. J. Baker, 'The Politics of South India, New Delhi, 1976, P. 41).

28. అయ్యదేవర కాళేశ్వరావు 'నా జీవితకథ....,' పేజీ 295; కొండా వెంకటప్పయ్య.... 'స్వీయచరిత్ర,' పేజీలు 224-25.

కలకత్తా సభలకు మూణ్ణెల్ల తర్వాత నాగపూర్లో జరిగిన కాంగ్రెస్ మహాసభలైన పిమ్మట 1921 మార్చి-యేప్రిల్‌లో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం బెజవాడలో జరిగింది. గాంధీజీతోబాటు దేశస్థాయి నాయకులంతా వచ్చారు. ఆంధ్రప్రజ తండోపతండాలుగా వచ్చింది నాయక దర్శనానికి. మూడు నెలల్లో తిలక్ స్వరాజ్యనిధి పేర కోటిరూపాయలు వసూలు చేసి కాంగ్రెస్‌ను పటిష్టం చేయాలనీ కోటిమంది 'పావలా' సభ్యుల్ని చేర్పించాలనీ, యిరవై లక్షల రాట్నాలైనా నెలకొల్పి ఖద్దర్ వుత్పత్తిని యితోధికం చేయాలనీ కాంగ్రెస్ సంస్థను అన్ని జిల్లాలకు తాలూకాలకు ఫిర్కాలకు వ్యాపింపజేయాలనీ తీర్మానాలు చేశారు.

యీ పిలుపు నందుకున్న రాష్ట్రనాయకులు, కార్యకర్తలు కాంగ్రెస్ ప్రచారానికీ సహాయ నిరాకరణోద్యమ వ్యాప్తికీ నడుంకట్టారు. గుంటూరుజిల్లాలో నాయకులకు కొదవలేదు. ఆ జిల్లావాసుల ఆవేశం కట్టలు తెంచుకొంది. రణరంగంలోకి వురికారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన చీరాల-పేరాల ప్రతిఘటన వుశ్వ్యోత్తున లేచి దేశదృష్టిని ఆకర్షించింది. బెజవాడ సమావేశానంతరం చీరాలను సందర్శించిన గాంధీ కానిన్ని చన్నీళ్లు చల్లిపోయాడు. అది వేరే కథ.

చీరాలకు తోడుగా గుంటూరులోనే పల్నాడు పుల్లరి సత్యాగ్రహం వొకటి తయారైంది.

యీ పల్నాడు పుల్లరి సత్యాగ్రహంలో విస్పష్టమైన ఆర్థికాంశా లున్నాయి. ఫారెస్ట్ వుద్యోగుల దుర్నీతిని యెదుర్కోలేక సామాన్య జనులు అడుగడుగునా యిక్కట్ల పాలవుతూ వచ్చారు. యీ యిబ్బందులను వోర్చుకోలేక ప్రతిఘటనకు దిగారు. యీ వుద్యమ ప్రారంభంలో కాంగ్రెస్‌వాళ్ళకు పెద్దగా ప్రమేయం వున్నట్లు లేదు. వారి పథకం ప్రకారం యిది ప్రారంభమైనట్లూ లేదు. ప్రజలు పోరాట మనస్కులు కావాలేగానీ ఆ పోరాటానికి అవసరమైన మార్గాలు అనువైన పనిముట్లు ఆయుధాలు వాళ్లే యెన్నుకుంటారు. కొన్నికొన్ని సందర్భాల్లో నాయకుల కోసం వారు యెదురుచూడనూ చూడరు. నిజమైన సమస్యల విశ్వరూపం విజృంభించినప్పుడు నాయకులే వాళ్ళల్లోకి ప్రవేశిస్తారు. యీ వుద్యమం అట్లాగే మొదట ప్రారంభమైందనుకోవాలి. కాంగ్రెస్ ప్రచార ముమ్మరం మూలంగా సత్యాగ్రహం, పన్నుల నిరాకరణ, ప్రతిఘటన, సంఘ బహిష్కారం అనే నినాదాలు సహజంగానే పల్లెలోకి ప్రాకిపోయాయి.

పల్నాడు కొండభూమి. అడవిప్రదేశం. అక్కడి ప్రజలకు అడవిలో కాలుపెట్టనిదే రోజు గడవదు. ఆకు కోసుకోవాలనుకొన్నా, కట్టె పుల్లలు ఏరుకోవాలన్నా ఫారెస్టు వుద్యోగుల 'అనుమతి చీటీ' అవసరం. గొడ్లను మేతకు వదలాలన్నా పుల్లరి చెల్లించాలి. లేకుంటే అధికారులొచ్చి పశువుల్ని బందెలకు తోలుకుపోతారు. పోలీసుబందోబస్తుతో వచ్చి తల్లుల్ని వాటి దూడల్ని నిలువునా వేరుచేసి తోలుకుపోతారు. తమ పశువుల్ని విడిపించుకోడానికి నానా యాతన పడవల్సి వస్తుంది. పుల్లరి చెల్లించకపోతే ఆస్తుల్ని జప్తులు చేస్తారు. ఫారెస్టు నౌకర్లకు లంచాలివ్వకపోతే తప్పుడు కేసుల్ని బనాయించి వాయిదాలమీద వాయిదాలకు తిప్పి నానా నిర్బంధాలకు గురిచేస్తారు. అటవీశాఖాధికారులు పెరిగారు. ఫారెస్టు గార్డు, వాచర్ల సంఖ్యను పెంచి ప్రజల బ్రతుకును అష్టదిగ్బంధనం చేయడంతో జనంలో వుద్రేకం పెరిగింది. పుల్లరి చట్టాల పేరుతో ఫారెస్టు అధికారులు సాగించే దుర్భరపీడనను, చట్టాలను చట్టుబండలుగా చేసి వాళ్లు చేసే నిలువుదోపిడీని యెదుర్కోవాలనుకొన్నారు. పుల్లరి చెల్లించేది లేదు పొమ్మన్నారు. తిరుగుబాటు ప్రారంభించారు. రంగా చెంచయ్య అనే వర్తకుని ఆధ్వర్యంలో కట్టుదిట్టంగా నడుచుకొని ఫారెస్టు వుద్యోగులను యితర అధికారులను సాంఘిక బహిష్కరణకు గురిచేశారు.[29] పల్నాడు వొక్క వుదటున వుద్యమాయత్తమైంది. నాయకుల్లో కలకలం బయలుదేరింది.

యీ పరిస్థితుల్లో 1921 జూలైలో రాష్ట్ర కాంగ్రెస్ సంఘం నెల్లూరుజిల్లాలోని వెంకటగిరిలో కటికనేని వారింట్లో సమావేశమైంది. పల్నాడు పుల్లరి సత్యాగ్రహోద్యమం ప్రస్తావనకు రాకతప్పలేదు. సమగ్రంగా విచారణ జరిపి వొక నివేదికను సమర్పించాలని వున్నవను, మాడభూషి వేదాంతనరసింహాచార్యులను నియమించారు.[30]

---

29. కొండా వెంకటప్పయ్య 'స్వీయచరిత్ర'.

30. కొండా వెంకటప్పయ్య 'స్వీయచరిత్ర' (పేజీలు 230-31). అయ్యదేవర కాళేశ్వరావు 'నా జీవితకథ' (పేజీలు 335-36) ను బట్టిచూస్తే రాష్ట్రకాంగ్రెస్ సంఘం యీ విచారణకమిటీని నియమించినట్లున్నది. కాపీ 'గుంటూరుజిల్లా కాంగ్రెసు సంప్రచురణ'గా వున్నవ రచించిన నివేదిక అచ్చయిన ప్రతిని బట్టి జిల్లాసంఘం వారే వున్నవ, మాడభూషులతోబాటు కొమ్మమూరి లక్ష్మీనారాయణ అనే మూడో సభ్యుని కూడా చేర్చి విచారణ కమిటీని యేర్పరచినట్లు ఆ శిథిలముద్రిత ప్రతిని బట్టి మాదల వీరభద్రరావు 'గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం: 1920-30 ఉజ్వలఘట్టాలు' అనే గ్రంథం (బెంగుళూరు, 1974) లో వ్రాశారు.

"14వ తారీఖు (1921 జూలై) సాయంత్రం నెల్లూరులో నాయకులతోను, స్నేహితులతోను మాచెర్ల విషయములలో సాధకబాధకములు చర్చించి, అనుజ్ఞ గైకొని 15వ తేదీ గుంటూరుకు వచ్చి......16వ తేదీ సాయంకాలము బండికి నరసారావుపేట చేరి, తెల్లవారి ద్వాదశి పారాయణము చేసికొని...కారెంపూడికి పయనమయితిమి...గుత్తికొండ చేరునప్పటికి మోటారుకారు చెడిపోయెను. అంతట మేము రెండెద్దుల బండి చేసుకొని జూలకల్లు బోయి, ఆరాత్రి అచ్చటివారితో. మా యుద్యమమును గురించి ముచ్చటించి సాధకబాధకములు తెలుసుకొన ప్రయత్నించితిమి."[31] యిట్లా వీరిద్దరూ పల్నాడుప్రాంతం చేరి ఆ వుద్యమంతో మమేకం పొందారు. యీ జంటనాయకుల ప్రవేశంతో ప్రజాందోళన పతాక స్థాయికి చేరుకొన్నది. ప్రభుత్వోద్యోగుల ఆటకట్టినట్లయింది.

చాకలి బట్ట లుతకడు. మంగలి క్షవరం చేయడు. కోమటి బియ్యం విక్రయించడు. కడకు బావిలో నీళ్ళయినా తోడుకోనియ్యరు. యిదీ కొద్దికాలంగా అక్కడి ప్రజలు సాగిస్తున్న వుద్యమం. రెణ్ణెల్లక్రిందట గుంటూరుజిల్లా కలెక్టర్‌గా వచ్చిన షీల్డ్ గురజాల-మాచర్లగ్రామాల్లో మకాంచేసి యీ బహిష్కారాన్ని స్వయంగా చూశాడు. తానుకూడా ఆధాటికి గురైయ్యాడు. జిల్లాకంతా అధికారి. పాలకవర్గపు రాజబంధువు. పంచదార దొరకలేదు. కాఫీ లేదు. కడకు గ్లాసెడు పాలుగానీ తెప్పించుకోలేకపోయాడు. వూర్లో రహస్యంగా కొనడానికై డిప్యూటీ తాసీల్దార్ వగైరా అధికారులు ప్రయత్నించారు గానీ 'స్వరాజ్యసంఘం' వారేర్పరిచిన బారులు రేమాత్రం సందివ్వలేదు. వుద్యోగులందరికీ భోజనపదార్థాలు కటకటైంది. యిదీ పరిస్థితి. యిక ప్రభుత్వ బిర్రేమైనట్టు? శాసన బలమేమైనట్టు?

యీ వుద్యమాన్ని ఆపాలి. లేదా పల్నాడుకు స్వరాజ్యం దఖలుపడ్డటవుతుందనుకొన్నాడు. కలెక్టర్ దండోపాయానికి దిగాడు. యిద్దరు గార్డులు అన్నం తింటుంటే యింట్లో జొరబడి లాగి బయటకు మెడబట్టుకొని నెట్టుకొచ్చినట్లు నేరం మోపి సాయంత్రమే మేజిస్ట్రేట్ వద్ద కేసు దాఖల్ చేయించుకొని ఆనాడే విచారణకు వాయిదావేసి నబీసాహెబ్, చింతపల్లి హుసేన్‌సాహెబ్, జానమహమ్మద్ అనే ముగ్గురు మహమ్మదీయులకు వుదయానికి సమన్లు అందించారు. ఆ మధ్యాహ్నానికి తలా 3 నెల్ల శిక్ష పడింది.

---

31. వున్నవ లక్ష్మీనారాయణ వివేదికలోనుంచి మాదల వీరభద్రరావు తన 'గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం' గ్రంథం (౫౮ పేజీ)లో 'కోట్' చేసిన భాగం నుంచి యీ వాక్యాలు. తీసుకోడం జరిగింది.

యింతటితో వూరుకోకుండా వున్నవ, నరసింహాచారి యిద్దర్కీ నోటీసిచ్చి పిలిపించి క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 107 సెక్షన్ కింద జామీన్ యివ్వాలని కోరడం జరిగింది. నోటీస్ సారాంశం యిది: (1) పల్నాటిలోని జనాన్ని ఫారెస్ట్ చట్టాల్ని అతిక్రమించే నిమిత్తం పురికొల్పుతున్నారనీ (2) వుద్యోగుల్ని సంఘ బహిష్కారానికి గురిచేయించి వారిని బెదిరించేందుకు పురికొల్పుతున్నారనీ (3) పల్నాటి శాంతికి భంగం కలిగిస్తున్నారనీ.

యీ నోటీసుకు సమాధానంగా వున్నవ కోర్టులో యిట్లా చెప్పాడు: "(1) నేనింకా ఫారెస్ట్ చట్టాలను అతిక్రమించమని బోధించలేదు. (2) 'బాయ్ కాట్' అనే మాట సరైందికాదు, ఫారెస్ట్ వుద్యోగులకు సప్లయ్‌లు చేయకూడదనే వుద్యమం యిదివరకే యిక్కడ వుంది, దాన్నే దౌర్జన్యం లేకుండా నడపడానికి సహాయం చేస్తున్నమాట వాస్తవం. ఫారెస్ట్ వుద్యోగుల్ని బెదిరించమని నే బోధించలేదు. (3) పల్నాటిలో నావల్ల నెమ్మదికేమీ భంగం కలగలేదు. కాగా శాంతి వ్యాపకానికే నేనిక్కడ తోడ్పడుతున్నాను. (4) అందువల్ల జామీనిచ్చేందుకు నాకేమీ కారణాలు కనపడ్డంలేదు గనుక నేనీ విచారణలో పాల్గొనను."

అంతే పదినిమిషాల్లో విచారణ తతంగం ముగించి యిద్దరికీ చెరొక సంవత్సరం విడి ఖైదు శిక్ష విధించాడు డిస్ట్రిక్ మేజిస్ట్రేట్. తమ కష్టాలను బాపడానికొచ్చిన యీ నాయకులను చెరసాల పాలుచేసినందుకు పల్నాడు ప్రజల్లో రోషానలం భగ్గుమన్నది. అయితే వారిద్దరూ ముందుగానే వాళ్ళను నిగ్రహంతో వుండవల్సిందని గాంధీజీ అహింసా మంత్రి సారాన్ని వుపదేశించి వుండకపోతే అక్కడి చంద్రవంకలోని నిర్మలజలాలు యెర్రబారిపొయ్యేవి.[32]

కొండా వెంకటప్పయ్య వ్రాసినదాన్ని బట్టి యీ నాయకద్వయాన్ని మొదట నోటీసిచ్చి పిలిపించినప్పుడు పల్నాడు ప్రజ వారిని వూరకనే పోనియ్యలేదట. గజ్జెల గుర్రంమీద యెక్కించి తప్పెట్లు మోగిస్తూ వూరేగింపుగా తీసుకెళ్ళి కలెక్టరున్న డేరా దగ్గర దింపారట ప్రజలు. కలెక్టర్ యీ దృశ్యం చూచి విస్తుబోక తప్ప

32. యీ పల్నాడు పుల్లరి సత్యాగ్రహోద్యమ విశేషాలకు ఆధారాలు:—1921 ఆగస్టు 8 తేది కృష్ణాపత్రికలో 'గుంటూరు ప్రజాశక్తి విజృంభణము-తిలకు సంవత్సరము' అనే శీర్షికతో వచ్చిన మూడు పేజీల రిపోర్టూ (ఆంధ్రపత్రిక దీన్నే ఆగస్టు 11 సంచికలో యథాతథంగా పునర్ముద్రించుకొన్నది), మాదల వీరభద్రరావు 'గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం' గ్రంథంలో వున్నవ నివేదిక అచ్చుప్రతిలోనుంచి వుదాహరించిన భాగాలు.

లేదట. తాను లోగడ దండోరా వేయించాలనుకొంటే వొక్క తప్పెటా దొరక లేదట. యిప్పుడు వీళ్ళకు యిన్నెక్కడివని వుక్రోషంతో వూగిపోయాడట. "They say that swaraj will come some day, but now I see swaraj under me"—అని తలపోసుకొన్నాడట.[33]

వున్నవ, మాడభూషులను అరెస్టుచేసి జైలు శిక్ష విధించింది 1921 జూలై 22 సాయంత్రం. 25 నాటి మద్రాసు ఆంధ్ర (దిన) పత్రికలో 'ఆంధ్రదేశ నిర్బంధ ములు' అనే సంపాదకీయంతో బాటు పతాక శీర్షికలో యీ అరెస్టువార్త ప్రము ఖంగా వచ్చింది: 'అసహాయోద్యమము: ఆంధ్రదేశమున కఠిన శిక్షలు: బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి నరసింహాచారిగార్లు శిక్షింపబడుట: చెరియొక వత్సరము కారాగృహ వాసము: శ్రీమతి మహాలక్ష్మమ్మగారు (sic. లక్ష్మీబాయమ్మ అని వుండాలి) భర్త యగు లక్ష్మీనారాయణగారిని స్టేషనులో పుష్పహారములచే నలంకరించుట.'

22 తేది అరెస్ట్ చేసిన యిద్దరు నాయకులను 23 తేది రాత్రికి నర్సారావు పేటకు తీసుకవచ్చారు. యీ వార్త యెట్లా పాక్కిందోగానీ అక్కడ మూడు వేల మంది సమావేశమై స్వాగత సంరంభం చేశారు. 24 వుదయానికి గుంటూరు తీసు కొచ్చారు. కొండా, దుగ్గిరాల నాయకత్వంలో పదివేలమంది గుంటూరుస్టేషన్లో చేరి జయజయధ్వానాలతో స్వాగతమిచ్చారు. రైలింజన్ పై స్వరాజ్య జండా యెగ రేశారు. వున్నవ భార్య లక్ష్మీబాయమ్మ స్టేషన్ కొచ్చి భర్తమెడలో పూలమాల వేసింది. వేశ్యావృత్తిని విడనాడి స్వకులోద్ధరణకై కంకణం కట్టుకొని సంఘ సంస్కరణ రంగంలోకరికి పాటుబడ్తున్న యామినీ పూర్ణతిలకమ్మ లక్ష్మీబాయమ్మకు అండగా చేరి తన వాక్చాతురిమతో మహిళల్లో దేశభక్తి ప్రబోధం కల్గించడానికి కొంగు బిగించింది.

---

33. కొండా వెంకటప్పయ్య 'స్వీయచరిత్ర' (పేజీ 232)లో వ్రాసిన యీ వన్నివేశాన్ని, దాదాపు మక్కికి మక్కిగా అయ్యదేవర కాళేశ్వరరావు 'నా జీవితకథ'లో కాపీ కొట్టాడా అనిపిం చేట్లుగా వ్రాశాడు. యిందువల్లనే కావచ్చు యీ 'అసత్య' వన్నివేశానికి విశేషప్రచారమే కల్గింది. పై కృష్ణాపత్రిక రిపోర్ట్ నుబట్టిగానీ, వున్నవ నివేదికను బట్టిగానీ చూస్తే, గజ్జల గుర్రాలపై వూరే గింపుగా తీసుకొచ్చింది పైన ప్రస్తావనకొచ్చిన ముగ్గురు మహమ్మదీయులనేగానీ, వున్నవ సహభృతులను కాదని స్పష్టమవుతుంది.

గుంటూర్లో ఆరోజు వుదయం సాయంత్రం బహిరంగసభలు జరిగాయి. వారం రోజులపాటు పూర్తి హర్తాళ్, బంద్ జరిగింది. గుంటూరు మొత్తం గగ్గోలై పోయింది. ప్రభుత్వం వెలవెల పోయింది.

వున్నవ మాడభూషులను రాయవేలూరు జైలుకు తీసుకెళ్ళారు. పొంగెత్తిన ప్రజానురాగం వున్నవ హృదయాన్ని కదిల్చివుండాలి. జైలుగది నాలుగ్గోడలమధ్య 'కాన్విక్ట్ నెంబర్ 6657'గా యేడాదిపాటు తానెట్లా గడపాలి? ప్రజలకు ప్రజా వుద్యమాలకు దూరంగా తాను అక్కడ యెట్లా వుండిపోవాలి? యెట్లా?

యింతకాలం తన మనసులో మెదులుతూ గుండెమీద కుంపటిలా వేధిస్తూన్న నవల వ్రాసేసి బరువు తగ్గించుకోనిదే యెట్లా వుండగలడు?

# ఫైలోపాఖ్యానం

అది నరకంగానీ స్వర్గంకానీ సోమరిగా వుండడమనేది వున్నవకు కాని పని. జైలు సూపర్నెంట్ మేజర్ యాండర్సన్‌ను అడిగాడు. జైల్లో గోళ్ళుగిల్లుకొంటూ కూర్చోలేననీ, వొక నవల రాసుకొంటాననీ అనుమతివ్వవలసిందనీ అడిగాడు. ఆయన పాపం వొక క్షణ మాలోచించి అట్లాగే అన్నాడు. అయితే వొక షరతు పెట్టాడు_ నువ్వు రాసిందేదో మాకు చూపించాలి. అభ్యంతరకరమైన విషయాలేమీ లేకపోతే సరి, వుంటేమాత్రం సెన్సార్ చెయ్యనిదే రాతప్రతిని తిరిగిచ్చేదిలేదు_ అన్నాడు. అట్లాగేనని వొప్పుకున్నాడు వున్నవ.

యేకాగ్రచిత్తంతో నవల వ్రాయడం ప్రారంభించాడు. యెక్కడి కాగితాలూ చాల్లేదు. 8 యెక్సర్‌సైజ్ పుస్తకాలయ్యాయి. మొత్తం 609 పేజీలు సాగింది. నవల నాలుగుభాగాలుగా తయారైంది. మార్జిన్‌లో వ్రాసిన దాన్నిబట్టి 1922 యేప్రిల్ 9 తేదీనాటికి మాలపల్లి నవల వ్రాతప్రతి పూర్తయింది.

జైలు అధికారులు వున్నవ దగ్గరకొచ్చి 1922 జూలై 21న విడుదల చేయబోతున్నామన్నారు. మూడురోజులు ముందుగా జైలు సూపర్నెంట్ వచ్చి వ్రాతప్రతిని అడిగి తీసుకెళ్ళాడు. అబ్బో పెద్ద నవలే అనుకొన్నాడు.

యీ 8 యెక్సర్‌సైజ్ పుస్తకాల వ్రాతప్రతి రూపంలో వున్న మాలపల్లి నవలను నార్త్ఆర్కాట్ జిల్లా మేజిస్ట్రేట్‌కు పంపించి, అందులో యేమైనా అభ్యం

తరకరమైన అంశాలుంటే తెలపవల్సిందని కోరాడు. యీ జిల్లాలో అధిక సంఖ్యా కులు మాట్లాడే భాష తమిళం అనీ, తన కార్యాలయంలో తెలుగు తర్జుమాకారు లెవరూ లేరు గనుక తాను చేయగలిగిందేమీ లేదంటూ, 1922 మేనెల 9 తేదీ నాటి లా (జనరల్) 1208 నెంబర్ జి. వో. ప్రకారం మద్రాసు ప్రభుత్వ సీనియర్ తెలుగు ట్రాన్సులేటర్‌కు పంపించుకోమని సలహా యిచ్చి వ్రాతప్రతిని తిరిగి పంపించేస్తూ జిల్లా మేజిస్ట్రేట్ జూలై 26 న జవాబు వ్రాశాడు.

యాండర్‌సన్‌కు యేమిచేయడానికీ పాలుపోలేదు- యిదెక్కడి బెడదరా బాబు అనుకొన్నాడేమో. నవల వ్రాతపతిని జైళ్ళశాఖ యిన్‌స్పెక్టర్ జనరల్‌కు పంపించాడు-దాని రచయితకు దాన్ని తిరిగిచ్చేయవచ్చునో లేదో తెలపవల్సిందిగా అభ్యర్థిస్తూ. ఆ జైళ్ళ యిన్‌స్పెక్టర్ జనరల్ మాత్రం యేంచేస్తాడు? యెక్సర్ సైజ్ పుస్తకాల్లో వున్న నవలను భద్రంగా పార్సిల్‌కట్టి రిజిస్టర్‌పోస్టులో పంపుతూ, దాన్ని పరిశీలించి యేంచేయాల్నో చెప్పమని కోరుతూ 1922 ఆగస్టు 10న మద్రాసు సెక్రెటేరియట్‌లోని న్యాయశాఖ సెక్రెటరీకి వొక జాబు వ్రాశాడు.

అది న్యాయశాఖ కార్యాలయం కాబట్టి యీ నవల ఫైల్‌మీద పదేపదే నానా తర్జనభర్జనలే జరిగాయి.

ఆఫీస్‌వాళ్ళు మర్రోజే మామూలుగా నోట్ పెట్టారు. నవల వ్రాసిన రచయిత జైలునుంచి విడుదలైపోయ్యాడు గనుక, జైళ్ల యిన్‌స్పెక్టర్ జనరల్ వ్రాతప్రతిని తిరిగిచ్చేయవచ్చునా లేదా అని అడిగున్నాడు గాబట్టి తెలుగు ట్రాన్స్ లేటర్‌కి పంపించి యింగ్లీషులోకి తర్జుమా చేయించుకొని చూడడమా, లేక మామూలుగా రచయితకు యిచ్చేయడమా అనే ప్రశ్నలను యెత్తి చూపుతూ, యిచ్చివేయుడమే మంచిదన్నట్లుగా వొక సూచన చేస్తూ ఆఫీస్ సూపర్నెంట్ నోట్ వ్రాసి పెట్టాడు.

వ్రాతప్రతిని క్షుణ్ణంగా పరీక్ష చేయ నక్కర్లేకుండానే రచయితకు యిచ్చేయ వచ్చు, అచ్చయినప్పుడు చూచుకోవచ్చు, అభ్యంతరకరమైందని తోస్తే రచయితపై అప్పుడు తగిన చర్య తీసుకోవచ్చు-అని పై అధికారి సంతకం పెట్టాడు. అంతా అవునంటే అవునని సంతకాలు పెట్టారు. ఫైల్ చీఫ్ సెక్రెటరీ (ఆర్. యమ్. గ్రహామ్) దగ్గరకు పోయింది. ఆయన అడ్డంగా వ్రాశాడు.

వున్నవ లక్ష్మీనారాయణ జైలునుంచి విడుదలకాగానే వొక చోట మాట్లాడుతూ యీ నవల్లోని విషయాలు గూర్చి చెప్పినట్లు పత్రికల్లో పడ్డ జ్ఞాపకమనీ, ఆ

పత్రికల కటింగ్స్ పెట్టవల్సిందిగా ఆర్డర్ వేసి ఫైల్‌ను కిందికి పంపించేశాడు 8-9-22న.

కింది అధికారులు పత్రికల ఫైళ్లన్నీ గాలించవలసి వచ్చింది. వున్నవ వుపన్యాసాలు పడ్డ వార్తాపత్రికల భాగాలు మూడింటిని జతచేసి 11-11-22న యీ క్రింది నోట్ పెట్టారు:

> "Newspaper extracts containing Vunnava Lakshminarayana's speeches are put up. He does not seem to have made any statement about his novel. Submitted for orders."

తాను సెప్టెంబర్లో అడిగితే ఫైల్ మళ్లీ నవంబర్లోగానీ రాలేదు! యీ మాత్రపు నోట్ పెట్టడానికి రెణ్ణెల్లా వారంరోజులు పట్టిందా అని విసుక్కున్నాడు. పైగా నవల గూర్చి యేమీ చెప్పలేదంటూ రేమిటి? యీ క్రింది నోట్ వ్రాసి, ఫైల్‌ను కింద పడేశాడు:

> **"He most certainly did, but it has taken the office over two months to put up even these few reports of speeches made by him. Please let me know in less than two days when he was released."** 13.11.22.

అయ్యా మహాప్రభో, ఆయన్ను విడుదల చేసింది 1922 జూలై 22న-అని నోట్ పెట్టి మళ్లీ ఫైల్‌ను 'కామందులవారి' ముందు పెట్టారు. చీఫ్ సెక్రటరీ వ్రాసిన నోట్ యిది:

> "Will u. s. (under secretary) see if there is anything in the police reports of about that time. I remember a report of some speech in which V. L. (Vunnava Lakshminarayana) spoke about the book on the compilation of which he had been engaged in Jail."
> 15.11.22.

ఆఫీస్‌వాళ్ళు అన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించి యీ క్రింది నోట్ పెట్టారు 6-12-22న:

"He was released on 21.7.22 and made speeches in Chittoor on 22nd and in Guntur on 25th about the jail experiences. The fortnightly reports were (also) looked up ; but they contain nothing about his speech on his novel.." 6.12.22.

దీనిమీదట అండర్ సెక్రెటరీ యీ కింది రిమార్కు వ్రాశాడు :

"The delay is scandalous and if I didnot know that the clerk was very overworked I would punish him." 7.11.22.

చీఫ్ సెక్రెటరీ మండిపడ్డాడు యింత ఆలస్యం జరిగిపోయినందుకు. తెలుగు ట్రాన్స్‌లేటర్‌కు వ్రాతప్రతిని పంపి అతని అభిప్రాయం తెప్పించవల్సిందిగా కోరుతూ యీ క్రింది ఆర్డర్‌తో ఫైల్‌ను పంపేశాడు :

"Three months have been wasted because the office has not been able to put the proper papers. Send the book to the Telugu translator for opinion." 8.12.22.

యిట్లా వున్నవ 'మాలపల్లి' ఫైల్ పరంపద సోపానపటంలో పాములాగా పైకి కిందికీ తిరుగాడుతూ యీ దశకు వచ్చిచేరింది.

# పత్రికలు : మాలపల్లి ప్రస్తావనలు

సెక్రిటేరియట్లో ఫైల్ నడకను కాసేపు పక్కన పెట్టి చూద్దాం. వున్నవ జైలునుంచి విడుదలైన తర్వాత సభల్లో ప్రసంగిస్తూ యీ నవల గురించి చెప్పగా ఆ విషయాలు పత్రికల్లో చదివినట్లు చీఫ్ సెక్రిటరీ సెప్టెంబర్ 3న ఫైల్‌లో వ్రాశాడు. యే పత్రికల్లో చదివుంటాడు? 'స్వరాజ్య', 'హిందూ' వంటి యింగ్లీషు పత్రికల్లో చదివుండొచ్చు. అప్పట్లో తెలుగువాళ్ళ యేకైక దినపత్రికైన 'ఆంధ్ర పత్రిక' యీవిషయమై వ్రాయకుండా వుంటుందా?

1922 సెప్టెంబర్ 23 మధ్యాహ్నం చిత్తూర్లో ఆంధ్రరాష్ట్ర మహాసభలు జరుగుతున్నాయి. హేమాహేమీ ఆంధ్ర నాయకులంతా చిత్తూరు చేరారు. ఆ సభలకు వున్నవ అధ్యక్షుడుగా ఆహ్వానింపబడ్డాడు. సతీసమేతంగా ఆయన ఆ వుదయమే చిత్తూరొచ్చాడు. ఆనాటి ఆంధ్రపత్రిక ప్రత్యేకంగా వొక పేజీనిండా వున్నవ జీవిత చరిత్రను ప్రకటించింది. లేఖకుడు 'చిరకాల మిత్రుడు'. అందులో వొక వాక్యం: "కారాగృహమునందున్న సమయమున వారు కాలము వృధాపుచ్చక 'మాలపల్లె' యను సాంఘిక నవలను రచించి ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి తోడ్పడిరి."

అంతెందుకు? దీనికి 3 నెల్లక్రితమే యిదే ఆంధ్రపత్రిక వున్నవ రాయవేలూరు జైలునుంచి విడుదలైన రోజున వొక సంపాదకీయంతో స్వాగతమిస్తూ యిట్లా ప్రస్తావించింది: "వీరు సంవత్సరకాలమును శ్రీకృష్ణజన్మస్థానమునందు స్వరాజ్య మంత్ర పారాయణము చేసి సేవాదీక్షా పరాయణులగుచు ఆ కాలమునందు 'మాలపల్లె' యను సాంఘిక నవలను వ్రాసి సర్వతోముఖమైన సేవానిరతిని విశదము చేయగలిగిరి."[34]

34. 1922 జూలై 22 ఆంధ్రపత్రిక వునసంపాదకీయం "దేశభక్త ఉన్నవ లక్ష్మీనారాయణగారు."

జైల్లో వుండగా వ్రాసిన ఒక నవల గురించి, అందునా వ్రాతప్రతిలో వుండగానే, విడుదలైన మర్రోజే పత్రికల కెక్కడం 'మాలపల్లి' ప్రత్యేకత. చిత్తూర్లో 1922 జూలై 22న, గుంటూర్లో 25న వున్నవ ప్రసంగించినట్లూ జైలు అనుభవాల్ని గురించి చెప్పినట్లూ ఆఫీస్‌వాళ్లు వ్రాసిన నోట్. చిత్తూర్లో యేం మాట్లాడిందీ తెలియదు.[35] ఆంధ్రపత్రిక వార్త చూడండి:

"శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు రాయవేలూరు చెరసాలనుండి వదులుట: తిరుపతి కాంగ్రెసు సభ కార్యవర్గ సంఘ సభకు వెళ్లుట: నేడు తిరుపతిలో జరుగుచున్న ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సభకు వచ్చిరని మా కిపుడే తంతివార్త వచ్చినది."[36] మూడురోజుల తర్వాత మరో వార్త:

"శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు: గుంటూరు కేగుట: వేలకొలది ప్రజలు స్వాగత మొసంగుట:: 24 తేదీ సాయంత్రము రైలులో శ్రీయుత బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరు చేరిరి. లక్ష్మీనారాయణగారు రాయవేలూరు చెఱసాలనుండి తిన్నగా తిరుపతికి వచ్చిరి. అచట రాష్ట్రీయ కాంగ్రెసు కార్యవర్గ సంఘ సభకు వెళ్ళిరి. పంతులుగారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు కూడ తిరుపతికి వచ్చిరి. దంపతులు తిరుపతిలో లక్ష్మీవేంకటరమణస్వామిని సందర్శించి అటనుండి గుంటూరుకు వెళ్ళిరి... ఊరేగింపు ఏలూరు బజారు చేరెను. అచట చీమకుర్తి బసవయ్యగారు వారికి సన్మానపత్రమును సమర్పించిరి." [37]

వున్నవ తన వుపన్యాసాల్లో నవల గురించి యేమీ చెప్పినట్లు లేదని ఆఫీస్ వాళ్లు నోట్ పెట్టినప్పుడు, చీఫ్ సెక్రిటరీ He most certainly did అని బల్లగుద్దినట్లు వ్రాశాడంటే ఆ యింగ్లీషు పత్రికల్లో ప్రస్తావనలు వుండివుంటాయేమో.

---

35. బహుశా యింగ్లీషు 'స్వరాజ్య' లేదా 'హిందూ' పత్రికా విలేఖరులు వున్నవ రాయవేలూరు జైలునుంచి విడుదలకాగానే చిత్తూర్లో యింటర్వ్యూచేసి వార్తలాంటిది పంపివుండవచ్చు. ఆ రోజుల్లో చిత్తూరు విలేఖరులకు యిదొక ముఖ్యమైన పనైవుంటుంది. 1922 మార్చి 20 న యిదే రాయవేలూరు జైలునుంచి విడుదలైన రాజాజీని 'స్వరాజ్య' విలేఖరి ఇంటర్వ్యూ చేస్తే "జైలునుంచి యిప్పుడే విడుదలైన నేను చెప్పేదేముంది?" అని తప్పించుకొన్నట్లు తన 'జైల్ డైరీ'లో వ్రాసుకొన్నాడు (చూడు: 'Rajaji's...Jail life,' Madras, 1941, Page 141)

36. 1922 జూలై 22 ఆంధ్రపత్రిక వార్త.

37. 1922 జూలై 25 ఆంధ్రపత్రికలో వచ్చిన వార్త.

# నవల వ్రాతప్రతిని కాల్చేస్తే సరి!
# ఫైలోపాఖ్యానంలో రెండో ఘట్టం

చీఫ్ సెక్రెటరీ ఫైల్ మీద ఆర్డర్ చేసిన రోజున్నే (8-12-22న) మాలపల్లి నవల వ్రాతప్రతి మొత్తం 8 ఎక్సర్‌సైజ్ నోట్ పుస్తకాల్ని కట్టగట్టి తెలుగు ట్రాన్స్‌లేటర్‌కి పంపించారు. అప్పట్లో మద్రాసు ప్రభుత్వానికి తెలుగు ట్రాన్స్‌లేటర్ బి. సోమసుందరరావు. ఆయనకు చేతినిండా పనితగిలింది.

పాపం భూతద్దం పెట్టుకొని ఆ 609 పేజీలనూ జాగ్రత్తగానే చదివాడు. ఒక నవలగా సాహిత్యపరమైన గ్రంథంగా అంచనా వేయడంగాక, దాని రాజకీయ వాసనలు వెతికి పట్టుకొన్నాడు. రచయితపై 'రాజద్రోహ' నేరారోపణకు వీలుకల్పిస్తూ ఒక రిపోర్ట్ వ్రాశాడు. ప్రభుత్వంలోని వివిధ శాఖలను అది పనిగా అడుగడుగునా దుయ్యబట్టాడనీ, అంతటితో సరిపెట్టుకోకుండా బోల్షివిజం సిద్ధాంతాలనూ, సహాయనిరాకరణ తత్వాన్నీ అతిశయంగా ప్రబోధించాడనీ, ప్రభుత్వంపట్ల విద్వేషాన్ని పురికొల్పే విధంగా వ్రాశాడనీ, దీని ప్రచురణకు అనుమతించడమంటే కొరివితో తలగోక్కోడ మవుతుందనీ, దేశానికీ ప్రజలకూ ఎనలేని కీడుచేసినట్లవుతుందనీ- ప్రభుత్వ విధేయంగా 'వ్రాయవలసిన' విషయాలే వ్రాశాడు. ఈ నవల ధోరణినీ, అందలి అభ్యంతరకరమైన రాజకీయాభిప్రాయాలనూ తెలిపే వివిధ భాగాలను, వాటి తర్జుమాలతో సహా వివరంగా తరువాత తెలియజేస్తానని ఒక కార్డుముక్క మీద 1923 జనవరి 8న తన ప్రాథమిక రిపోర్టును పంపాడు (చూడు : అనుబంధం-2).

అన్నట్లుగానే నెలరోజుల్లోగానే ఫిబ్రవరి 6వ తేదీ పెద్ద రిపోర్ట్ పంపాడు. యింగ్లీషులో కథను సంగ్రహంగా వివరిస్తూ తాను అభ్యంతరకరమైన భాగాలను కొన్న వాటిని వ్రాతప్రతిలో రంగుపెన్సిల్‌తో నెంబర్లిచ్చి వాటికి యింగ్లీషు అనువాదాలను జతపర్చి మొత్తం 20 పేజీల నిండా టైప్ చేసి పంపాడు. అంటే ప్రభుత్వం బ్రహ్మాస్త్రం ప్రయోగించడానికి వేదిక సిద్ధం చేశాడన్నమాట.

పేనుకు పెత్తనమిస్తే తలంతా కొరికి పెట్టినట్లు వొక సాహిత్య రచనగూర్చి తనను అభిప్రాయం అడిగిందిగదా అని తన యిష్టం వచ్చినచోటల్లా ముఖ్యంగా యే మాత్రం విమర్శపాలున్న భాగాలనంతా పెన్సిల్ గుర్తులతో ఖరాబుచేసి అనువాదం చేసి పంపి తన వుద్యోగధర్మాన్ని నిర్వర్తించుకొన్నాడు.

యీ రిపోర్ట్ చదివిన తర్వాత ప్రభుత్వం యెట్లా గమ్మునుండగలదు? అధికార్లను గంగవెర్రులెత్తింది. సెక్రెటేరియట్‌లో మళ్ళీ ఫైల్‌మీద కలకలం ప్రారంభమైంది. అండర్ సెక్రెటరీ యిప్పుడుకూడా మామూలుగానే నిమ్మకు నీరెత్తినట్లు సంసారపక్షంగా ఆలోచించాడు. పుస్తకం అచ్చయిన తర్వాత చూచుకోవచ్చు లెమ్మన్నట్లు నోట్ వ్రాశాడు:

> "I don't know that in any case we can stop him (the author) from publishing if he wishes to, unless he was allowed to write on certian conditions. But we might warn him that publication would probably entail a further prosecution."

పులిమీద పుట్ర అన్నట్లు నాన్ కో ఆపరేషన్‌తోబాటు బోల్షివిజమ్ కూడా కలగలిసిన నవల అన్నా తర్వాత చీఫ్ సెక్రెటరీ ఆగ్రుడయ్యాడు. యింకెందుకాలోచన? అగ్గిపుల్ల గీసి తగలబెట్టి పారేస్తే సరిపోతుందిగదా–అని వ్రాశాడు:

> "I donot see why we should take a hand in Bolshevist propaganda by handing back the ms. to Lakshminarayana. It had better be destroyed." 12.1.23.

దీంతో ఫైల్ క్లయిమాక్స్‌కు చేరుకొన్నది. చీఫ్ సెక్రెటరీ నుంచి గవర్నర్ executive council వద్దకు పోయింది. వొక సభ్యుడేమో I agree అని వ్రాశాడు.

మరో సభ్యుడు అడ్డుపడకుండా వుంటే మాలపల్లి నవలప్రతి అగ్నికి ఆహుతైపోయివుండేదే. ఆయన కాస్త ఆలోచించే వ్రాసినట్లుంది: "వ్రాతప్రతిని నాశనం చేయడానికి మనకేం అధికారముంది? అది అతని (రచయిత) ఆస్తి. ఆయన తన నవలను అచ్చువేసుకొన్నప్పుడు చూచుకోవచ్చు. యే చర్యయినా తీసుకోవచ్చు. కానీ యీ

లోగానే మనం కల్పించుకొని నవలను అగ్గిపుల్లగీసి పెట్టాలనుకుంటే మాత్రం ముందుగా అన్నీ క్షుణ్ణంగా పరిశీలించడం మంచిది”– అని ఫైల్ మీద వ్రాశాడు.

దీంతో ఫైల్ మళ్ళీ వెనక్కు నడిచింది. ఆఫీస్ సూపర్నెంటు జైల్ మాన్యువల్ తెప్పించుకొని అంతా వెతికి ఇట్లా నోట్ పెట్టాడు: “నవల వ్రాతప్రతిని తిరిగి యిచ్చేయకుండా మనమే అట్టిపెట్టుకోడానికి మాన్యువలులో మనకెక్కడా నిబంధన లేదు. అసలు జైళ్ళ యిన్స్పెక్టర్ జనరల్ నవలను యిచ్చేయవచ్చునా లేదా అనే ప్రశ్నను తొలుత యెందుకు లేవదీశాడో అర్థం కావడం లేదు. యే నిబంధనను బట్టి ఆయన ఆ ప్రశ్నను లేవదీశాడో మనం అడిగి తెల్సుకోవచ్చుకదా”– అని సూచన చేశాడు. దీని మీదట అండర్ సెక్రెటరీ 22–1–23 న ఫైల్ మీద యిట్లా వ్రాశాడు: “జైల్లోవుండగా నేరస్థులు సాధారణంగా పుస్తకాలు వ్రాసుకోడానికి అనుమతించరు. యీ విషయంలో మాత్రం ప్రత్యేక పరిస్థితుల్లో ఆ రచయితను వ్రాసుకోనిచ్చినట్లు భావించవలసి వుంటుంది. అవసరమైతే అడ్వొకేట్ జనరల్ను సంప్రతించిన మీదట లా డిపార్ట్మెంట్ తగిన సలహా యివ్వడానికి వీలుంటుంది.”

యిందుకు సంబంధించిన జైల్ మాన్యువల్ లోని నిబంధనలన్నీ భూతద్దాలు పెట్టుకొని పరిశీలించడం జరిగింది. ఫలానా రూల్ ప్రకారం నేరస్థులు జైల్లో పుస్తకాలు చదువుకోడానికి మాత్రమే వీలున్నది. మరికొన్ని ఫలానా రూల్స్ ప్రకారం జైల్లో నేరస్థులు కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో జాబులు వ్రాసుకోడానికీ అపీళ్ళు చేసుకొనేందుకు అర్జీలు గిర్జీలు వ్రాసుకోడానికీ కాగితాలు తదితర వ్రాత పరికరాలను అనుమతించవచ్చు. అంతేగానీ సాహిత్యపరమైన రచనలు చేయడానికి ప్రత్యేక నిబంధనలేమీ లేవు. జైల్ అధికారులు ప్రత్యేక పరిస్థితుల్లో యితనికి పర్మిషన్ యిచ్చి వుండాలి. వాళ్ళకు జాబు వ్రాసి కనుక్కుంటే సరిపోతుందనుకొన్నారు.[38]

జైళ్ళ యిన్స్పెక్టర్ జనరల్ రాయవేలూరు సెంట్రల్ జైలుకు వ్రాసి తెల్సుకొన్నాడు. అక్కడ అప్పట్లో మేజర్ యాండర్సన్ పోయి మరొకాయన సూపర్నెంటుగా వచ్చాడు. ఆయన పంపిన సమాధానం యిది: ‘పర్మిషన్ యిచ్చింది నా ముందుండిన సూపర్నెంట్ యాండర్సన్. వ్రాతప్రతిని సెన్సార్ చేసే షరతుమీద పర్మి

38. వున్నవ నవల యీ వలయంలో చిక్కుకున్నదిగానీ, దాదాపు యిదేకాలం (1921 డిసెంబర్—1922 మార్చి) లో యిదే జైల్లోకి వచ్చి చేరిన రాజాజీ, డైరీ వ్రాసుకోడానికిగానీ, ఆ ‘జైల్ డైరీ’ని ప్రచురించుకోడానికిగానీ యీ యిబ్బందులేమీ యెదురైనట్లులేదు. రాజాజీ జైలుకు వస్తూ—వొక తెల్లకాగితాలకట్టా, పెన్సిళ్ళూ, పేనా, సిరాబుడ్డీ, పుస్తకాలు, ఆస్త్మా ఇబ్బందుకు మందుసీసావగైరాలు తన వెంటతెచ్చుకొన్నట్లు వ్రాసుకొన్నారు. (చూడు: Rajaji's 1920

షన్ యివ్వడం జరిగింది. రూల్స్ సంగతి నాకు తెలియదు; ప్రభుత్వానికి అభ్యంతరకరమైన విషయాలేమీ లేనివి తేల్చుకొన్న మీదట్నే దాన్ని తిరిగి యిచ్చేయడానికి వీలవుతుందనే షరతుపెట్టి యాండర్సన్ పర్మిషనిచ్చాడు'_ అని 10_2_23 న మూడు వాక్యాల్లో ముగించివేస్తూ సమాధానం పంపాడు. యీ జవాబును జతచేస్తూ జైళ్ళ యిన్స్పెక్టర్ జనరల్ లా డిపార్ట్మెంట్ సెక్రెటరీకి ఫిబ్రవరి 17 న దర్జాగా యీ సమాధానం పంపాడు: 'ఆ నాన్ కో ఆపరేషన్ నేరస్తుడికి వేసిన శిక్ష కఠిన శిక్షేమీ కాదు, విడిఖైదు మాత్రమే. అటువంటి వ్యక్తికి ఒక నవల వ్రాసుకోడానికి తగిన సెన్సారింగ్ పద్ధతిమీద పర్మిషన్ యిస్తే కొంప మునిగిపోయిందేమీ లేదు. పైగా నేరస్తులు అటువంటి సత్కాలక్షేపాల్లో నిమగ్నులై వుండేందుకు యిండియన్ జైల్స్ కమిటీవారు సుముఖత కనపర్చారు.'

యింతమంది చేరి యిన్ని నెల్లు ఒక ఫైల్ మీద యింత వ్యాయామం చేసి కడకు కొండను తవ్వి యెలుకను పట్టినంత పనైనదన్నమాట! ఆఖరుకు యీ క్రింది సూచన చేయబడింది. అభ్యంతరకరమైన అంశాలేమీ లేకపోయినప్పుడే వ్రాతప్రతిని తిరిగి యిచ్చేస్తామనే కండిషన్‌తో నవల వ్రాసుకోడానికి అనుమతివ్వబడింది కాబట్టి, మరి యిప్పుడు అందులో అభ్యంతరకరమైన అంశాలున్నట్లు తేలింది గనుక వ్రాతప్రతిని బహుశా తిరిగి యివ్వనక్కర్లేదేమో. పోతే వ్రాతప్రతిపై రచయితకుగల హక్కు విషయమై 1894 నాటి జైళ్ళ చట్టంలో సివిల్ క్రిమినల్ ఖైదీల పనిపాట్లకు సంబంధించిన 34,35 సెక్షన్లు పరిశీలించి చూడవలసి వుంటుంది. సివిల్ ఖైదీలు తాము జైల్లో వుండగా చేసిన చిల్లరమల్లర పనుల ద్వారా ఆర్జించుకొన్న సంపాదనను తీసుకోడానికి వీలున్నదిగానీ క్రిమినల్ ఖైదీల విషయంలో ఆ హక్కు లేదు.

దీనిమీదట ఆఖరుగా ఫైల్ మీద యింతవరకూ జరిగిన తతంగాన్నిబట్టి సమీక్షా పూర్వకంగా ఒక విపులమైన నోట్ టైప్ చేయించి పెట్టారు 23_2_23 న. లా డిపార్ట్మెంట్ అధికార్లు గాబట్టి వ్రాతప్రతి, దానికి సంబంధించి రచయితకుగల హక్కు భుక్తాలు గురించి, వ్రాతప్రతిని ప్రభుత్వం కాల్చివేయడంలో గల యిబ్బందులు యీ న్యాయశాస్త్రపు మెలికలన్నీ ప్రదర్శించారు (చూడు: అనుబంధం_8).

---

Jail Life,' revised edn., Madras, 1941. యీ పుస్తకం పేరులో 1920 అని వుండడం తప్పు. మొదట A Jail Dairy అని స్వరాజ్య ప్రెస్‌లో 1822 జూలైలో అచ్చయింది. యీ డైరీ గ్రంథంలో—తనతోపాటు జైల్లో 'సహనేరస్తుడు'గా వున్న వున్నవను గూర్చి, వున్నవ జైల్లో కూడా అధికారులపై లేవనెత్తిన చిరువుద్యమాన్ని గూర్చి, యితర తెలుగు నేరస్తులు నెల్లూరు (దేశిరెడ్డి శేషరెడ్డి,) కడపవారిని గూర్చి కూడా రాజాజీ ప్రస్తావించి వున్నారు.

# నవలను నిషేధించడానికి నిర్ణయం

లా డిపార్ట్మెంట్ సెక్రటరీ ఫైల్ మీద తన అభిప్రాయమేదో గట్టిగానే వ్రాశాడు:

> "The book could probably be forfeited under section 99 (A) of C. P. C. I do not however think that this would be the proper course. The Superintendent, on being informed of the contents should destroy the book as consent to its writing was only given subject to censoring. To hand the book over would in my opinion render jail administration rather ludicrous."
>
> 24-2-23.

ఫైల్ యీ దశకు చేరుకొని ఫైనల్ ఆర్డర్ కోసం పంపబోతున్న సమయంలో అగమేగాలమీద పిడుగువంటి వార్తతో కూడిన నోట్ వొకటి వచ్చింది 27-2-23 న. మనం యీ నవల వ్రాతప్రతి విషయమై యింతగా తర్జన భర్జనలు పడ్తూంటే నిన్న నే 26 తేది 'స్వరాజ్య' పత్రికలో యీ నవల ప్రచురణైనట్లు వివరంగా సమీక్షవొకటి అచ్చయింది. యిదెట్లా జరిగినట్లు? వ్రాతప్రతి యేమైనట్లు?- యిదీ ఆ నోట్!

ప్రభుత్వాధికారులంతా నిశ్చేష్టులయ్యారు. వ్రాతప్రతి బయటకు యెట్లాపోయి నట్లు? లేకుంటే నవలయెట్లా అచ్చయివచ్చినట్లు?- అని అనుకొన్నారు.

ఆఫీస్ వాళ్ళు నోట్ పెట్టారు- వ్రాతప్రతి యెక్కడికీ పోలేదు. మన ఫైల్లోనే చెక్కుచెదరకుండా వుంది. నవల అచ్చయివుంటే దానిపై నిషేధం విధించి కాపీ లన్నిటినీ ప్రభుత్వం స్వాధీనపర్చుకోవచ్చు. అంతేకాదు, రచయితపై ప్రాసిక్యూషన్ చర్యలు తీసుకోడానికి కూడా ఆలోచించవచ్చు-అని సూటిగా సూచనలు చేశారు.

అండర్ సెక్రెటరీ we certainly want some explanation of how it was published అని నోట వాక్యం జత చేసి ఫైల్ ను చీఫ్ సెక్రెటరీకి పంపాడు. ఆయన గబగబా గీకిన నోట్ చూడండి:

> "Of course it is all meant to cause disaffection and strictly speaking offends against section 124 A; but it is very silly stuff. This may not prevent its appealing to the audience it is meant to influence and I am inclined to think that the published book should be declared forfeit. The seizure may throw some light on how it came to be published when we thought we had the manuscript. Otherwise we are not likely to find out. Apart from what I think must be an inherent right on the part of Government to prevent anything going out of jail which they think is likely to do harm, it is clear that the conditions under which Mr. Lakshminarayana was allowed to write give Government a right to seize his munuscript, and this may be destroyed." 1-3-23.

దీనికి పదుంరోజులక్రితమే లా మెంబర్ గా గవర్నర్ యెక్సిక్యూటివ్ కౌన్సిల్ లో చార్జి తీసుకొన్న సి. పి. రామస్వామి అయ్యర్ దగ్గరకొచ్చింది ఫైల్. ఆయన తన అభిప్రాయాన్ని యీ క్రింది విధంగా రికార్డ్ చేశాడు:

> "If, as a matter of fact, the book has been published and reviewed, there is no point in returning or immediately destroying the manuscript. If, however as is likely no application for its return is made, it may be destroyed after a few months. There is no basis in giving a handle to frail criticism. It is however a matter for investigation as to how the publication of the book took place. Much of the book seems to be silly stuff but there is a portion which is provocative and suggestive.
>
> "The translation may be sent to the Advocate General for his opinion as to whether the book offends against civil law or invites the application of section 99A (vide Act XIV of 1922) 5-3-23.

దీనితో మళ్ళీ ఫైల్ మరో మార్గం పట్టింది. మార్చి 7 న అడ్వకేట్ జనరల్ కు ఒక జాబూ, సి.అయ్.డి. వాళ్ళకు యింకో జాబూ విడివిడిగా పోయాయి. వ్రాతప్రతి మనదగ్గరుండగానే యీ నవల యెటా అచ్చు కాగలిగిందీ, అచ్చుప్రతికీ మనదగ్గరున్న వ్రాతప్రతికీ తేడా లేమైనా వున్నాయా అనే విషయాలు విచారించి పంపమని సి. అయ్. డి. స్పెషల్ బ్రాంచి వాళ్ళను కోరడం జరిగింది.[39] సి. అయ్. డి. వాళ్ళంటే యిక చెప్పాలా ?

12-4-23 న సి. అయ్. డి. స్పెషల్ బ్రాంచివాళ్ళు వివరంగా తమరిపోర్టు పంపారు (చూడు: అనుబంధం-4) వున్నవ జైల్లో నవల వ్రాస్తుంటే తన జైలు సహచరుడు నరసింహాచారి మరో శుభ్రమైన కాపీ వ్రాశాడనీ, ఆ కాపీనే జైలు నుంచి రహస్యంగా బయటకు పంపించడం జరిగిందనీ, జైలునుంచి విడుదలైన తర్వాత ఆ కాపీ ఆధారంతో బెజవాడ 'ఆంధ్ర పరిషత్' వారు నవలను ప్రచురించారనీ, యింతవరకూ రెండు భాగాలు వచ్చాయనీ, మూడోది ముద్రణలో వుందనీ, నాలుగో భాగం యింకా ప్రెస్‌లోకి రాలేదనీ సెక్రెటేరియట్‌లోని వ్రాతప్రతికీ ముద్రితప్రతికీ తేడాలేమీ లేవనీ సి. అయ్. డి. వాళ్లు తెలియజేశారు.

అడ్వకేట్ జనరల్ (సి. మాధవన్ నాయర్) యేప్రిల్ 6 న తన రిపోర్టు పంపాడు. తనకు పంపిన తెలుగు ట్రాన్స్‌లేటర్ యింగ్లీషు భాగాలనుబట్టి చూస్తే అంతా మొత్తం రాజద్రోహ నేరంకిందకు వస్తుందనీ, పెక్కు భాగాలను యిండియన్ పీనల్ కోడ్ 124 యె, 153 యె సెక్షన్లకిందకు వస్తాయనీ, యిక క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 93 యె కిందకు కూడా వస్తాయనీ, ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదనీ నీళ్లు నమల కుండా విస్పష్టంగా రిపోర్టు వ్రాశాడు (చూడు: అనుబంధం 5). అంటే మాలపల్లి నవలపై ప్రభుత్వ ఆగ్నేయాస్త్ర ప్రయోగానికి రంగం అంతా సిద్ధమైందన్నమాట.

రచయిత వున్నవను ప్రాసిక్యూట్ చెయ్యాలని అధికారస్వాములంతా నోట్‌లో సూచించారు. అండర్ సెక్రెటరీ అభిప్రాయం చూడండి:

> "...it seems pretty clear that copies were made in the jail and somehow smuggled out and it does not say very much of the supervision that this was allowed to

39. ఆ హడావుడిలో సి.అయ్.డి. వాళ్లకు పోవల్సిన జాబు మద్రాసు పోలీస్ కమీషనర్‌కు పోయింది. అక్కణ్ణుంచి 23-3-23 న డిప్యూటీ యిన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, రైల్వేస్ అండ్ సి.అయ్.డి. వారికి రీడైరెక్టయిపోయింది. మధ్యలో వొకసారి రిమైండర్ కూడా పోయింది.

happen. The Advocate General has I think given it as his opinion that the book comes within the law and I think the man deserves prosecution."

చీఫ్ సెక్రెటరీ ఓ. కె. అన్నాడు. ఇలా క్రింది నోట్ వ్రాసి లా మెంబర్‌కు పంపించాడు ఫైల్ ను:

"Prosecution may be sanctioned and the I. G. of prisons may then be asked to obtain the explanations of the jail officers responsible for letting Lakshminarayana get a copy out." 18.4.23.

లా మెంబర్ సి. పి. రామస్వామి అయ్యర్ మళ్ళీ ముగ్గులోకి వచ్చాడు. తన అభిప్రాయమేమిటో వివరంగానే వ్రాశాడు:

"The explanation (at p. 40) is unsatisfactory and it discloses the fact that the supervision is laxer than it ought to be. At the same time, it is instructive to notice that a prominent Non Cooperator who has apparently considerable prestige in his own circle has stooped to stratagems such as seem to have practised in the matter of writing the book and smuggling the manuscript out of jail. It is in such cases that the Publicity Bureau might have done good work. I am in favour of proceeding under section 99A of C. P. C., and, in stating the grounds of opinion under section 99A (1) (b), I don't see why we should not at least indicate how the book came to be published. The Advocate General has come to the conclusion that the book is seditious and I think so too. There is therefore no obstacle to proceeding under sec. 99A of C. P. C. and declaring the book forfeit. As to prosecution under section 124A, I feel that such a step may be construed as vindictive. The man was released from jail 8 months ago. In spite of my conviction that the book contains a number of undoubtedly seditious passages and my feeling of indignation over the trick played by the man on the jail authorities, I still think it may be impolite to proceed under sec. 124A. Will the Chief Secretary please submit the case to H. E.

(the Governor) after my honourable collegue C 3 has dealt with it as a question of policy is involved.

23.4.23.

గవర్నర్ విలింగ్డన్ యీ క్రింది విధంగా వ్రాశాడు:

"I quite agree to the book being declared forfeit. I own I can't see that it was a very disgraceful thing for the individual to have written two copies in the hope that he might get out of jail with one in his pocket, undiscovered, and having done so, to get it printed at once. It should be gross slackness and stupidity on the part of the jail management." 27.4.23.

యీ ఆర్డర్ పడడంతో, 9 నెల్లక్రితం ప్రారంభమైన ఫైల్ యిన్నాళ్ళకు వొక కొలిక్కి వచ్చింది.

1923 మే నెల 14 న మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి గెజెట్‌లో యీ క్రింది ప్రకటనను ప్రచురించి మాలపల్లి నవలను ప్రభుత్వం నిషేధించింది:

NOTIFICATION

*(G.O. No. 396 public.)*

No. 176 - In exercise of the powers conferred by the section 99-A of the Code of Criminal Procedure, 18⁰8, the Governor in Council hereby declares to be forfeited to His Majesty all copies wherever found of the Telugu book entitled "Malapalle" (The Adi-Andhra Hamlet) or "Sanga Vijayamu" (The Triumph of Sangadas) written by Vunnava Lakshminarayana of Guntur while confined in the Central Jail, Vellore, and published in contravention of the terms on which permission was granted by the Andhra Parishad, Bezwada, and all other extracts from the said book inasmuch as it contains seditious matter the publication of which is punishable under section 124-A of the Indian Penal Code.

E. S. LLOYD,
Acting Chief Secretary.

యీ ప్రకటనకు నాలుగురోజులు ముందుగానే సి.ఐ.డి. వారి నిఘాకోసం శోక జాబుపోయింది. యిప్పటివరకూ మాలపల్లి నవల రెండు భాగాలు మాత్రమే విడుదలయ్యాయనీ, యింకా రెండు భాగాలు రావల్సివున్నాయనీ, అవెప్పుడు వస్తాయో నిఘావేసి వుంచి, రాగానే తెలపవలసిందిగా సి. ఐ. డి. వాళ్ళను ప్రభుత్వం కోరింది.

మాలపల్లి మొదటి రెండుభాగాలను నిషేధిస్తూ వచ్చిన ప్రభుత్వ ప్రకటన జారీఅయి రెణ్ణెల్లు గడిచింది. అండర్ సెక్రెటరీకి శోక జాబు వచ్చింది. మూడో భాగం విడుదలైనట్లు పోలీస్-రైల్వేస్ అండ్ సి.ఐ.డి. డిప్యూటీ యిన్‌స్పెక్టర్ జనరల్ 1923 జూలై 27 న వ్రాసిన జాబు అది. ఆ మూడోభాగం కాపీని కూడా అందులో జతచేసి పంపాడు. మళ్ళీ తర్జన భర్జనలు ప్రారంభమయ్యాయి. లోగడ జారీఅయిన నిషేధపుటుత్తర్వు అప్పటివరకు వచ్చిన నవల రెండు భాగాలకు సరిపో తుందేగానీ ఆ దరిమిలా వచ్చిన యీ మూడోభాగానికి వర్తించదని ప్రభుత్వం కల వెల్సుకుంది.

యెందుకైనా మంచిది నవల మూడోభాగాన్ని కూడా నిషేధిస్తూ మరోవుత్తర్వు విడిగా జారీ కావడమే మంచిదనుకున్నారు. ఆ మేరకు ఆగస్టు 8 న మరో జి.వో. ను వెలువరించి గెజిట్‌లో ప్రకటించి చేతులు కడుక్కొన్నారు అధికారులు!

జైల్లో జన్మించిన ఈ నవలా శిశువును ప్రభుత్వం మళ్లీ జైల్లోనే కటకటాల వెనక పడేసి కట్టడిచేసినట్లయింది. యిట్లా మూడు సంపుటాలుగా వచ్చిన నవల మూడు భాగాలను వరసబెట్టి కట్టుగట్టి నిషేధించిన తర్వాత నాలుగోభాగాన్ని అచ్చువేయ డం దండగనుకొని ఆ సంకల్పాన్ని రచయితా, ప్రచురణకర్తలూ అప్పట్లో మాను కొన్నట్లున్నారు. చాలాకాలం దాకా తెలుగు పాఠకులకు పూర్తి నవలను చదివే అవకాశమే లేకపోయింది.

# స్మశాన శాసనమండలి:
# సి. ఆర్. రెడ్డి బాబు!

వొక తెలుగు నవలను యీ విధంగా ప్రభుత్వం కత్తుగట్టి రాజకీయాలు అంటగట్టి నిషేధించడం బహుశా యిదే మొదలు కావచ్చు. నిషేధించబడిన తెలుగు రచనలపై యెవరైనా పరిశోధకులు పూనుకొని జాగ్రత్తగా పూడికలు తీయనిదేగానీ పెక్కువిషయాలు బయటికిరావు.[40]

---

40. అప్పటి ఆంధ్రపత్రికలు చూస్తుంటే ప్రభుత్వ నిషేధానికి గురైన తెలుగు పుస్తకాలు లెక్కలేనన్నివిగా కనపడ్డాయి. వుదాహరణకు "విజయనగర వాస్తవ్యులగు సోమయాజుల సూరిదేశకవిగారిచే రచింపబడిన 'శ్రీ భారతీయవిలాస'మను గ్రంథమును ప్రభుత్వమువారు స్వాధీన పరచుకొనుచు అది రాజద్రోహము గనుక ప్రచురింపగూడదని ప్రకటించుచున్నారు"—అని 18-5-22 నాటివార్త. అట్లనే "మేడూరి రామమూర్తిగారు వ్రాసి బాపట్ల విజయ ముద్రాక్షరశాల ముద్రించి ప్రకటింపబడిన 'చీరాల పేరాల గాంధిదాసనాటకము' తెలుగు పుస్తకమును ప్రభుత్వము వారు స్వాధీనము చేసికొనిరి" అని 6-7-22 న మరోవార్త. యిక 19-6-22 నుంచి పరేసరి, గరిమెళ్ళ సత్యనారాయణ 'స్వరాజ్యగీతములు'పై నిషేధం, రాజద్రోహపుకేసు, కోర్టులో ఆయన స్టేట్‌మెంటూ, రెండేళ్ళశిక్ష, కడలూరు జైలుకుపంపడం—ఈ వార్తల పరంపరే. అదే సంవత్సరం అక్టోబర్లో 'స్వరాజ్య గీతామృతము'పై మరో రాజద్రోహపు కేసు, వద్దాది సీతారామాంజనేయులుగారి లేఖలూ, ఆ మరుసటేడు రాజమండ్రి 'కాంగ్రెసు' పత్రిక యెడిటర్ మద్దూరి అన్నపూర్ణయ్యపై కేసు— ఇట్లాటి వార్తలు యెన్నని!

1921-22 లో దేశం మొత్తంమీద 460 పుస్తకాలు నిషేధింపబడ్డాయి. 1923 లో 160, 1924 లో 41 పుస్తకాలు నిషేధింపబడ్డట్లు Barrier తనగ్రంథంలో లెక్కగట్టాడు. మరి ఆ లెక్కన వీటిల్లో తెలుగు పుస్తకాలెన్నో లెక్కగట్టడమంటే యిప్పట్లో సాధ్యపడే పనికాదు.

1923 నాటి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో పానగల్ రాజా, పాత్రో వంటివాళు 'మంత్రులుగా' వున్నప్పటికీ, కాంగ్రెస్ సభ్యులు, స్వరాజ్యపార్టీ ముసుగులోవున్న కాంగ్రెస్ అభిమానులు లేకపోలేదు. అయినా యే వొక్కరు కూడా కౌన్సిల్‌లో కుయ్‌కయ్ మన్నట్లులేదు. యిదేమిటీ వొక నవలను నిషేధించడం అన్యాయం కాదా అని కనీసం వొక్క ప్రశ్నయినా యెవరూ వేసిన పాపాన పోయినట్లు లేదు.

స్వరాజ్యం వచ్చిన యిన్నేళ్ళతర్వాత, యిటీవలి కాలంలో 'విరసం' వాళ్ళ పుస్తకాలనుగానీ పత్రికలుగానీ ప్రజాస్వామ్య ప్రభుత్వం అని పిలవబడే మన ప్రభుత్వం వరసబెట్టి నిషేధించి కూర్చున్నప్పుడు మొత్తంమీద మన శాసనసభ నోరెత్తనట్లుగానే అప్పటివాళ్లూ స్మశాన మౌనంతో చూస్తూ కూర్చుండిపోయారు. 'శాసనసభ్యులు గాదు వీళ్ళు ఆసన సభ్యులు' అని పఠాభికవీంద్రుడు తన పన్‌చాంగంలో యిటువంటివి దృష్టిలో పెట్టుకొనే అన్నట్లున్నది.

అంటే అప్పుడుగానీ యిప్పుడుగానీ మన శాసనసభ్యులనే వాళ్ళకు యిట్లాంటి సాహిత్య విషయాల్లో శ్రద్ధాశక్తులు లేవనుకోవాల్నా? సాహిత్యవిషయాలతో ముడిపడ్డ రాజకీయాలతోగానీ, రాజకీయాలతో పెనవేసుకున్న సాహిత్య విషయాలపట్లగానీ 'సాహిత్యం' అని వుంటే వీళ్ళ అభిమానం తిగ్గుముఖం పడుతుందా? యేమైనా కావచ్చు. జరిగింది మాత్రం యిది.

అయితే యిందుకొక చిన్న మినహాయింపు. యీ నవలపై వచ్చిన నిషేధం తాలూకు వేడి శాస్త చల్లారినతర్వాత కట్టమంచి రామలింగారెడ్డి[41] కొంత కల్పించుకొన్నాడు. పాలక వర్గంతో 'సన్నిహితుడు'గా వుంటూన్నవాడే అయినా ఆయన సాహిత్యాభిమానిగా కల్పించుకొన్నాడు. గవర్నర్ కౌన్సిల్‌లో సభ్యుడుగా—లా మెంబర్‌గావుంటూ 'మంత్రి'కంటే మిన్నగా వ్యవహారిస్తూ యీ నవలను నిషేధించడంలో కీలకమైన భూమిక నిర్వహించిన సి. పి. రామస్వామి అయ్యర్‌కు నిషేధాన్ని తొలగించవల్సిందిగా కోరుతూ గట్టిగానే వొక లేఖ వ్రాశాడు (చూడు: అనుబంధం_6)

---

41. మద్రాసు "యూనివర్సిటీ నియోజకవర్గమునకు ఎన్నిక నొందిన శ్రీనివాసయ్యంగారి స్థానమునకు మరొక ప్రతినిధిని ఎన్నుకోవలసి వచ్చెను. ఆ ఉపవరణములో రామలింగారెడ్డి నిలబడి జయముగాంచినాడు. 1922 వ సంవత్సరము ఫిబ్రవరి 14 వ తేదీన ప్రమాణ స్వీకారము చేసి"నట్లు గొర్రెపాటి వెంకటసుబ్బయ్య వ్రాసిన గ్రంథం 'డాక్టర్ సి. ఆర్. రెడ్డి' (విజయవాడ, 1933) పేజీ 166. యీ విషయాన్ని నిర్ధారణ చేసుకోకుండానే యిస్తున్నాను.

నిషేధాన్ని తొలగించమని అభ్యర్థిస్తూ వ్రాసిన జాబే అయినా,[42] అందులో మాలపల్లిని గురించి అద్భుతమైన అంచనాయే చేశాడు. దాని సాహిత్యమూల్యాన్ని చక్కగానే విలువకట్టాడు. సి. పి. రామస్వామి అయ్యర్ వ గురజాడ కన్యాశుల్కంతో పరిచయమున్నదో లేదోకానీ, తెలుగు సాహిత్యంలో యీ నవలను సరిపోల్చి చెప్ప డానికి కన్యాశుల్క నాటకాన్ని యెన్నుకొని దానితో దీటైనది యీ మాలపల్లి అన్నాడు సి. ఆర్. రెడ్డి. వొక రచయిత రాజకీయ అపరాధానికి అతని సాహిత్య శిశువును శిక్షించడం తగదంటూనే, యీ నవల రాజకీయమైన బాంబ్ షెల్ కాబో దని హామీయిస్తూ, పుస్తకాలవల్ల విప్లవాలేవీ రాలేదనీ, యిండియాలో వీటిమూలంగా విప్లవం వచ్చే అవకాశం మరీ తక్కువనీ వ్రాశాడు.

పుస్తకాల 'సత్తా'గురించి యింత తక్కువచేసి వ్రాయడం సి. ఆర్. రెడ్డి ప్రాక్టికల్ గా కావాలని చేసిన వాదన కావచ్చునేమోకానీ, యిదే సి. ఆర్. రెడ్డి పన్నెండేండ్ల తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయానికి కులపతిగావుంటూ పుస్తకాలకున్న సత్తాను అనుభవంలోకి తెచ్చుకున్నాడు. పూరకే తెచ్చుకోవడంకాదు, తన పరిధిలో తాను కొన్ని పుస్తకాలపై నిషేధంలాంటిది విధించినప్పుడు వొక పత్రిక వ్రాసిన యీ చిన్న సంపాదకీయ రచనను యీ సందర్భంలో ప్రస్తావించుకోవడం సముచితంగా వుంటుంది.

"పంచాంగాలు పోతే
నక్షత్రాలు పోతవా?"

"ఆంధ్ర విశ్వవిద్యాలయ లైబ్రరీలో సోషలిజముకు సంబంధించిన పుస్తకాలు వుండకూడదని వైస్‌ఛాన్సలరగు సి. ఆర్. రెడ్డిగారు ఉత్తర్వు గావించారు. ఇతర విశ్వవిద్యాలయాల్లో గావింపబడని ఉత్తర్వును కొత్తపట్నం లాఠీచార్జి జరిగినవెంటనే వీరొక్కరు మాత్రం గావించడం వింతగనున్నది. ప్రపంచమంతటను సామ్యవాద ప్రచండవాయువులు వీచుచుండ ఆంధ్ర యూనివర్సిటిని సీసాలోవేసి కార్కును

---

42. 1923 యెన్నికల తర్వాత పానగల్లు రాజా 'ముఖ్య'మంత్రిత్వం కింద తనకు మంత్రి పదవిగానీ, మరో ముఖ్యపదవిగానీ రానందువల్ల రోషంతో జస్టిస్ విముఖుడై 1923 నవంబర్లో మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టి ఆనాటి మద్రాసు రాజకీయాల్లో తోకచుక్కలా వెలుగొందిన సి. ఆర్. రెడ్డి, యీ అవిశ్వాస ప్రయత్నంలో సి. పి. రామస్వామయ్యర్ లాంటివారితో సరసాలాడిన వాడైనందున, 'మిస్టర్' అనైనా అనకుండా 'డియర్' రామస్వామి అయ్యర్ అని నేరుగా దర్జాగా సంబోధించడం గమనించతగింది.

షేధించినంత మాత్రమున నేమి ప్రయోజనము? అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కృపాలినీగారు వ్రాసినటుల వైస్‌చాన్సలర్‌గారు యువకులయందు నూతన విశ్వాసము కలుగకుండ జేయవలెనంటే అనేకరకమైన గ్రంథాలను నిషేధించవలసి యుండును. విశ్వవిద్యాలయంలో గ్రంథములు లేకున్నంత మాత్రముననే విద్యార్థులకు సోషలిస్టు సిద్ధాంతములు అలవడకపోజాలవు. ప్రపంచవాతావరణమును ఈ స్వల్పకార్యములతో అరికట్టగలమని రెడ్డిగారు తలంచుట ఆశ్చర్యకరముగనున్నది. పంచాంగములుపోయిన నక్షత్రములుఃపోవునా? సముద్రమును వెనుకకు మరలిపోవలెనని పూర్వము ఉత్తర్వు జేసిన కెన్యూటను ఆంగ్లరాజునకు బదులు నేడు రెడ్డిగారు ఆంధ్ర యూనివర్సిటీలో వెలసినాడు.” 43

యేమైతేనేం, శాసనమండలి సభ్యుడుగా అనాటికి వొక్క సి. ఆర్. రెడ్డి మాలపల్లి నవలను నిషేధించడంపట్ల ఆ మాత్రం నిరసనను ప్రకటించడం, జస్టిస్ పార్టీ 'సమీపవర్తి'గా వుంటూ ఆ మేరకు ప్రతిఘటించడం ఆశ్చర్యంగానే వుంది. భావ, రచనా స్వాతంత్ర్యాలకోసం గాకపోయినా, వొక మహాగ్రంథాన్ని నిషేధించారనే ఆవేదనే ఆయనచేత యీ పని చేయించిందనుకోవాలి.

సి. ఆర్. రెడ్డి జాబు అందుకొన్నమీదట్నే సి. పి. రామస్వామి అయ్యర్ చీఫ్ సెక్రెటరీకి వొక ఆదేశం పంపాడు- మొత్తంఫైల్‌ను తన ముందు పెట్టమని కోరాడు. ఫైల్ అంతా చూచి "seen, no further action is called for at present" అని ప్రభుత్వ నిషేధాన్ని ధృవీకరిస్తూ వ్రాశాడు.

43. 11-6-1937 జమీన్‌రైతు (నెల్లూరు) పత్రిక సంపాదకీయం.

# పత్రికల్లో సమీక్షలు, సంపాదకీయాలు, లేఖలు

మాలపల్లి నవల మొదటిభాగం ప్రచురణై విడుదలైంది 1922 నవంబర్ - డిసెంబర్‌లో. రెండోభాగం 1923 ఫిబ్రవరి - మార్చిలో వచ్చింది. ప్రభుత్వం 1923మే నెల మధ్యలో వీటిని నిషేధించింది.

మాలపల్లి నిషేధపువార్తను అప్పట్లో మన తెలుగు పత్రికలు యెట్లా స్వీకరించాయి? తెలుగు భావుకులు యెట్లా రియాక్టయ్యారు? యీ విషయాల్లోకి ప్రవేశించే ముందు, నవల విడుదలకూ నిషేధానికీ మధ్యకాలంలో, అంటే యీ నవల నిషేధింపబడుతుందనే విషయం తెలియకముందు తెలుగు పత్రికలు యీ రచనను యెట్లా పరిగణించాయి?

యిప్పుడంటే మన తెలుగు పత్రికలు అటు గుండెలుతీసిన బంటులై, యిటు గుండెల్లేని బండలై రాటుదేలిపోయి, కొన్నిరకాల పుస్తకాలను మంచివిగానీ చెడ్డవిగానీ - అసలు కనీస సమీక్షలైనా చేయకుండా మౌనం వహిస్తున్నాయి. నిమ్మకు నీరెత్తినట్లుగా వుండిపోతున్నాయి. The power of the Press is to suppress అన్నట్లుగా వ్యవహరిస్తున్నాయి. అప్పుడూ మన పత్రికలు యిట్లాగే వుండేవా?

నవల మొదటిభాగం వెలువడిన వెంటనే ఆంధ్ర (దిన) పత్రిక 1923 జనవరి 25 తేదీ సంచికలో వొక రచయితచేత ప్రత్యేకంగా సమీక్ష చేయించింది. నవల

లోని గుణదోషాలను పరిశీలన చేస్తూ నవలాకారుని మనసారా మెచ్చుకుంటూ వింజమూరి రంగాచార్యులు వ్రాసిపంపిన యీ క్రింది సమీక్షావ్యాసాన్ని ప్రకటించింది:

"ఉన్నవ లక్ష్మీనారాయణగారిచే వెల్లూరు జెయిలులో రచించబడ్డ మాలపల్లి లేక సంగవిజయం అనే గ్రంథంలో మొదటిసంపుటం ప్రకటింపబడ్డది. ఈ సంపుటమును ఆమూలాగ్రంగా చదవగా నాకు మహానందం కలిగింది. తెలుగుభాషలో నిజమైన గొప్ప ప్రతిభను చూపించే ఉత్కృష్టగ్రంథాలు బయలుదేరుచున్నవి గదా అని యెంతో సంతోషించాను. భాషయందూ శైలియందూ విషయమునందూ భావములయందూ విశేషించి రచనా శిల్పమునందూ కూడా యీ గ్రంథం తెలుగు నవలలలో కొత్తమార్గం తొక్కుతూవున్నది. గనక యీ గ్రంథాన్ని విపులంగా విమర్శించి గుణదోషాలు ప్రకటించడమువల్ల తెలుగు నవలాపాఠకులకు చాలా ప్రయోజనం వుంటుందని యోచించి ఉపోద్ఘాతప్రాయంగా యీ వ్యాసంలో యీ నవలలో వున్న కొత్త పోకడలను గురించి మాత్రం స్థాలీపులాక న్యాయంగా సూచిస్తాను.

"గ్రంథకర్త అయిన లక్ష్మీనారాయణగారు తెలుగు దేశానికి క్రొత్తవారు కారు. కడచిన యిరవైయైదు సంవత్సరములనుంచీ తెలుగుదేశంలో బయలు వెడలిన సమస్త సదుద్యమములలోను వీరు నాయకులుగా వుండి తదేక దీక్షతో పని చేసినవారు. వీరి స్వతంత్రబుద్ధీ, వీరి సంస్కారాభిలాషా, వీరి త్యాగశీలమూ, వీరి మానవసేవా దీక్షా, తెలుగు దేశంలో అనేకమంది యౌవనులకు ఆదర్శప్రాయంలై వున్నవి. నేటి వరకూ లక్ష్మీనారాయణగారి జీవితమంతా రెండు మాటలలో యిమిడ్చి చెప్పవలెనంటే త్యాగమూ సేవా అనే రెండు మాటలలో యిమిడ్చి చెప్పవచ్చును. గాంధీ మహాత్ముని సహాయనిరాకరణోద్యమం కలకత్తా కాంగ్రెసులో అంగీకరించబడగానే వీరు తమ బారిష్టరు న్యాయవాది వృత్తిని వదిలిపెట్టి ఆ మహోద్యమం కోసమని నిరంతరకృషి చేసి చివరకు పల్నాటి అడివి యిబ్బందుల సందర్భంలో ఒక సంవత్సరం విడి ఖయిదు అనుభవించి వచ్చారు. వీరు జెయిలులోవున్న దినములలో రచించిన నవలయే యిప్పుడు మనం విమర్శించబోతూవున్న మాలపల్లి లేక సంగవిజయం అనే నవల.

"మహాత్ముని ఉద్యమంలో అంటరానితనం తొలగించడమూ పంచముల అభివృద్ధీ, ముఖ్యాంశములలో వకటి అని అందరికీ తెలిసేవున్నది. మొట్టమొదటినుంచీ పంచముల వృద్ధి నిమిత్తం పాటుపడుతూవున్న లక్ష్మీనారాయణగారికి యీ విషయం యొక్కవ ముఖ్యంగా కనబడడములో ఆశ్చర్యంలేదు. నవల ప్రారంభమందే మాల

దాసరి అయిన రామదాసు పరవానికి ఆసన్నంగావున్న జొన్నపైరు వంక చూస్తూ 'ఇవ్వేళ యెండ చటపటలాడుతున్నది. ఈ వుబ్బకి సగం కంకి గింజ పోసుకుంటుంది. వెనుక చిక్కిన జాడూ జోడూ గూడా పండితేనేగాని పోలివుండదు. ముందు యెక్కి వచ్చిన యే పదికల్రలో పండితే యేమిప్రయోజనం? అందరూ బాగుంటేనే బాగు' అన్న వాక్యములలో గ్రంథకర్త అభిప్రాయం చక్కగా కనబడుతూవున్నది. అభివృద్ధి మార్గాలను గూర్చి లక్ష్మీనారాయణగారి అభిప్రాయం కథానాయకుడైన సంగడి వాక్యాలలో కనబడుతూనే వున్నది. చూడండి: 'అలగావాండ్లకు అన్నం దొరికేమార్గం చూపంది సాంఘిక హక్కులు యిచ్చినా ప్రయోజనకారులుగావు. అవి నిలుపుకునేశక్తి కూడా వారికుండదు.' యెంత సత్యము? పంచముల ఆర్థస్థితి బాగుపడే సాధనాలు కథారూపంగా ప్రదర్శించడమే యీ నవలయొక్క ప్రయోజనం.

"ప్రయోజనం వుద్దేశించి వ్రాసిన లక్ష్మీనారాయణగారు యీ గ్రంథాన్ని రాజకీయ వుపన్యాసంగా గానీ సాంఘిక వుపన్యాసంగా గాని మార్చివేయలేదు. యీ నవలలోని కథాభాగమూ రచనాశిల్పమూ కూడ చాలా హృదయాకర్షకంగావున్నవి. సత్తెనపల్లితాలూకా మాలపల్లెలోని జీవితం వీరు చాలా స్వాభావికంగాను యెంతో స్వానుభవంతోను చిత్రించారు. కులంలోనూ పేదరికంచేతనూ సంఘానికి అంతటికీ అట్టఅడుగున వున్నవాండ్ల జీవితంకూడా వున్నత వాఙ్మయంలో ప్రదర్శించడానికి అర్హమైనదని తెలుగువాఙ్మయ చరిత్రంలో మొట్టమొదటి పర్యాయం నిరూపిస్తూ వుండడంచేత, యీ గ్రంథం తెలుగువాఙ్మయచరిత్రలో ఒక క్రొత్తయుగం ప్రారంభిస్తూవున్నదని రూఢిగా చెప్పవచ్చును. మాలవాండ్ల వూరిగుడిసెలయందూ, నులక మంచములయందూ, సజ్జసంకటులందూ, గొడ్లకాయడమందూ, వూచబియ్యములందూ, యేలపాటలయందూ కూడా వాఙ్మయ యోగ్యమైన పరికరం వున్నదని లక్ష్మీనారాయణగారి పేరు తెలుగు వాఙ్మయంలో శాశ్వతస్థాయిగా బంగారు అక్షరములతో వెలుగుతూ వుండు ననడముకు సందేహంలేదు. మాలవాండ్ల జీవితమందు కేవలం కనికరమూ స్వానుభవమూ కలిగి వుండడమేకాక లక్ష్మీనారాయణగారికి వాళ్ళ జీవితంలో తియ్యదనమూ, రుచీ, ప్రేమా కూడా వున్నట్లు కనబడుతున్నవి. వారి జొన్నచేలు, వారి పైరగాలలు, వారి యేలపాటలు, వారి తత్వాలు, లక్ష్మీనారాయణగారిని యెంతో వలపిస్తూవున్నవి. కులం తక్కువ అయినా, కడుపునిండా అన్నం, వంటినిండా గుడ్డలేకపోయినా, మాలవాళ్ళయందు గూడా వున్నతగుణములూ గొప్పశీలమూ వుంటవని లక్ష్మీనారాయణగారు చూపుతున్నారు. రామదాసుపాత్ర గంభీ

రంగా చిత్రించబడ్డది. 'మంచిచెడ్డలు లోకమందున యెంచిచూడగ రెండే కులములు మంచియన్నది మాలయైతే మాలనే యగుదున్' అన్న గురజాడ అప్పారావుగారి గీతంలోని భావం లక్ష్మీనారాయణగారికి బాగా నచ్చినట్లువున్నది. 'మణిస్థగిత ధర్మకిరీటధారులైన చక్రవర్తులకు అనుభవింపరాని మహదానందమును దేహం వొరుసుకొని పోవు నులకమంచమున నుయ్యాలలూగే మాలదాసరి చూరగొంటున్నాడు' అని కనిపెట్టగలిగిన గ్రంథకర్త నిజంగా ధన్యుడు.

"మాలపల్లెలోని సామాన్యమైన ప్రతిదిన జీవితం చిత్రించడంలో లక్ష్మీనారాయణగారు కేవలం యథార్థస్థితినే వర్ణించే పద్ధతి అవలంబించినారు. కథావైచిత్రం కోసమనికానీ, తాను వుద్దేశించిన ప్రయోజనానికి అనుకూలంగా వుండడముకు కానీ పాఠకుల రుచి దృష్టియందుంచుకొని కాని గ్రంథకర్త కథనుగానీ వర్ణనలనుగాని నడుపుటకు ప్రయత్నించలేదు. వీరి రచనాపద్ధతి పాశ్చాత్య నవలాకారులలో 'realistic school' అని పిలవబడే వారి పద్ధతిని పోలివున్నది. వీరి వర్ణనలు టాల్స్టాయి గ్రంథాలలోని వర్ణనలను జ్ఞప్తికితెస్తూవున్నవి. ఇతర విషయములందు కొంచమైనా దృష్టి నిగుడ్చక కేవలం ప్రతిదిన జీవితంయొక్క యదార్థస్థితినే కథలోనూ వర్ణనలయందూ చిత్రించడములో యీ గ్రంథం తెలుగు వాఙ్మయంలో కొత్త దారి తొక్కుతూవున్నది. బంకించంద్రుని బంగాలీ నవలలుకాని మన తెలుగుభాషలోని రాజశేఖర చరిత్రం, రామచంద్ర విజయం వగైరా నవలలుకాని యీ విషయంలో లక్ష్మీనారాయణగారి పుస్తకానికి యీడురావు.

"లక్ష్మీనారాయణగారు యీ గ్రంథం వాడుకభాషలో వ్రాశారు. వాడుకభాషలో గ్రంథములు వ్రాయవచ్చునా కూడదా అని చర్చలుచేసే దినాలు గడిచిపోయినవి. ఇప్పుడు వాడుకభాషలో వ్రాసే పత్రికలే రెండు మూడు తెలుగులో బయలుదేరినవి. కాని నాకు తెలిసినంతవరకూ నాటకరూపమైన 'కన్యాశుల్కం' మినహాయించగా వాఙ్మయంలో శాశ్వతంగా నిలవడానికి ఆశించే గ్రంథం పూర్తిగా వాడుకభాషలో వ్రాయబడడముకు ఇదే మొదటిపర్యాయం అని తలుస్తాను. ఈ విషయంలో కూడా లక్ష్మీనారాయణగారు నిర్భయంగా కొత్తదారితీశారు. ఇదివరకు వాఙ్మయంలోకి యెక్కని దేశ్యపదాలు యెన్నో లక్ష్మీనారాయణగారు తమ గ్రంథంలో ప్రయోగించారు. శైలి వొకటి రెండు స్థలాలలో కేవలం ప్రబంధశైలిలోకి దిగినా, మొత్తముమీద చాలా రమ్యంగాను రసవంతంగానూ వున్నది. సంభాషణలయందు అధికమైన సారళ్యం చూపుతూవున్నది. వీరు వ్రాసిన శబరీమోక్షణ కథ చదివితే

ప్రతికక్షులు కూడా వాడుక భాషయందు మహోన్నతములైన భావాలు గంభీరమైన శైలిలో వ్రాయడం అసంభవంకాదని అంగీకరించక తప్పదని నా నమ్మకము.

"మొత్తముమీద 'నవల' అని పెద్ద అక్షరములతో వ్రాయదగిన గొప్ప గ్రంథం తెలుగులో బయలుదేరినందుకు ఆంధ్రులు గర్వించవలసివున్నది. తక్కిన సంపుటాలు చూడవలెనని ఆంధ్రలోకం ఆతురతతో నిరీక్షిస్తూవున్నది. (వెల. 0-12-0 వలయువారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు, గుంటూరు అని వ్రాయవలెను).

—వింజమూరి రంగాచార్యులుగారు ఎం. ఏ. బి. యల్."

యింత పొందికైన సమీక్షావ్యాసం చదివిన తర్వాత మరొకటి చూడనవసరం లేదేమోననిపిస్తుంది. కానీ యీ సమీక్ష ప్రకటించడానికి దాదాపు నెలముందే యిదే ఆంధ్ర (దిన) పత్రిక 1922 డిసెంబర్ 20 తేదీన యించుమించు 2½ కాలాల పర్యంతం (పేజీకున్న స్థలం అప్పట్లో 3 కాలాలు మాత్రమే) విస్తరించిన పరిచయ పూర్వకమైన వ్యాసమొకటి ప్రచురించింది. ఆవకతవక రచనే అయినా యిందులో నుంచి మచ్చుకు కొన్నిభాగాలు :

> "సంగవిజయము లేక మాలపల్లి. గ్రంథకర్తలు శ్రీయుతులును సుప్రసిద్ధ దేశభక్తులునగు బారిస్టరు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, గుంటూరు పత్రికా సంపాదకులు, గుంటూరు. వెల అనారాధితము.

"ఇయ్యది యిరువది యైదధ్యాయములుగల చక్కని సాంఘిక నవల. దీనిని రచించినవారు సుప్రసిద్ధులును అద్వితీయ దేశభక్తులును సంఘ సంస్కారప్రియులును అగు శ్రీశ్రీయుతులు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు. ఇందు కూర్పబడిన కథ ప్రస్తుతాంధ్రదేశమునకు సంబంధించినగాథ. పంతులుగారిందు ప్రజాసామాన్యము నందు వాడుకలో నుండుటకును స్వోద్దిష్టమగు సంఘ సంస్కరణమును సంపూర్తి గావించుటకునై కాబోలును వాడుకభాషను వాడియున్నారు. కాని, అత్యంతిక పరిచయాభావముననో, లేక ప్రాథమికయత్నమగుటనో వాడుకభాష కొన్నిచోటు లందు వాడుకకు భిన్నముగను అర్థము చేసికొనుటకు క్లిష్టముగను నుండి యతుకుడల పొంకముగ గుదిరినదికాదు. అయినను గ్రంథరచనా సందర్భమున నేమి పాత్రౌచితిని గమనించుటలోనేమి ఆనుషంగికములగు నితర సందర్భములను పొందించుటలోనేమి—

ఇంకను ఇట్టి విషయములలో పెక్కింటిలో ఈ గ్రంథకర్తగారు ప్రదర్శించిన ప్రకృష్టమగు మతివైభవమును లోకజ్ఞతయును సమయస్ఫూర్తియును మున్నగునవి ఈ విషయమును బయలు పడనీయకుండుటయేగాక యొక విధమగు అనల్పమగు శిల్పమును సైతము సుదోబ్ధింపచు పాఠకుల హృదయమును ఆవర్జించుచున్నవి...

"...అయినను శ్రీయుతులగు లక్ష్మీనారాయణపంతులుగారు ఈ స్వల్పమగు కథాంశమునకు అనల్పములగు కల్పనములు తోడుపఱచి అమోఘమును అద్వితీయమును అనితర సాధారణమును అగు విశాలరూపమును సృజించి తదనుకూలములును తదుజ్జీవికములనందు నింపి మాలపల్లెను మునిపల్లెగా మనకు సందర్శింపజేసినారు. ఇందులకై యాంధ్రులు సర్వథా పంతులుగారి యెడల కృతజ్ఞత జూపకతప్పదు...

"...గ్రంథకర్తగారు...ప్రదర్శించిన భావప్రదర్శనములు ధర్మ యుద్ధమున పాల్గొనుచున్న నేటి ధర్మయోధులకెల్లను నిత్య సంస్మరణీయములును ధ్యేయములును గేయములునునై యుండగలవని యెంచెదను..."

యిట్లాగే నవల రెండో భాగం విడుదలైన వెంటనే 1923 మార్చి 3న దాన్ని సమీక్షించింది ఆంధ్రపత్రిక: "...ఇప్పుడు రెండవ సంపుటమును కృతజ్ఞతతో నందుకొని చదువ చదువ లక్ష్మీనారాయణగారి ప్రజ్ఞాకౌశలములను స్వతంత్ర రచనా సామర్థ్యమును మరియు మరియు విదితము కాసాగెను. ఆంధ్రలోకమున నవలారచనయందు స్వతంత్రశక్తిని చూపుచు ఆంధ్ర నైసర్గిక జీవకళలను సంఘాచారములను, వర్ణ సంప్రదాయములను మానవ ప్రకృతులను అద్వితీయముగ చిత్రింపగలిగినవారు వీరొక్కరు తక్క నింతవరకు వేరెవ్వరును కనంబడుట లేదనుట యందెట్టి అతిశయోక్తియును లేదనుట నిశ్చయము...ఇట్టి సహజదృశ్యముల నెన్నిటినో లక్ష్మీనారాయణగారు నవలాపటమున నత్యద్భుతముగ చిత్రించిరి. సందర్భానుసారముగ నాటక ప్రదర్శనము గూర్చి పెక్కు విషయముల తెలిపిరి. ఇతివృత్త నిర్మాణమందీ కవిబ్రహ్మ అద్భుతసృష్టి గావించెను. ఏకవత్సర కారాగృహవాసమునకు లక్ష్మీనారాయణగారు పాలగుటయే యీ నవలా నిర్మాణమునకు కారణమగుటచే శిక్షవిధించినవారి సంకల్పమెట్టిదైనను ఫలితము మాత్ర మాంధ్రులకు మహోపకారమే యైనది."

నవల నిషేధించబడిందన్న సెన్సేషనలిజం తాలూకు కలవరం యేర్పడక ముందే వొక ముఖ్యరచనగా, గొప్ప సాహిత్య సంఘటనగా దీన్ని మన తెలుగు

పత్రికలు, భావుకులు యెట్లా స్వీకరించారనేదానికి పై అభిప్రాయరచనలు వొక దర్పణంగా స్వీకరించవచ్చు.[44]

యిక నవలను ప్రభుత్వం నిషేధించిందన్నవార్త పొక్కిన తర్వాత అటూ యిటూ ఆవేశకావేశాలు బయలుదేరడమనేది సహజమే. ప్రభుత్వచర్యను గర్హిస్తూ శివమెక్కినట్లు వ్రాసే పత్రికలకూ, ప్రభుత్వం భేషైన పనిచేసిందనే స్వామి భక్త హనుమాన్‌లు పాలకవర్గపు భావజాలానికి తమ తలల్ని తాకట్టుపెట్టుకుని వ్రాసే పత్రికలకూ మనకెప్పుడూ కొదవలేదు. యిక్కడ కూడా వొకమాట చెప్పుకోవాలి. నిషేధవార్తలను కనీసం వార్తలుగానైనా ప్రకటించే దమ్ములేని పత్రికలు మన కిప్పుడు దండిగానే వున్నాయి– యెమర్జన్సీ ముందు కూడా యీ తాకట్టు పరిస్థితి మనకు కొత్తకాదు.

నవలను నిషేధించిన మరుక్షణాన్నే ఆంధ్ర (దిన) పత్రిక 1923 మే 17 న వార్తతోబాటు, ప్రభుత్వ చర్యను గర్హిస్తూ తన సహజధోరణిలో సంపాదకీయాన్ని వ్రాసింది:

"...అధికారుల దృష్టికిది ఎటుల గనుపించినను, సామాన్యపాఠకుల దృష్టికి రాజద్రోహము ఏమాత్రము గోచరింపజాలదు. ఇది కేవల సాంఘిక నవలయనియు విదితమగును. కాని అనుమానగ్రస్తులకు రాజకీయవాసన గనుపించుట ఆశ్చర్యకరము గాదు. సాంఘిక రాజకీయ, మత సంబంధమగు యుద్యమములన్నిటికిని స్వేచ్ఛయు, స్వాతంత్ర్యమును మూలాధారములు. జీవుని బంధమునుండి తొలగించుమార్గమును, మతము అన్వేషించును. సంఘమును ఉన్నతస్థితికి దెచ్చుమార్గము, సాంఘికోద్యమము లన్వేషించును. స్వరాజ్యసిద్ధిని గలుగజేయుమార్గములను రాజకీయోద్యమ మన్వేషించును. స్వేచ్ఛను పొందుటయే, ఈ యుద్యమముల కన్నిటికిని సామాన్యాశయము. అందుచే సంగదాసు తన కులమును ఉద్ధరించుటలో ప్రాణమును సైతము కోల్పోవుట, స్వాతంత్ర్య భావమున్నతికి ప్రబల నిదర్శనము. ఇది కేవల సాంఘికోద్యమయినను, దీనియందు అధికారులకు రాజకీయవాసన గొట్టుట వింతగాదు. ప్రస్తుత పరిపాలనా విధానముక్రింద, ఇట్టి యుద్గ్రంథములను అణచివైచుటయందు ఆశ్చర్యములేదు. గ్రంథ

---

44. సాక్షాత్తు జస్టిస్‌పార్టీవారి వుంపుడుకత్తెలుగా చెలామణిలో వుండిన 'సమదర్శిని న్యాయదీపిక'వంటి పత్రికలు యీ నవలపైగానీ, దీని నిషేధంపైనగానీ యేమి వ్రాసుంటాయో పరిశీలించడం అవసరమేగానీ ఆ పత్రికలు భద్రపరచిన వారేరీ యీ తెలుగుదేశంలో?

కర్త ఆంధ్రుల సంఘస్థితిని కనులకగట్టినటుల వర్ణించి, ఆంధ్ర నవలారచనయందు నూతన మార్గమును ద్రొక్కెను. వాడుకభాషయందు గ్రంథమునంతను రచించి, క్రొత్త శైలి ననుకరించెను. ఆంధ్రవాఙ్మయమునకు క్రొత్త యలంకారమును జేర్చి, లక్ష్మీనారాయణపంతులుగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయిరి. కాని దీని వ్యాపకమును ప్రభుత్వము వారరికట్టిరి. మానవ స్వాతంత్ర్యరక్షణకు ఎటుల భంగము వాటిల్లుచున్నదియు, ప్రజలిందు మూలమున గ్రహింపవచ్చును. సత్యరస్వరాజ్య సిద్ధివలననే, స్వాతంత్ర్య రక్షణము గుదురును. ఇట్టి నిరోధములన్నియు, ప్రజలను స్వాతంత్ర్య సంపాదనకధికముగ ప్రోద్బలపరచునని విశ్వసించెదము.''

యీ వాక్య సంపాదకీయంతో తృప్తిపడకుండా పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి పంపిన సుదీర్ఘ నిరసన ప్రకటనను కూడా అదే సంచికలో ప్రచురించింది. పంచాగ్నులవారి ప్రకటన యిది:

"[ఆంధ్ర పత్రికాధిపతిగారూ! ఈ చిన్న యుత్తరమునకు తావొసంగి సానుభూతిని చూపవేడెదను.—పం. ఆ. శాస్త్రి.]

''నిన్నటి గజెటునందు మాలపల్లి అనుగ్రంథమును గుఱించిన ప్రభుత్వమువారి నిషేధపుటుత్తరువును చూడగనే నా హృదయము నీరైపోయినది. అయ్యయ్యో! ఆంధ్రభాషామతల్లి దురదృష్టము నేమనిచెప్పగలను. ఈ కాలములో రసవత్తరములైన గ్రంథములు వ్రాయగలవారే లేరు. ఉన్నను పూజా పురస్కారములులేక మూలలబడి మూల్గుచున్నారు. అందునను సాంఘిక పరిస్థితులను– తత్రాపి కార్మికుల క్లేశములను నిష్పక్షపాత దృష్టి గట్టినట్లు రూపింపగల మాలపల్లివంటి గ్రంథములను వ్రాయు దేశభక్తులు చాల తక్కువ. సౌభాగ్యవశమున లక్ష్మీనారాయణపంతులుగారి వంటి నాయకమణులు ఇట్టిపనికి బూనినారుకాని దుర్దైవ విలసితమున కెవ్వరేమి చేయగలరు?

''మాలపల్లి సాంఘికనవల. అందునను పంచమాభ్యుదయమునకు మూలకందము. ఈనాటి కార్మిక సమస్యయొక్క స్థితిగతుల నరయుటకు దివ్యదర్పణము. నిమ్నజాతుల యభ్యున్నతికి అసాధారణమగు అమృతఘటిక యన్నను తప్పుకాదు. సారస్వత విషయముననేమి–సౌభ్రాత్ర విషయముననేమి–సర్వసమత్వ విషయముననేమి–దైవభక్తి రాజభక్తి మున్నగు విషయములలోనేమి అద్వితీయమైన గ్రంథము. కాదు కాదు గ్రంథ

కాజమున వలయును. ప్రభుత్వము నెడల గాని తత్ప్రాభవము నెడల గాని వాఙ్మాత్రముగ నైనను పారుష్యమును చూపునట్టి గ్రంథము ఎంతమాత్రము కాదు. ఒక్క కాక పోవుటయే గాక, వేయి ప్రభుత్వములైనను చేయలేని- అనగా నుత్పాదింపజేయజాలని, శమదమాది విజ్ఞానమును- శక్త్యుత్సాహసంపదను-దివ్యతేజమును-చేకూర్చి ప్రజలలో చక్కని సుస్థితిఁ గల్గింపగల యుత్తమోత్తమమగు గ్రంథము. ఒక దేశమువారు- అందునను ఒకజాతివారు- హెచ్చుతగ్గులుగాని కులభేదమునుగాని లేకుండ స్వీకరించి ప్రేమించు గౌరవించు గ్రంథమును- నిషేధించుటయనఁగా కేవలము సారస్వత వినాశమును జేయుట యట్లుండగా-ఆ జాతినంతను సంఘమరణమును నొందించుటయే యగును.

“అయ్యో! ఇంతవఱకును రాజకీయముగ మాత్రమే ప్రభుత్వపు నిరంకుశత వెల్లడియగుచుండెడిది. ఇప్పుడు సాంఘిక సారస్వత విభాగముల పైన గూడ ఆ మహా రథము ప్రచండవేగముతో పరుగిడునట్లున్నది! ఆహా! ఏమి కాలమహిమము. రాజకీయ స్వాతంత్ర్యముతోఁబాటు సాంఘిక సారస్వత స్వాతంత్ర్యములు గూడ నిర్బంధమునకు పాల్పడవలసిన దురవస్థను తెచ్చిపెట్టితివా! దీన బంధూ!

17-5-23 }
చెన్నపురి }

పంచాంగ్నుల* ఆదినారాయణశాస్త్రి”

మళ్ళీ మాలపల్లి మూడో భాగాన్ని నిషేధించినప్పుడు కూడా, వార్తనూ యెడిటోరియల్‌నూ ప్రకటించింది ఆంధ్రపత్రిక.[45]

---

*sic. ‘పంచాగ్నుల’ అని వుండాలి. రెండో సున్న అచ్చుతప్పుగా వచ్చివుండొచ్చు.

45. ఆంధ్ర పత్రిక వ్రాతలుసరే. మరి కృష్ణాపత్రిక సంగతి? నా వుద్దేశంలో కృష్ణాపత్రిక వొక్క సంపాదకీయమైనా వ్రాయకుండా వుండదు. పదిహేనేళ్ళక్రితం గాడిచర్ల హరి సర్వోత్తమ రావు సంపాదకీయంపై బ్రిటీష్ ప్రభుత్వం తెచ్చిన సెడిషన్‌కేసులో అంత దీర్ఘమైన ఘాటైనవ్రాతలు వ్రాసి అంత రగడచేసిన కృష్ణాపత్రిక యీ విషయమై మౌనం వహిస్తుందా? ప్రభుత్వ ట్రాన్స్‌లేటర్ల న్యూస్‌పేపర్ల రిపోర్టులనుబట్టి చూస్తే 1923 మే నెల 26 కృష్ణాపత్రికలో మాలపల్లి నిషేధంపై ‘సుదీర్ఘలేఖ’ వొకటి అచ్చయినట్లున్నది [చూడు: తమిళనాడు ఆర్కైవ్స్‌లోని ‘న్యూస్ పేపర్ రిపోర్ట్స్’ తర్జుమాల ఫైల్, 1923 మే—జూన్, పేజీ 699]. నా అందుబాటులోవున్న నెల్లూరు టౌన్‌హాల్ లైబ్రరీలో 1923 సంవత్సరంనాటి కృష్ణాపత్రికల ఫైల్ వుందిగానీ సరిగ్గా మనకు కావల్సిన మేనెల సంచికల్లో చాలా పేజీలులేవు. నా తృప్తితీరలేదు. హైదరాబాద్ యింట

యికపోతే ప్రకాశంపంతులు యింగ్లీషుపత్రిక 'స్వరాజ్య' నిషేధాన్ని నిరసిస్తూ యెడిటోరియల్ వ్రాసింది. యీ యెడిటోరియల్ కటింగ్ అదృష్టవశాత్తు ప్రభుత్వ ఫైల్లోనేవుంది (చూడు: అనుబంధం_7).

---

ర్నేషనల్ తెలుగు యిన్‌స్టిట్యూట్‌వారివద్ద కృష్ణాపత్రికల మొత్తంఫైల్స్ కొనిపెట్టారని తెల్సి అక్కడకు వెళ్ళాను. మన రాష్ట్రి ఆర్కివ్స్‌వారు పట్టించుకోకపోయినా న్యూఢిల్లీలోని నెహ్రూ మ్యూజియమ్ లైబ్రరీవారు వాటిని మైక్రోఫిల్మ్ చేయించుకొని అప్పుడే తిరిగి పంపారటగానీ నే వెళ్లినప్పుడు అందుకు సంబంధించిన అధికారులు దీర్ఘ కాలపు సెలవుమీద వెళ్లినందువల్ల చూచే అవకాశం లభించిందికాదు. భావి పరిశోధనలో యిది సఫలంకావచ్చునని ఆశిస్తున్నాను.

# కౌన్సిల్‌లో ప్రశ్నల వర్షం

మాలపల్లి నవలను నిషేధించిన నాలుగు సంవత్సరాలకుగానీ శాసనమండలిలో దానిపై చర్చజరగలేదు. ప్రశ్నలవర్షం కురవలేదు. అప్పటికైనా జరిగినందుకు సంతోషించాలి.

1920 లో మాంటేగు-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ప్రకారం తొలిసారిగా యెన్నికలు జరిగినప్పుడు కాంగ్రెస్‌వాళ్లు సహాయ నిరాకరణపేరుతో 'రాజకీయ సన్యాసం' పుచ్చుకొని యెన్నికలను బహిష్కరించడం, 1923 యెన్నికల్లో సైతం కాంగ్రెస్ భీష్మించుకొని కూర్చోవడంతో, కాంగ్రెస్ సోదరులు కొందరు, 'అభిమానులు' మరికొందరు పోటీచేసి నెగ్గి శాసనమండలిలో కొన్ని స్థానాలు ఆక్రమించు కోగలిగారు. 1926 యెన్నికలు వచ్చేసరికే కాంగ్రెస్‌కు తాను పెట్టుకున్న 'సహాయ నిరాకరణ' భ్రమలు తొలగిపోయాయి. అధికారపు రుచి మరిగి వ్యూహం మార్చుకో వలసీ వచ్చింది. ముసుగు తొలగించుకొని కాంగ్రెస్‌వాళ్లు బహిరంగంగానే పార్టీ తరఫునే యెన్నికల్లో పోటీచేశారు. బాగానే సీట్లు గెల్చుకొన్నారు. వీరి గెలుపుతో శాసనమండలి స్వరూపం మారిపోయింది. స్వభావమూ కొంత మారిపోవలసి వచ్చింది.

మంత్రి పదవులు పుచ్చుకోవల్సిందిగా కాంగ్రెస్‌వారిని కోరాడు గవర్నర్. కానీ పదవులు స్వీకరించక కొత్తరకం 'సహాయ నిరాకరణం' చేశారు. కాంగ్రెస్ 42, జస్టిస్‌పార్టీ 16, జాతీయవాదుల పార్టీ 12, కొందరు స్వతంత్రులు, ప్రభుత్వ నియమితులు 32- యిదీ మొత్తంమీద అప్పటి మద్రాసు శాసనమండలి స్వరూపం.[46]

---

46. అయ్యదేవర కాళేశ్వరరావు 'నా జీవితచరిత్ర'లో యిచ్చిన వివరం యిది. **E. F. Irschick** తన గ్రంథంలో యిచ్చిన లెక్క మరో రకంగా వుంది—స్వరాజ్యపార్టీ 41,

రాజీగా కాంగ్రెస్‌వాళ్లు సహకారం యిచ్చేపద్ధతిలో వొకప్పటి జస్టిస్‌పార్టీ యేుడైనా, అప్పటి జాతీయవాద స్వతంత్రుడుగా గెల్చిన పి. సుబ్బరాయన్ 'ముఖ్య' మంత్రిగా గద్దెమీద కెక్కాడు. గవర్నర్ యెక్సిక్యూటివ్ కౌన్సిల్‌లో సి. పి. రామస్వామి అయ్యర్ ప్రభ యింకా వెలిగిపోతూ ముఖ్యుడుగా చెలామణిలో వుంటున్నాడు.

శాసనమండలి సమావేశాలు 1926 డిసెంబర్ మధ్యలోనే ప్రారంభమైనా 1927 మార్చిదాకా మాలపల్లి విషయం ప్రస్తావనకు రాలేదు. 1926 మార్చి 30 తేదీ సమావేశంలో అయ్యదేవర కాళేశ్వరరావు పంపిన ప్రశ్నకు రామస్వామి అయ్యర్ సమాధానం చెప్పుకోవలసి వచ్చింది. సత్యమూర్తి, గాడిచర్ల హరి సర్వోత్తమరావు ఆ తర్వాత సప్లిమెంటరీ ప్రశ్నలతో యెదుర్కొన్నారు. సి. పి. రామస్వామి అయ్యర్ మేకపోతు గాంభీర్యం అర్థమైపోయింది.

రాజద్రోహ నేరం కిందకు వచ్చేభాగాలున్నాయని నవలను నిషేధించామన్నప్పుడు ఆ నేరంకింద ప్రభుత్వం రచయితను యెందుకు ప్రాసిక్యూట్ చేయకుండా దొంగచాటుగా దాక్కొన్నది? అట్లా ప్రాసిక్యూట్ చేస్తే కోర్టు యెదుట తమ బలహీనతలు బయటపడ్తాయని ప్రభుత్వం తటపటాయిస్తున్నదా? దమ్ములుంటే రచయితను ప్రాసిక్యూట్ చేసి చూడండి—అని సత్యమూర్తి తగులుకొన్నాడు.

యిటువంటి ప్రాసిక్యూషన్ కేసులో తాను స్వయంగా యిరుక్కొన్నవాడు గాబట్టి, అంతకు దాదాపు యిరవైయేళ్ళక్రితం తన 'స్వరాజ్' పత్రికలో అప్పరాల్ వొక యెడిటోరియల్ వ్రాసినందుకు మూడు చెరువులనీళ్లు తాగి మూడేళ్ళ జైలుశిక్ష అనుభవించినవాడు కాబట్టి గాడిచర్ల హరి సర్వోత్తమరావు చర్చను మరోవైపుకు తీసుకెళ్ళి సంసారపక్షంగా వాదించాడు. ప్రభుత్వం అసలు నవలలో వున్నవని చెప్పే అభ్యంతరకరమైన భాగాలేమిటో రచయితకు తెలియజేశారా? వాటిపై రచయిత అభిప్రాయమేమిటో తెలుసుకోడానికి ప్రభుత్వం ప్రయత్నించకూడదా?— అని వొక రాజీమార్గాన్ని సూచించాడు.

ఆఖర్లో అయ్యదేవర యీ రాజీమార్గాన్ని అందుకొని ముక్తాయింపుగా వొక సూచనచేశాడు: ప్రభుత్వ అడ్వకేట్ జనరల్‌ను రచయిత కల్సుకొని అభ్యంతర

జస్టిస్‌పార్టీ 22, స్వతంత్రులు 36. David Arnold వ్రాసిన The Congress in Tamilnad: Nationalist Politics in South India 1919—1937 (న్యూఢిల్లీ, 1977) అనే గ్రంథం (పేజీ 102) లో యిచ్చిన లెక్క మరోవిధంగా వుంది: కాంగ్రెస్ 41, స్వతంత్రులు 36, జస్టిస్‌పార్టీ 21.

భాగాలను గూర్చిన వ్యవహారాన్ని సెటిల్ చేసుకోడానికి ప్రభుత్వం అంగీకరిస్తుందా? అని అడిగాడు. ప్రభుత్వం కోరుకుంటున్నదికూడా సరిగ్గా యిదేనని సి. పి. రామస్వామయ్యర్ సమాధానం చెప్పాడు.

శాసనమండలిలో మాలపల్లి నిషేధం విషయమై జరిగిన చర్చమూలంగా ఒక విషయం తేలింది. ప్రభుత్వం దృష్టిలో మొత్తంమీద యీ నవలలో ఆరేడు అభ్యంతరకరమైన భాగాలు మాత్రమే వున్నాయనీ, రచయితకు వాటిని తెలియపర్చాలనీ, ఆ భాగాలను తొలగించో లేదా తగు విధంగా మార్పులు చేసో సర్దుబాటు చేయడానికి రచయిత అంగీకరిస్తే పునర్ముద్రణకు అవకాశం వుంటుందనీ తేలింది ('అసెంబ్లీ' ప్రశ్నోత్తరాలకు చూడు: అనుబంధం-8)

తొలుత అడ్వకేట్ జనరల్ ప్రభుత్వానికి సమర్పించిన రిపోర్ట్‌లో మొత్తం 21 అభ్యంతరకరమైన భాగాలను పేర్కొంటే, రామస్వామయ్యర్ వాటిని ఆరేడింటికి కుదించి చెప్పవలసిన అవసరమేమొచ్చింది?

నవలను నిషేధించిన నాటికీ యిప్పుడు శాసనమండలిలో యీ సమాధానాలు చెప్పే నాటికీ మధ్యకాలవ్యవధి నాలుగేళ్ళు వుండడంవల్ల, రామస్వామయర్ మరిచిపోయి అట్లా చెప్పాడనుకొందామా? లేక యీ మధ్యకాలంలో ఆయనలో పునరాలోచన జరిగి యీ కుదింపు లెక్కవచ్చిందా? యిదే జరిగుంటే దీనికి కారణమేమై వుంటుంది? సి. ఆర్. రెడ్డి బాబు తర్వాత 'నేపథ్యం'లో యిద్దరిమధ్యా సంభాషణ లేమైనా జరిగి పునరాలోచనకు దారి తీసిందా? యిప్పట్లో యేమి చెప్పడానికీ మన వద్ద ఆధారాలేమీ లేవు.

యిక పోతే సందర్భం వచ్చింది కాబట్టి యిక్కడ మరో విషయం ప్రస్తావించవలసివుంది. యిటీవల బెజవాడలో శ్రీ దిగవల్లి వెంకటశివరావు, గూడూరు నమశ్శివాయ వంటి ఆధునికాంధ్ర సాహిత్యాది చరిత్ర విషయజ్ఞులతో మాట్లాడుతుంటే, వారొక విషయం చెప్పారు. వున్నవ నవల మాలపల్లి నిషేధం వెనుక స్పష్టంగా ప్రభుత్వంపై స్థానిక జస్టిస్‌పార్టీ కమ్మ భూస్వాముల వొత్తిడి యేదో వొక స్థాయిలో పనిచేసివుండాలని, భూస్వామ్య వర్గ ప్రయోజనాలను దెబ్బతీసే విధంగా యీ నవలలో పెక్కు పాత్రలు, సన్నివేశాలు కల్పించబడడమేగాక, భూస్వామి చౌదరయ్య కోడలు వొక యువకుడితో లేచిపోయే సన్నివేశం కూడా వుండడం యీ నవలపట్ల వారి కోపానికి మరొక కారణం కావచ్చునని కూడా మా మధ్య జరిగిన చర్చల్లో సూచనప్రాయంగా ప్రస్తావనకు వచ్చింది.

ఈ నవల నిషేధం వెనుక రాజకీయంగా యిటువంటి భూస్వామ్య వొత్తిడి పనిచేసివుంటుందనుకోడానికి, కనీసం అట్లా అనుమానపడడానికి యీ ఫైళ్ళలో యెక్కడా ఆధారమేదీలేదు. కానీ చరిత్ర పరిశోధనలో ప్రభుత్వ ఫైళ్ళలో వున్నది మటుకే సత్యమనుకోడానికిగానీ, సంపూర్ణ సత్యమనుకోడానికి గానీ లేదు. వొక ప్రభుత్వం యెప్పుడుగానీ చేసే రాజకీయమైన నిర్ణయం వెనుక యేకకాలంలో అనేక అంశాలు సహజంగానే తోడైవుంటాయి. బహుళ కారణాలు కలగలిసి వుంటాయి. యిటువంటి చరిత్ర విషయాల్లో సమగ్రమైన సమస్తమైన సత్యనిరూపణకు నిర్ధారణకు ప్రభుత్వ ఫైళ్ళను దాటి పలుమార్గాలలో బహుముఖాలుగా పరిశోధన సాగించి విషయ పరిశీలన చేయవలసివుంటుంది. కొన్నికొన్ని సందర్భాల్లో మనకు లభించిన ప్రభుత్వ ఫైళ్ళను పూర్తిగా తిరస్కరించికూడా యీ పరిశీలన సాగవలసివుంటుంది. యిటువంటి బహుళ విషయ సేకరణకు ప్రస్తుతం బంగారెకున్న వ్యవధి స్వల్పమే. అయినా యీ ఫైళ్ళలో దర్శన మిస్తున్న కొన్ని అంతర్గత వైరుధ్యాల (internal contradictions) మూలంగా కొన్ని ప్రశ్నలను లేకెత్తవలసి వుంటుంది. కొన్ని సూత్రీకరణలను రాబట్టవలసి వుంటుంది.

అయ్యదేవర కాళేశ్వరరావు ప్రశ్నకు సి. పి. రామస్వామయ్యర్ శాసనమండలిలో సమాధానం చెప్పిన తర్వాత మరొక అనుబంధ ప్రశ్న వేశాడు: 'ఆ నవల చదివిన మా బోంట్లకు అందులో రాజద్రోహకరమైన విషయాలేమీ లేనట్లు అనిపిస్తున్నది. అటువంటప్పుడు యెవరి పిర్యాదుమీద ప్రభుత్వం యీ నవలను గురించి విచారణ ప్రారంభించారో తెలుసుకోవచ్చునా?' అని అడిగాడు. దీనికి సమాధానం చెప్తూ సి. పి. రామస్వామయ్యర్ యిట్లన్నాడు: "We received a letter with regard to this matter and placed it before the legal advisers."

ప్రభుత్వానికి యీ నవల విషయమై జాబు వచ్చిందనడం యేమిటి? ఆజాబు వ్రాసిందెవరు? యెవరు యెవరికి వ్రాశారు? యేమని వ్రాశారు? ఫైలోపాఖ్యానంలో మనం గమనించిన క్రమోస్మీలనకూ 'We received a letter' అనే సమాధానానికీ యెక్కడా పొంతన కుదరడంలేదు. యీ జాబు గురించిన ప్రస్తావన మనకు లభ్యమైన అయిదారు ఫైళ్ళలో యెక్కడా యేమీ లేదు. యింకా వెలుగులోకి రాకుండా మరికొన్ని ఫైళ్లేమైనా వున్నాయా? యేమైనా, యింకా తవ్వకాలు తవ్వాల్సిన, పూడికలు తీయాల్సిన అవసరాన్ని యీ సి.పి. రామస్వామయ్యర్ సమాధానోదంతం సూచిస్తున్నది. సంపూర్ణ సత్యావిష్కరణకు అది అవసరం.

# ఫైల్ రథం మళ్లీ కదిలింది!

శాసనమండలి వేదికమీద యింత రచ్చజరిగిన తర్వాత రచయితను రాజద్రోహ నేరంకింద ప్రాసిక్యూట్ చేయడమా లేక వేరే విధంగా చర్య తీసుకోవడమా అని ఫైల్ మీద మళ్లీ తర్జన భర్జన జరిగింది. సి. పి. రామస్వామి అయ్యర్ ప్రభుత్వంచేసిన చట్టాలు దాని పరిమితులు యెరిగినవాడు గనుక ప్రాసిక్యూట్ వలయంలోకి దిగి ప్రభుత్వం కోర్టు యెదుటబడి లేనిపోని గొడవల్లో యిరుక్కోవడం, ప్రజలమీద వుండబోయే దాని ప్రభావం యెరిగినవాడు గనుక ఫైల్ మీద యిట్లా వ్రాశాడు:

> "The book is admittedly one of considerable literary merit, * but there are in it some objectionable and seditious passages. What I said was that if the author omitted those passages we may not object to publication of the book, but if the author or his misguided advocates in the Legislative Council tried to bluff us we may have to consider the question of prosecution. As I stated in my note ** I am not in favour of prosecution."

---

* చీఫ్ సెక్రెటరీ లోగడ వ్రాసిన నోట్‌నుబట్టి యిదే రామస్వామయ్యర్ యిదే నవలను గురించి 'much of the book seems to be silly stuff' అని అభిప్రాయపడ్డాడు (చూడు: పేజీ 40.)

** see his note in page 42.

మిగతా కౌన్సిల్ (గవర్నర్ యెక్సిక్యూటివ్ కౌన్సిల్) సభ్యులంతా అవునంటే అవునన్నారు. యింతలోనే వున్నవ నుంచి జాబొచ్చింది. పత్రికల్లో యీ ప్రశ్నల వర్షం, ప్రభుత్వ సమాధాన ధోరణిని గురించి చదివిన వున్నవ, ప్రభుత్వానికి వొక జాబు వ్రాశాడు. అయ్యదేవర సూచించినట్లు ప్రభుత్వం తెలిపే అభ్యంతరాలను గూర్చి అడ్వకేట్ జనరల్‌తో చర్చించదలచుకొన్నాననీ, ప్రభుత్వ లా మెంబర్ (సి. పి. రామస్వామయ్యర్) ప్రస్తావించినట్లు ఆ ఆరేడు అభ్యంతరకరమైన భాగాల జాబితాను తనకు తెలియజేయమనీ గుంటూరు నుంచి 18-4-27 న వ్రాసిన జాబులో కోరాడు (చూడు : అనుబంధం-9).

దీనిమీదట మళ్ళీ ప్రభుత్వ ఫైల్ రథం కదిలింది: లోగడ మన ప్రభుత్వం చేసిన వొక జి. వో. ప్రకారం అడ్వకేట్ జనరల్ ప్రయివేట్ వ్యక్తులకు 'న్యాయ సలహాలు' యివ్వడాన్ని నిషేధించి వున్నాం కాబట్టి, వున్నవ కోరినట్లు తాను అడ్వకేట్ జనరల్‌ను కలుసుకోవచ్చునా లేక దీన్నొక ప్రత్యేక పరిస్థితిగా పరిగణించి అడ్వకేట్ జనరల్ - నవలారచయిత ముఖాముఖి సమావేశానికి అనుమతించవచ్చునా అనేదొక ప్రశ్నఅయితే, యిటువంటి సందర్భాల్లో అడ్వకేట్ జనరల్ గారి సలహా ఖర్చులు యెవరు భరించాలన్నది అందుకు సంబంధించిన అనుబంధ ప్రశ్న అవుతుంది. యిక రెండో విషయం: నవలలోని అభ్యంతరకరభాగాల జాబితా రచయిత అడిగున్నాడు గనుక దాని విషయం యేమి చేయాలన్నది మరో ప్రశ్న. యీ రెండు ప్రశ్నలకు మనమేమిచేయాలి?-యిదీ ఆఫీస్‌వారి అభ్యర్థనల నోట్.

'అడ్వకేట్ జనరల్ యిట్లా వొక ప్రయివేట్ వ్యక్తిని కలిసి న్యాయ సలహాలివ్వడమనేది అంత బాగుండదేమో. నవలలోని అభ్యంతరకరమైన భాగాలను రచయితకు తెలియజేయ వచ్చుగానీ, దానివల్ల మన గుట్టు బయటపడి పత్రికల్లో వాటిని గూర్చి తర్జన భరనలు బయలుదేరినట్టయితే యెట్లా? ('...but it shows our hand and we should find the passages discussed in the press ..')—అనే కొత్త శంక వొకటి కల్గింది చీఫ్ సెక్రటరీకి.

ప్రభుత్వస్వాములకు యీ ప్రశ్నలను పరిష్కరించడం యెట్లా అనేది పెద్ద తలనెప్పి వ్యవహారమైనట్లున్నది. అందులో మంచి మే మాసం యెండలు. అడ్వకేట్ జనరల్ వూటీకి వచ్చి తనను కల్సుకోమని సి. పి. రామస్వామి అయ్యర్ 19-5-27 ఆర్డర్ వేయడంతో టి. ఆర్. వి. శాస్త్రి వూటీ వెళ్లాడు. అడ్వకేట్ జనరల్‌గా మాధవన్‌నాయర్ పోయి టి. ఆర్. వి. శాస్త్రి వచ్చాడు. వుదకమండలంలో వోయిగా యీ తిరకాసులన్నీ చర్చించుకొన్నారు. 27 వ తేదీన యీ క్రింది ఆర్డర్ వేశాడు రామస్వామిఅయ్యర్.

"The advocate general and myself have discussed this matter (at Ooty). If this author is prepared to put forward his arguments before the a.g. for the non-elision of any of the passages which will be specified by the a.g., the a.g. will hear him and thereafter advise Government as to the course to be pursued. The final action that is taken will be on the responsibility of Government."

అడ్వకేట్ జనరల్ ద్వారా తగు జాగ్రత్తలు తీసుకొని అభ్యంతరకర భాగాలను రచయితకు తెలియజేయడానికీ, అవసరమైతే ఆయనతో రచయిత ముఖాముఖి కలుసుకొని యీ విషయాన్ని సెటిల్ చేసుకోడానికీ ప్రభుత్వం అంగీకరించిందిగానీ ఎందువల్లనో యీ రెండూ పూర్తికావడానికి చాలా జాప్యమే జరిగింది. అడ్వకేట్ జనరల్ 1927 అక్టోబర్ 6 న చీఫ్ సెక్రెటరీకి వ్రాసిన జాబులో వ్రాసినదాన్నిబట్టి వున్నవ వచ్చి తనను కలుసుకొన్నాడు. అభ్యంతరకర భాగాలను తొలగించవలసిన విషయాన్ని వున్నవతో చర్చించడం జరిగింది. 18-1-28 న ప్రభుత్వం వున్నవకు లిఖిత పూర్వకంగానే అభ్యంతరకర భాగాలను తెలియజేసింది.

## అభ్యంతరకర భాగాలు

నవల మొదటి భాగం యిరవైవొకటో అధ్యాయం (బెజవాడ ఆది ఆంధ్ర సమావేశం జరగబోయేముందు సంగదాసు-వెంకటరెడ్డి సుదీర్ఘ సంభాషణల సందర్భం)లో సంగదాసు సంభాషణలో:

"మహమ్మదీయ ప్రభువులు దుండగులై కొన్ని శిల్పాలను పాడుచేశారని దూషిస్తాంగానీ ఆంగ్ల ప్రభువులు కమల కాసారంలో పడ్డ కాసరములవలె ప్రతిగ్రామమందు..."

అనే వాక్యంలో మహమ్మదీయుల ప్రసక్తితోబాటు కాసరములు అనే విశేషణాన్ని తొలగించాలి.

మొదటి భాగమే యిరవై అయిదో అధ్యాయం (చౌదరయ్య సంగదాసును చంపిన తర్వాత శవాన్ని యేం చేయాలనే సమస్యకు వ్యవహారం ఆలోచించే సందర్భం)లో పంతులు చెప్పే మాటల్లో:

"శవం కనపడగానే పోలీసు గద్దలు వాల్తవిగా. వాటిని వెళ్ళగొట్టే యేర్పాటు చేస్తాం..." అనే భాగం తీసి వేయాలి.

తర్వాత హత్య విషయం బయటికి రానీకుండా తొక్కిపెట్టగలిగిన మీదట 'లంచాల పంపకం' గురించి వున్న భాగంలో:

"మూందు నాలుగు వందలూ యిట్లా తీసుకో. ఊం యిది డిప్టీ సూప్రండెంటు అయ్యవారిది. యిది యిన్స్పెక్టరిది. యిది సిబ్బందిది. యిది గ్రామస్తులది. తీసుకోండయ్యా"- యీ వాక్యాలు తొలగించాలి.

నవల రెండో భాగంలో ప్రభుత్వానికి అభ్యంతరకరమైన భాగమేదీ కనపల్లేదు.

యిక మూడో భాగం దగ్గర కొచ్చేసరికే 'కీలకమైన' భాగాలనే పట్టుకొన్నది.

"జగ్గడి బుర్రకథాగేయం" పూర్తిగా తొలగించాలి.

రామదాసు క్రిమినల్ సెటిల్మెంట్లో నిర్భరమైన నిర్బంధ జీవితం గడుపుతూన్నప్పుడు రామానాయుడు చూడవచ్చినప్పుడు ఆ సదరు సెటిల్మెంట్ అజమాయిషీ చూసే క్రైస్తవ మతాధికారి బ్రౌన్సన్తో సంభాషిస్తూ రామదాసు అన్న మాటల్లో:

"ప్రస్తుత పాలనా పద్ధతి కింద వీటిని బాగుచేయడానికి సాధ్యంకాదు. యీ దుర్నయాలు యీ ప్రభుత్వ పద్ధతిలో అంత్యం గావలసినవే.

"రా.నా.—ఆ మాట దృఢపరుచుకొన్నావా ?

"రా.దా.—సంగదు చెప్పుతుంటే నాకు నచ్చలేదు. ప్రభుత్వ పద్ధతి యేది చూచినా మేడిపండు వ్యవహారంగా వుంది. దీనిని సవరించవలెనని ప్రయత్నం చేయడమే తప్పు. కరిగి పొయ్యవలసింది తప్ప మాట్లు వేసి ప్రయోజనం లేదు"—యీ భాగాన్ని తీసేయాలి.

యిర్వై నాలుగో అధ్యాయంలో జగ్గడు (వెంకటదాసు) ప్రభుత్వ సైన్యాలతో పోరి తీవ్రగాయాలై ప్రభుత్వానికి చిక్కి, కోర్టుముందర హాజరుపర్చినప్పుడు

మూడు పేజీల బారున అతడిచ్చిన వుద్విగ్నమైన వుపన్యాసంలో నుంచి “ఫక్తు కమ్యూనిజాన్ని ప్రబోధిసూ ధనిక స్వామ్యంపై శ్రామికుల సంఘీభావాన్ని, సమ్మెలను ప్రోత్సహించే భాగాలు ‘passages preaching rank Communism and encouraging the union of labour against capital and strikes’ అని ముద్రవేసి యీ కింది పన్నెండు వాక్యాలను తీసివేయడమో తగు విధంగా మార్పులు చేయడమో చేయాలి :

“అది దాలిని ఐశ్వర్యవంతులు తక్కినవన్నీ అరుపుకున్నారు”— అనే వాక్యం తర్వాత వచ్చే :

> “రాజ్యాలు మండలాలు పట్టణాలు వాండ్ల పరమయినవి. పెద్దదొంగా చిన్నదొంగా అనే భేదంతో అందరూ దొంగలే. సంఘంయొక్క ఆస్తి అంతా అపహరించి శాశ్వతంగా వంశపారంపర్యంగా నిలుపుకోడాని కనుకూలమయిన చట్టాలు గల్పించుకొన్నారు.”

“కష్టపడి పంటలు పండించి చేతిపనులు జేసి అమర్చిన పదార్థమంతా ధనవంతు లపహరించి తిని తొక్కతొంబాడిచేసి శ్రమపడి పనిజేసేవాండ్లకు ఆహారం లేకుండా చేస్తున్నారు”—యీ వాక్యం తర్వాత వచ్చే :

> “భాగ్యవంతుల పండగలు బీదవాండ్ల కెండగలు. భాగ్యవంతుల కరువులు బీదలకు పస్తులు. భాగ్యవంతులు పొలాలు తమవనీ మూలధనం తాము బెట్టి బీదలకు యంత్రములలో పని కల్పిస్తున్నామనీ అనేక సాకులు గల్పించి పనివాండ్ల శ్రమయొక్క ఫలమంతా అపహరించడం నమ్మకద్రోహం గాదుట. అది దొంగతనమే గాదుట. ఆ ఆస్తిలో దొంగలకేకాక వారి సంతానానికి కూడ చిరకాల హక్కు కలుగుతుందిట.”

“బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం”—అనే వాక్యం తర్వాత :

> “సుంకాలు విధించి దేశీయవృత్తులను నశింపుజేసి వేలకోట్లు యిండియాధనాన్ని హరించడం దొంగతనంగాదని చట్టం చెపుతున్నది. యీ పనులు తప్పన్నా వీటిని సవరించినా చౌర్యమూ రాజద్రోహమూ అవుతుందని చట్టాలు జేసి పెట్టుకున్నారు.”

"కలియుగంలో రాక్షసులు లేరంటారుగాని ధనికులే కలియుగ రాక్షసులు" అనే వాక్యం తర్వాత వచ్చే:

> "యీ రాక్షసత్వం బీదల హింసించడంవల్ల వాండ్లకు కలిగింది. ధనభారమే వాండ్లను కుంగదీస్తున్నది. వాండ్ల ఆత్మలూ దేహాలూ గూడా దుష్కర్మలవల్ల విరూపమును బొందుతున్నవి."

యీ వాక్యాలను పూర్తిగా తొలగించడమో తగువిధంగా మార్పులు చేయడమో చేయాలని ప్రభుత్వం విధించిన ఆంక్ష. యిది కొండను తవ్వి యెలుకను పట్టడమవుతుందో కాదోగానీ మొత్తంమీద ప్రభుత్వం చూపిన అభ్యంతరకరమైన భాగాలివి. వీటిని తొలగించినట్లయితే నవలను తిరిగి అచ్చు వేసుకోవచ్చునట.

వీటిని వొక్కొకటిగా పరిశీలిద్దాం.

ఆ మాత్రపు మహమ్మదీయుల ప్రస్తావననే బ్రిటీష్ ప్రభుత్వం యెందుకు వోర్చలేకపోయిందో యిప్పుడు ఆశ్చర్యంగా కన్పించవచ్చుగానీ అప్పట్లో స్పష్టమైన చారిత్రక కారణాలే వున్నాయి. మొదటి ప్రపంచయుద్ధం రోజుల్లో బ్రిటీష్‌వాళ్లు టర్కీకి ప్రత్యర్థులు కావడంతో యిండియాలోని ముస్లిమ్ల బ్రిటీష్ వ్యతిరేకత యినుమడించింది. అంటే అంతర్జాతీయ రాజకీయాలు కూడా తోడయ్యాయన్నమాట. ఇండియాలో ఖిలాఫత్ వుద్యమం చెలరేగింది. 1921 లో అలిఘర్, డెహ్రాడూన్, జాన్‌పూర్ వగైరా ప్రాంతాల్లోని ఖిలాఫత్ సమాజాలు ప్రచురించిన పెక్కు ముస్లిమ్‌జాతీయతా ప్రబోధగ్రంధాలను బ్రిటీష్ యిండియా ప్రభుత్వం వొక్కపెట్టున నిషేధించింది.[47] ముస్లిమ్‌లలో పెచ్చుపెరిగిపోతున్న యీ అసంతృప్తిని, బ్రిటీష్ వ్యతిరేకతను గాంధీజీ బాగానే ఆసరాచేసుకొని వారిని కాంగ్రెస్‌లోకి ఆకర్షించుకోగలిగాడు. యీ వాతావరణంలో బ్రిటీష్ వుద్యోగుల కలవరాన్ని అర్థం చేసుకోవచ్చు.

1918 లో జి. కె. చెస్టర్‌సన్ తన కొత్త గ్రంథంలో వొకచోట Moslems denied even soul to women అని వ్రాసినందుకు బ్రిటీష్ సి. అయ్. డి. పోలీసులు పసిగట్టి 'బ్రిటీష్ దేశభక్తి' దృష్ట్యా అయినా దాన్ని తొలగించమని వొత్తిడి తెచ్చారంటే బ్రిటీష్‌వారి బిత్తరగూర్చి వేరే చెప్పాలా?[48] ఇండియాలోని

47. N. Gerald Barrier, 'Banned Controversial Literature and Political Control in British India 1907-1947' (New Delhi, 1976), Pp. 195, 243.

48. పై గ్రంథమే, పేజీ 72.

ముస్లిమ్లను తమవైపుకు దువ్వుకోవడమెట్లా అనేది అప్పట్లో బ్రిటీష్ వుద్యోగస్తులకు నిత్యసమస్య అయిపోయింది. అందువల్లనే భారతీయ సాహిత్యరచనల్లో ముస్లిమ్ వ్యతిరేకభావాలు వీలైనంతగా లేకుండా చేస్తే మంచిదనుకొన్నారు. మాలపల్లిలోని యీ మొదటి అభ్యంతరకర భాగం వెనుక ఆనాటి బ్రిటీషిండియా ప్రభుత్వ ఆదుర్దాను చూడవచ్చు.

యిక ప్రభుత్వశాఖల్లో పేరుకొనివున్న దుర్నీతి, లంచగొండితనాల చిత్రీకరణలపట్ల అభ్యంతరం చెప్పిందంటే పాలకవర్గాల పచ్చి బలహీనతను బట్టబయలు చేస్తున్నది. గుమ్మడికాయ దొంగలంటే భుజాలు తవుడుకున్నట్లు బాహాటంగా బయటపడిపోయింది.

ప్రత్యేకంగా పేర్కొనవల్సింది యింకా మిగిలేవుంది. జగ్గడి బుర్రకథాగేయాన్ని, కోర్టు వుపన్యాసంలోని వర్గపోరాట భావజాలం గల వాక్యాలకు ప్రభుత్వం నిస్సిగ్గుగా అభ్యంతరం పెట్టిందంటే అది యే వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదో చెప్పకనే చెప్తున్నది. ఆ నాటికి తెలుగులో యీ మాత్రపు కమ్యూనిస్టు భావాలను, అంత వుద్విగ్నంగా విన్పించే వాక్యాలను ప్రభుత్వం బహుశా విని వుండదు. రష్యన్ అక్టోబర్ విప్లవం తర్వాత, యిండియాలో కమ్యూనిస్టు భావవ్యాప్తి జరక్కుండా సర్వ జాగ్రత్తలూ తీసుకొంటూన్న ఆనాటి బ్రిటీష్ యిండియా పాలకులకు యీ వాక్యాలు ములుకుల్లా తగిలుండాలి.

## వున్నవ చేసిన వాదాలు

యిట్లాంటి సందర్భాల్లో యింతదూరం వచ్చిన తర్వాత ప్రభుత్వంతో వాదనకు దిగి యెదుర్కొన్నందువల్ల పెద్దగా ప్రయోజనం వుండదని వున్నవకు తెలియని విషయంగాదు. అందువల్లనే 30-1-28న ఆయనిచ్చిన సమాధానంలో మొండిపట్టు ప్రదర్శించలేదు. అట్లని వాదించకనూ పోలేదు.

తక్కళ్ళ జగ్గడి కోర్టు వుపన్యాసభాగాల విషయమై తన వాదనేదో స్పష్టంగానే విన్పించాడు :

> **"I have to state that it is not wrong to preach communism or to encourage the union of labour against capital and strikes and yet in deference to the**

> suggestion of the Honourable the Law Member, I propose to make the following alteration by omitting the strongly worded passages...."

యిట్లా తన నిరసనను తెలియజేస్తూనే వాళ్లు చెప్పిన పన్నెండు వాక్యాలూ పూర్తిగా తొలగించాడు. ఆ వాక్యాలు తీసివేసినందువల్ల తాను వ్యక్తీకరించ దల్చు కొన్న 'వర్గపోరాట' భావతీవ్రత, తీక్షణత కొంత తగ్గినమాట వాస్తవమే అయినా, మొత్తమ్మీద ఆ భావానుభూతి పాఠకుడిలో కలక్కుపోదని తృప్తిపడ్డట్లున్నది.

యిక జగ్గడి బుర్రకథా గేయాన్ని ఏ కారణం చెప్పకుండానే సమూలంగా తొలగించమని ప్రభుత్వం పట్టుబట్టినప్పుడు తెలివిగానే తన వాదనను ప్రదర్శించాడు:

> "...there is not one line that is objectionable in the whole poem. The ideas are moderate and not at all strongly worded. The language used is very mild. The ideas contained in the poem are pure and simple *Vedanta*. This contrast between the *Krita* and *Kali* ages is available in any *Purana*. Hence it is requested that this objection may be waived especially having regard to its literary value. In short, I agreed to carry out all the suggestions made .... I therefore request that objection relating to the poem may not be pressed."

పున్నవ జవాబును మళ్ళీ అడ్వకేట్ జనరల్‌కు పంపి తఫిసీళ్లైనా వుంటే తెల్పమన్నది ప్రభుత్వం. వొక్క బుర్రకథా గేయం విషయంలో తప్ప ప్రభుత్వం చెప్పిన మిగతా అన్ని అభ్యంతరకర భాగాలనూ తొలగించడానికి రచయిత అంగీక రించినప్పుడు, యీ వొక్క గేయంలో ప్రభుత్వం తన అభ్యంతరాన్ని వుపసంహరిం చుకో వచ్చునని 1928 ఫిబ్రవరి 27 న అడ్వకేట్ జనరల్ వ్రాసిన తర్వాత ఆ గేయం పట్ల తన పట్టు సడలించుకొని మిగతా భాగాలు మాత్రం తొలగించి ప్రచురించు కోడానికి సమ్మతిస్తూ వున్నవకు తన అంగీకారాన్ని తెలియజేసింది ప్రభుత్వం 30-3-28న. తిరిగి ముద్రించేటప్పుడు మాత్రం అట్టమీద 'రివైజ్డ్ యెడిషన్' అని విధిగా అచ్చు వేయాలని షరతు పెట్టింది.

అభ్యంతరకరమైన వాక్యాలు పట్టుమని యిరవై అయినా చూపలేకపోయి నప్పటికీ ఆరువందల పైచిలుకు పేజీలున్న నవలను నిషేధానికి గురిచేసి ప్రభుత్వం యింత తతంగం జరిపించడం ఆశ్చర్యంగానే వుంది!

# పునర్ముద్రణ - పునర్నిషేధం

1923 మే నెలలో నిషేధించిన మాలపల్లి నవలను రచయిత మళ్లీ ముద్రించుకోడానికి అభ్యంతరాలు చూపీ, షరతులుపెట్టీ, కొన్ని కోతలకు గురిచేసీ, కొన్ని భాగాలను తొలగించేసీ, ప్రభుత్వం యెట్టకేలకు 1928 మార్చి 30 న అనుమతిని ప్రసాదించింది. తర్వాత యేడేళ్ళకుగానీ రెండో యెడిషన్ రాలేదు.

మొదటి యెడిషన్ 1922-23 లో అచ్చయినప్పుడు - కాపీలు కావలసిన వారు యీ క్రింది "అడ్రసుకు వ్రాసిన బడయగలరు" అని మూడు అడ్రసులు వెనక అట్టమీద ముద్రింపబడ్డాయి: (1) బెజవాడ (ఆంధ్ర పరిషత్తు), (2) గుంటూరు (వున్నవ లక్ష్మీనారాయణ), (3) పమిడిపాడు-నరసరావుపేట పోస్టు (బెల్లంకొండ రాఘవరావు). నిషేధం అమలులోవున్న అయిదేళ్ళ కాలంలోనూ యీ మూడు చోట్లనుంచీ పోలీసులు నవల కాపీలు యెన్నింటిని స్వాధీనపర్చుకొన్నారో తెలియదు గానీ, 1928 జూలై 19 న కృష్ణాశ్రమం (ఆది ఆంధ్రులు, అంటే హరిజనులను బాగుపరచేందుకు యేర్పడిన ఆశ్రమం) లో[49] విద్యార్థులకు జరిగిన పోటీల్లో మాలపల్లి ప్రతిని బహూకరించడం జరిగింది. యీ కాపీలో మొదటి భాగంలోని 114 పేజీ మినహా ప్రభుత్వం సూచించిన మిగతా అభ్యంతరకర భాగాలున్న పేజీ అన్నీ చించివేయబడినట్లు పసిగట్టిన పోలీసులు వున్నవ యిల్లు సోదా చేశారు. వాళ్ళకు వొక్క కాపీమాత్రం దొరికింది.

---

49. కృష్ణాశ్రమంగూర్చి చూడు: యీ పుస్తకం 120 పేజీలో 17 వ నెంబరు పాదపీఠిక.

పోలీసువాళ్ళకు వున్నవ యిచ్చిన స్టేట్‌మెంట్‌లో తనవద్ద మిగిలిన షుమారు 80 కాపీలకు అభ్యంతరకరభాగాలను తొలగించి మళ్లీ ఆ పేజీలను మాత్రం తిరిగి ముద్రింపించి రీ బైడింగ్ చేయమని వొక బెజవాడ ప్రెస్ కిచ్చినప్పుడు, వొక పాత కాపీ యెట్లనో పొరపాటున తనవద్ద వుండిపోయిందనీ, అదే యిదనీ చెప్పాడు. యీ వైనమంతా సి.ఐ.డి. వాళ్లు 23-7-1928 న ప్రభుత్వానికి తెలియపర్చారు.

యిది జరిగిన కొన్నాళ్లకు 1928 నవంబర్ 23 న వున్నవ గుంటూరు డి.యస్. పి.కి వొక జాబు వ్రాశాడు. నవల పాతకాపీల్లోనే అభ్యంతరకరభాగాలను తీసేసి, ఆ పేజీలస్థానే కొత్తవి ముద్రించి తిరిగి బైండ్ చేయించినవి తనవద్ద 60 దాకా మిగిలివున్నాయనీ, డబ్బువసతి వున్నప్పుడు, నవలకు తగిన గిరాకీ వున్నదన్నప్పుడు గానీ రివైజ్డ్ యెడిషన్ తీసుకురావడం పడదు గనుక, యీలోగా రీబైండైన 60 కాపీలను అమ్ముకోడానికి అనుమతివ్వమనీ సూపరింటెండెంటును కోరాడు. దీనిమీదట మరోఫైల్ తయారైంది. రివైజ్డ్ యెడిషన్ ముద్రించుకోడానికి మాత్రమే ప్రభుత్వ ఆర్డర్‌గానీ, పాత యెడిషన్‌లో కొన్ని పేజీలు తీసేసి కొత్తవి చేర్చి బైండ్ చేయించి అమ్ముకోడానికి వర్తించదు గదా అని వొక 'లీగల్ పాయింట్' లేవదీసి ప్రభుత్వానికి వ్రాయగా, ప్రభుత్వం తర్జన భర్జనలు జరిపి కడకు వుదారంగానే ఆ కాపీ లను అమ్ముకోవచ్చు నన్నది.

దీంతో మాలపల్లి మిగిలిన పాతకాపీలన్నీ అమ్ముడైపోయి వుండాలి. యీ నవలపట్ల తెలుగు పాఠకులు విశేషమైన ఆదరణను ఆసక్తిని సహజంగానే ప్రదర్శించి వుండాలి. కేవలం నిషేధించబడ్డ నవల అయినందువల్లనే కాదు.

తెలుగువాళ్ళలో క్రమంగా చొచ్చుకొని వస్తూ వచ్చిన వివిధ జాతీయోద్యమ పాయలు మూలంగా వారిలో పెరుగుతూవచ్చిన రాజకీయ చైతన్యంమూలంగా యీ నవలకు గిరాకీకూడా సహజంగా అధికమై వుండాలి. పైగా నవల మూడుభాగాలు మాత్రమే అచ్చయి, మధ్యలో నిషేధానికి గురై నాలుగోభాగం అసలు అచ్చు కాకుండానే మిగిలిపోయింది గనుక దాన్నికూడా చేర్చి సంపూర్ణ నవల అచ్చువేస్తే బాగా అమ్ముడు పోవచ్చునని వ్యాపారదృష్టివున్న ప్రచురణకర్త అంచనాలకు సరి పోయేనవల మాలపల్లి. 600 పేజీలకు పైబడిన గ్రంథం కాబట్టి, యెక్కువ పెట్టు బడైనా పెట్టి రెండో యెడిషన్ను తీసుకొస్తే 'హాట్ కేక్స్' లాగా అమ్ముడవుతా యనే లాభసాటి బేరీజులకు అనువైన నవల.

1935 సెప్టెంబర్ నాటికి మాలపల్లి 'రివైజ్డ్' యెడిషన్ వచ్చింది. యీ యెడిషన్‌ను తీసుకొచ్చింది ఆంధ్రపత్రిక జనకుడు కాశీనాథుని నాగేశ్వరరావు. తన సొంత 'ఆంధ్ర గ్రంథమాల' తరఫున విడుదలైన ప్రచురణ. అచ్చయింది 'ఆంధ్రపత్రిక' ప్రెస్‌లో. యీ రెండో యెడిషన్ ప్రచురణగూర్చి వొక సమకాలిక రచయిత వ్రాస్తున్నాడు చూడండి: "సహాయ నిరాకరణోద్యమం విజయం సాధించినట్లు చిత్రిస్తూ వ్రాసిన నాల్గవభాగంతో వెలువడిన రెండవకూర్పు నిషేధింపబడలేదు."[50] యిది శుద్ధ పొరపాటు. యీ రెండో 'కూర్పు' కూడా ప్రభుత్వనిషేధానికి గురికాక తప్పలేదు. అయితే యీ నిషేధం ఆట్టే యెక్కువకాలం మాత్రం అమలులో లేదు.

1935 ఆగస్టు 21 (యువ సంవత్సరం శ్రావణ బహుళ 8) బుధవారంనాడు యీ అచ్చయిన రెండో యెడిషన్‌కు కాశీనాథుని నాగేశ్వరరావు వ్రాసిన 'తొలిపలుకు'లో "ఆంధ్ర సాహిత్య పరిణామమువందు మాలపల్లి నిరుపమానమైన గ్రంథము" అని శ్లాఘిస్తూనే "ప్రభుత్వము చేసిన నిషేధమే మాలపల్లికి ప్రఖ్యాతి గలుగజేసినది" అని వొక వ్యాపారధోరణి వాక్యం వ్రాయకుండా వుండలేకపోయాడు. కాశీనాథునివారు యెంత 'దేశోద్ధారక-విశ్వదాత' అయినా, ఆయనలో బిజినెస్‌ను బిజినెస్‌గా చూచే ప్రజ్ఞాదృష్టి లేదనుకోరాదు. 'శారదా నికేతన్' నిర్వహణలో వున్నవ దంపతులకు అడపాదడపా వుదారంగా ఆర్థికసహాయం చేస్తూ వచ్చినవాడు గాబట్టి, ఆ 'ములాజా'తో ద్వితీయ ముద్రణ హక్కులను వున్నవనుండి సులువుగానే రాబట్టుకొని వుంటాడు. అట్లా వచ్చిందే మాలపల్లి రెండో యెడిషన్.

కాశీనాథుని నాగేశ్వరరావు తన 'తొలిపలుకు'లో ఆ నవలలోని వర్గదృష్టి భావజాలం తాలూకు ప్రాముఖ్యాన్ని తగ్గించివేసి - అహింస, స్వరాజ్యం, సత్యాగ్రహం వగైరా గాంధేయవాద భావనలకు ప్రాధాన్యమూ ప్రచారమూ కలగజేయాలనే 'కాంగ్రెస్ తలంపు' ఆయనలో బలంగా పని చేసిందా? లేకపోతే, అశ్వద్ధామ హాతాహాత కుంజరః అన్నట్లుగా జగ్గడి 'సామ్యవాద' వుద్యమ ప్రాతినిధ్యాన్ని "సాంఘిక పరివర్తనమువందు నూతనాధ్యాయము" అంటూ "సంభవామి సంభవముల"

---

50. కంభంపాటి సత్యనారాయణ, 'అర్థ (sic) శతాబ్దికాలంలో ఆంధ్రులపైని అక్టోబర్ విప్లవప్రభావం', మద్రాసు, 1973, పేజీ 20. యీ వాక్యం తర్వాతనే "అది (మాలపల్లి రెండో యెడిషన్) 1935 లో 'ఇంటర్మీడియ'ట్‌కు పాఠ్యగ్రంథంగా కూడా వుండేది" అనికూడా వ్రాశారు. యింటర్మీడియట్‌కు కాదు, బి. యె. కి. ఆ తర్వాత అదీ వుపసంహరించుకో బడింది.

పేరుతో వాక్కు మాటలలో కొట్టిపారేసి 'అహింసా' తత్వధోరణిలో ఆయన మొత్తం పీఠికంతా కొనసాగడంలో అర్థమేమిటి? 51

ఆచార్య యన్. జి. రంగా ఆక్స్‌ఫర్డ్ చదువు పూర్తిచేసుకొని 1920 లో మద్రాసొచ్చి ఆర్థిక శాస్త్ర ఆచార్యుడుగాచేరి, ఆ దరిమిలా రైతు వుద్యమాలకు మనసిచ్చి, కొత్తరకం రాజకీయాలు ప్రవేశపెట్టి సొంతవూరు నిడుబ్రోలులో స్థాపించిన రైతాంగ విద్యాలయం తరపున తీసుకొచ్చిన 'రైతు భజనావళి' గీతాల సంకలనంలో మాలపల్లిలోని తక్కెళ్ళ జగ్గడి బుర్రకథా గేయాన్ని చేర్చాడు.

అట్లానే ఆంధ్రలో కమ్యూనిస్టుద్యమం నెమ్మదిగా వేరూనుతున్న రోజులవి. 1933-34 లో కూలి రక్షణసమితులు, రైతుసంఘాలు యేర్పడి సన్న జనంలోకి ఆ వుద్యమం జోరబడుతున్న రోజుల్లో మాలపల్లిలోని కొన్ని భాగాలను కరపత్రాలుగా అచ్చువేయించి తమ ప్రచారానికి అప్పటంగా వినియోగించుకోవలసి వచ్చింది. 52 అంటే వున్నవ మాలపల్లిని యిటువంటి 'అపకీర్తి' నుండి తప్పించడం కాంగ్రెస్

---

51. అర్థమేమైనా, మరుపూరు కోదండరామరెడ్డిగారిచే పంక్తీకరింపబడిన మాలపల్లి నవలను యిటీవల (1976) కేంద్రసాహిత్య అకాడమీ అచ్చువేసినప్పుడు కూడా, మొదటి యెడిషన్‌కు లేని కాశీనాథుని పీఠికను తెచ్చి వేయడం మనవారి చారిత్రక దృష్టిదోషమనే చెప్పవలసి వుంటుంది. కొత్తగా వచ్చిచేరిన బెజవాడ గోపాలరెడ్డిగారి 'మున్నుడి' కూడా మాలపల్లి నిర్వహించిన విపుల చారిత్రక భూమికకు న్యాయం చేకూర్చలేకపోయింది.

52. 'ఈనాడు' దినపత్రిక(విజయవాడ యెడిషన్. 30-11-78 సిటీ యెడిషన్)లో తుమ్మల వెంకట్రామయ్యగారి ప్రసంగం. తు. వెం. గారు ఆ ప్రసంగంలో చెప్పిన ఆనాటి 'అజ్ఞాత కమ్యూనిస్టుల' ఆధ్వర్యంలో 'కూలి రక్షణ సమితులు' పంపకం చేసిన కరపత్రాలు, వాటి మూలంగా వాళ్ళమీదకు వచ్చిన కేసులు, శిక్షలు వగైరా వివరాలను మద్రాసు, తమిళనాడు ఆర్కివ్స్‌లోని యీ క్రింది రికార్డులలో పరిశీలించవచ్చు. కొన్నలగడ్డ రామలింగయ్య, కె. సత్యనారాయణ, దుర్భా కృష్ణమూర్తి, పి. రామసుబ్బయ్యలపై వచ్చిన గుంటూరు కరపత్రాల కేసుకు సంబంధించిన హైకోర్టు జడ్జిమెంటు వివరాలు హోమ్‌శాఖ కాన్ఫిడెన్షల్ జి. వో. నెం. 1269 3-7-1936 నాటిది. (యిందులోనే రంగాగారి 'రైతు భజనావళి' గూర్చి వచ్చిన గొడవకూడా వున్నది). 'నెల్లూరుజిల్లా ప్రముఖ కమ్యూనిస్టులు' రావి ఆదిశేషయ్య, చండి జగన్నాథంపై వచ్చిన కేసుకు సంబంధించి హోమ్ కాన్ఫిడెన్షల్ జి. వో. నెం. 1291 (10-7-1936 నాటిది) చూడవచ్చు. (యిందులో మొదటి జి. వో. ప్రస్తావన అనుబంధం 12 లో వస్తుంది, గమనించ ప్రార్థన). ఈవిషయమై జగన్నాథంగారికి జాబువ్రాస్తే కరపత్రాల కంటెంట్స్ విషయం గుర్తు లేదు గానీ, నెల్లూరు కోర్టుముందు జరిగిన విచారణలో 'మాలపల్లి' చర్చల్లోకి రావడం బాగా జ్ఞాపకం వున్నదని యిటీవల వ్రాసిన జాబులో తెలియజేశారు.

అభిమాని కాశీనాథుని నాగేశ్వరరావు తన పవిత్ర బాధ్యతగా కూడా స్వీకరించాడా ?

యిక్కడ మరో సందేహం. మూడుభాగాల నిషేధానంతరం, అచ్చుగాకుండా మిగిలున్న నవల ముగింపు భాగమైన నాలుగోభాగం యిప్పుడు తొలిసారిగా ముద్రణను నోచుకొంటున్నది గనుక, యీ నాలుగో భాగంలో అహింసా-సత్యాగ్రహోద్యమానికి అనుకూలంగా కీలకమైన మార్పు లేమైనా చేయించాడా ? లేమైనా కాశీనాథునివారు మాలపల్లి రెండో యెడిషన్‌ను తీసుకురావడంలో ఆ నవలను అటూ 'లెఫ్ట్' పంథాలోకి పడిపోకుండా, 'రైట్' వైపుకు మళ్ళించుకోవాలనే ప్రయత్నంకూడా వున్నదా అనిపిస్తున్నది.53

ఆంధ్ర సాహిత్య- రాజకీయరంగాల్లో కాశీనాథునికి అప్పట్లో విశేషమైన పలుకుబడీ ప్రాబల్యమూ వున్నాయి కాబట్టే యీ రెండో యెడిషన్ వచ్చీ రాకముందే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి. యే. నాన్ డీటైల్డ్ పాఠ్యగ్రంథంగా నిర్ణయించడంకూడా చకచకా జరిగిపోయింది.54

యీ సందర్భంలో వొకవిషయం పరిశీలించవలసి వున్నది. జనానికీ, జన జీవితానికీ యోజనాలదూరంలో వుంటూ కృతకమైన మృతభాషలో వ్రాయబడ్డ గ్రంథాలకే యూనివర్సిటీ పాఠ్యప్రణాళికలో పనిగట్టుకొని పట్టం కట్టించబడుతున్న రోజులవి. ఆ రోజుల అవశేషాలు యింకా దృఢంగానే కొనసాగుతున్నాయి. విద్యారంగంలో వొక ప్రభుత్వ వ్యవస్థ దీటైన తమ పండితపీఠ వ్యవస్థ గల చెలామణిని చెక్కు చెదరనీకుండా పరిరక్షించుకొంటూ, వాడుక భాషలోని గ్రంథాలను యూనివర్సిటీ పాఠ్యప్రణాళిక సమీపంలోకికూడా రానీకుండా సర్వజాగ్రత్తలు తీసుకొంటూ దుర్గాలు నిర్మించుకొంటూ దడులు కట్టుకొస్తున్న మన తెలుగు పండితులు, అక్కడక్కడా గ్రాంథిక భాషా ధోరణులున్నా మొత్తంమీద ప్రజాతంత్ర

53. యిదిట్లా వుంటే, యీనాడు కొందరు సాహిత్య వుగ్రవాదులు యీ నవల్లో కమ్యూనిస్టు భావాలేమున్నాయ్ అని తమ గత చరిత్రను విస్మరించి యీసడింపులకు దిగడం కేవలం కాశీనాథుని వంటివారు మెచ్చుకొన్నందువల్లనేనా ? మన సాహిత్యచరిత్ర విషయంలో, వుద్యమాల పరిణామవిషయంలో వీరు అలవర్చుకొన్న జాతీయ చారిత్రక అవగాహనను శంకించవలసి వస్తున్నది.

54. దీన్ని పాఠ్యగ్రంథంగా నిర్ణయించేనాటికీ, తర్వాత వుపసంహరించుకొనేనాటికీ ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.

దృష్టితో నిమ్నగా వాడుక భాషలో వ్రాయబడిన యీ నవలను అప్పట్లో ఆంధ్ర విశ్వవిద్యాలయ పండితులు యెట్లా పాఠ్యగ్రంథంగా నిర్ణయించారో మరి ?[55] ప్రచురణకర్త కాశీనాథుని ప్రాబల్యమా ? రచయిత వున్నవ త్యాగమయ వ్యక్తిత్వంమీద గౌరవమా ? గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలనుకూడా మింగి వేయగలిగే వుజ్వల జాతీయాభినివేశంతో వచ్చిన నవల గనుకనా ? అప్పట్లో తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్ మెంబర్లుగా వున్నవారు కేవలం యాదృచ్ఛికంగానే యీ నిర్ణయం తీసుకొన్నారా ? లేక దీని వెనుక యితరేతరమైన శక్తులేమైనా పని చేశాయా ? యీ అంశాలను వివరంగా పరిశోధించవలసి వుంది.

1935 ఆగస్టు-సెప్టెంబర్‌లో యీ రెండో యెడిషన్ విడుదలైందనుకొంటే, యేడాది తిరక్కముందే 1936 జూలై 3న ప్రభుత్వం దాన్ని నిషేధిస్తూ ఉత్తర్వులు జారీచేసింది. యీ నిషేధపు టుత్తర్వు గెజిట్‌లో కూడా ప్రకటితమైంది.

1936 ఆగస్టు 8 శనివారం 'కృష్ణాపత్రిక' యెడిటోరియల్ వ్రాసినట్లు లేదు గానీ 'వివిధ విషయములు' అనే శీర్షిక క్రింద నిషేధవార్తమాత్రం ప్రకటించింది.

"ఉన్నవవారి మాలపల్లి

"గుంటూరు శారదానికేతన నిర్వాహకులగు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' యను నవలను ప్రభుత్వమువారు మొదట నిషేధించి, దరిమిలాను కొన్ని భాగములను తీసివేసి తిరిగి ప్రచురించుటకు అనుమతి నొసంగియుండిరి. అట్లే పునర్ముద్రణము జరిగెను. దీనినికూడా ఇప్పుడు ప్రభుత్వమువారు నిషేధించినారని తెలియుచున్నది. గుంటూరు సి.అయ్.డి. సబు ఇన్‌స్పెక్టరు వెంకటేశ్వరరావుగారు జూలై 29వ తేదీని శారదా నికేతనమును సోదాచేసి 127 ప్రతులను దీసికొనిపోయి

---

55. మారిన మారుతున్న పరిస్థితులకు మరో తార్కాణం, మళ్ళీ 40 యేళ్ళతర్వాత శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం బి.యే.కి వుపవాచకంగా నిర్ణయించింది. వ్యావహారికభాషకు జరిగిన జరుగుతున్న అన్యాయాన్ని, ప్రత్యేకించి వున్నవ మాలపల్లికి జరిగిన యీ అన్యాయాన్ని సరిదిద్దింది. 18-8-75 లో జరిగిన బోర్డ్ ఆఫ్ స్టడీస్ సమావేశంలో బి.యే. 1977 పరీక్షలకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించడం జరిగింది. సందర్భం వొచ్చింది గనుక ప్రస్తావించవలసి వస్తున్నది. యీ సంవత్సరం బి.యే. డిగ్రీ పాఠ్యగ్రంథంలో డాక్టర్ యస్. టి. నరసింహాచారి గారు దిగంబర కవిత్వంపై వ్రాసిన వ్యాసాన్ని మొదట చేర్చి తర్వాత వుపసంహరించడం వెనక కుట్రవంటిది వున్నదని నెల్లూరు వారపత్రిక 'జమీన్‌రైతు' (9-2-79) వ్రాసిందంటే కొత్తరకం సాహిత్య రాజకీయాలు యెట్లా పనిచేస్తున్నాయో చూడవచ్చు.

రట. ఈ 'మాలపల్లి'ని ఆంధ్ర యూనివర్సిటీవారు 1937 బి. యే. పరీక్షక పాఠ్య గ్రంథముగ నిర్ణయించి అధికారుల మందలింపు వలన గాబోలు తిరిగి తీసివైచిరి.''[56]

మాలపల్లి నవలను మొదటిసారి అయిదేళ్ళ నిషేధంలోవుంచి, ఆ తర్వాత కొన్ని షరతులకు లోబడి పునర్ప్రచురణకు ప్రభుత్వం అనుమతించగా, ఆ షరతులను తు.చ తప్పకుండా పాటించి మళ్లీ ముద్రించిన తర్వాత, తిరిగీ నిషేధానికి గురి చేయడం విడ్డూరంగానే కనపడుతుంది. యీ నిర్ణయం వెనక మళ్ళీ కొత్తరకం రాజకీయాలు బలంగా పని చేశాయని స్పష్టంగానే తెలిసిపోతుంది.

రెండోసారి నిషేధ నిర్ణయం తీసుకొనేనాటికి (17-6-36) గవర్నర్ యెర్ స్కిన్ కింద యెగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సి. పి. రామస్వామయ్యర్ వగైరాలు పోయి, కె. వి. రెడ్డినాయుడు, యే. టి. పన్నీరుసెల్వమ్, చార్లెస్ సౌటర్, జాక్ బ్రేకన్ పనిచేస్తున్నారు. బొబ్బిలిరాజా, యమ్. యే. ముత్తయ్యచెట్టియార్, పి. టి. రాజన్ మంత్రులుగా వున్నారు. రెండోసారి నిషేధంలో కె. వి. రెడ్డినాయుడు పాత్ర విశేషంగా వున్నది. మొదట్లో యిద్దరు కౌన్సిల్ సభ్యులు రెండో నిషేధానికి వ్యతిరేకంగా వ్రాసినప్పటికీ, అడ్వకేట్ జనరల్ అల్లాడి కృష్ణస్వామి వద్దని వారించినప్పటికీ, రెడ్డినాయుడు యేదో కక్షకొద్దీ నిషేధించాలని గట్టిగా నోట్ వ్రాశాడంటే, దీనివెనుక చావుకు సిద్ధంగావున్న ఆంధ్ర జస్టిస్ పార్టీ రాజకీయాలను సులువుగా అర్థం చేసుకోవచ్చు. యీ నిషేధ నిర్ణయం తీసుకొన్న రోజున్నే గవర్నర్ యెర్‌స్కిన్ సెలవుమీద వెళ్ళడం, ఆ స్థానంలో తాత్కాలిక గవర్నరైన రెడ్డి హయాంలో యీ నిషేధం అమలుకు రావడం గమనించవలసిన విషయం.

ఆ తర్వాత వొక యేడాదికి 1937 జూలై 14 న రాజాజీ మంత్రివర్గం యేర్పడడం, యేర్పడిన పక్షం రోజుల్లోగానే మాలపల్లిపై నిషేధాన్ని తొలగించి పారేస్తూ 'ప్రధానమంత్రి'గా రాజాజీ ఆర్డర్ వేయడం సరసరా జరిగిపోయింది.[57]

---

56. చూడు : 1936 ఆగస్టు 8 శనివారం 'కృష్ణాపత్రిక'.

57. ప్రధానమంత్రి అయిన 14 రోజుల్లోనే రాజాజీ యీ నిర్ణయం తీసుకొన్నాడంటే-యేదైనా మంత్రిమండలి సమావేశంలో- కనీసం తెలుగు మంత్రిపుంగవులతో యీ విషయం చర్చించి వుండొచ్చునని ఆశించి, అప్పటి కార్మికమంత్రి- వున్నవకు డబ్లిన్‌లో సహాధ్యాయీ అయిన వి. వి. గిరిగారిని యిటీవల మద్రాసులో కల్సుకొని మాట్లాడితే, యీ నవల అసలు నిషేధానికి గురైన వైనమే తనకు గుర్తున్నట్లుగా వ్యవహరించలేదు. సాహిత్యవిషయాల్లో శ్రద్ధాసక్తులు కనపర్చే వ్యక్తిగా పేరువడ్డ బెజవాడ గోపాలరెడ్డిగారు (మరో మంత్రివర్గసభ్యుడు, వున్నవచేత తన పెళ్లిని జరిపించుకొన్నవారూ) కూడా యిట్లాగే వ్యవహరించారు.

